# ఉత్తిష్ఠత, జాగ్రత!

హైందవజాతికి
వివేకానందస్వామి ఉద్బోధ




సంకలనం :
శ్రీ ఏకనాథ్ రానడే

అనువాదం :
'శ్రీపాదరేణువు'

సమకూర్చారు. శ్రీ రావడే ఈ పని చెయ్యడంలో ఉన్న శ్రమను తద్‌జ్ఞులు గుర్తించగలరు.

స్వామివారి సంపూర్ణ గ్రంథావళి చదువుతూ ఉంటే ప్రతి పంక్తి అత్యవసరమే అనిపిస్తుంది. అంత ఆకర్షకమైన ఆ గ్రంథాలలోనుంచి శతాంశానికి తక్కువయ్యేటట్లు ముఖ్యాంశాన్ని ఉద్ధరించడం నైశిత్యంతోపాటు పరమ ప్రశాంత మనస్థితి ఉంటేనేగాని సాధ్యంకాదు. అందులోనూ వివరణం గాని, వ్యాఖ్యానంగాని లేకుండా స్వామివారి మాటలనే ఏర్చి కూర్చి అందించాలన్న లక్ష్యం పెట్టుకోవడమూ, సర్వాత్మనా నిర్వహించడమూ అసిధారావ్రతమే అవుతుంది. వ్రతమూ, ఫలమూ రెండూ దక్కించుకొన్న సంకలనకర్త ప్రతిభ అభినందనీయం.

అనువాదకుని శ్రమ మరొకవిధమైనది. ఒక జన్మ విడిచి అటువంటిదే మరొకజన్మ మరొకచోట ఎత్తాలని ప్రయత్నించడం వంటిది. అతి క్లిష్టమైన విషయ మిది. అందులోనూ ఆ జీవుడు 'అహం బ్రహ్మాస్మి' అన్న తత్త్వవేత్త అయినప్పుడు అతని మహత్తర వాణిని అన్యభాషలో చెప్పడం ఎంత కష్టమో చెప్పవలసిన పనిలేదు.

ఎంతో క్లిష్టమైన పనిని విజయవంతంగా నిర్వహించగల్గడం ప్రస్తుత అనువాదకుని ప్రజ్ఞకు నిదర్శనం. ధర్మావేశంతో పారవశ్యం పొందిన ఒక ప్రజ్ఞావంతుని భాషాంతరీకరణ ఇది. మూలంలోని మహోన్నత్యంతో తమనుతాము మరిచిపోయిన అనువాదకులు, మొదట మేము శ్రీ సత్యనారాయణగారి

ద్వారా కోరినప్పుడు ఈ అనువాదం చేయడానికే సందేహించారు ఒక ప్రక్క తమ శక్తికి సంబంధించిన సందేహం, రెండవ ప్రక్క ఈ గ్రంథాన్ని తెలుగు పాఠకలోకాని కందివ్వడంలో పాలుపంచుకోవాలనే తీవ్రమైన ఆకాంక్ష ..చివరకు మా కోరికను మన్నించారు. 'స్వామివారే నాచే యీ పని చేయించారు. మూలం చదివి నేను పొందిన ఆవేశోత్సాహాల్లో నూరవవంతయినా ఈ అనువాదాన్ని చదివి పాఠకులు పొందగల్గితే నేను ధన్యుణ్ణే' అంటూ అనువాదాన్ని వినమ్రులై అందించారు. కృషికితగ్గ ఫలాన్ని పొందిన ధన్యు డాయన.

స్వామివారి శతతమ జయంత్యుత్సవ సందర్భమున వెలువడిన ఈ మహాగ్రంథం భారతదేశపు ప్రధానభాషలన్నిటిలోను ప్రచురింపబడడం దీని ప్రాచుర్యాన్ని చాటుతుంది. ఆంగ్ల గ్రంథ ప్రచురణకర్తలైన స్వస్తిక్ ప్రకాశన్ వారి అనుమతితో ఈ తెలుగుగ్రంథం ప్రచురింపబడుతోంది. అనుమతి నిచ్చినవారికి, సంకలనకర్తయైన శ్రీ ఏకనాథ రానడే, అనువాదకులైన 'శ్రీ పాదరేణువు' ముఖచిత్ర కారుడు శ్రీ 'వెంబు' గార్లకు ఈ విషయమున సహకరించిన శ్రీ సత్యనారాయణగారు, తదితరులకు ధన్యవాదాలు తెలుపుతూ, ఆంధ్ర పాఠకలోకానికి ఈగ్రంథాన్ని అందిస్తున్నాం

—ప్రచురణకర్తలు.



# భూమిక

నూరు సంవత్సరాల వెనుక అవతరించిన వివేకానంద స్వామివారి శతజయంతి మహోత్సవాల కోసం దేశమంతటా గొప్ప గొప్ప సన్నాహాలు జరుగుతున్నాయి. అందుచేత సహజంగానే స్వామివారి జీవితాన్నీ బోధలనూ తిరిగి చదవాలని ఉత్సాహం కలిగింది. శ్రీ రామకృష్ణ పరమహంస ప్రధాన శిష్యుడైన ఆ మహానుభావుడు ఇటీవలి శతాబ్దాలలో విదేశాలకు వెళ్ళి విశ్వజనీన మతమైన సనాతన ధర్మాన్ని, హైందవజాతి సందేశాన్ని ప్రపంచానికి మరొకసారి ప్రకటించిన మొదటి హిందూమత ప్రచారకుడు. మహా దేశభక్తుడూ, సంస్కర్తా, సంఘటనాదక్షుడూ అయిన ఆయనే జాతీయ పునరుజ్జీవన శక్తులను మొదట్లో ప్రబుద్ధం చేసిన ధీమంతుడు. ఆంగ్లేయ పరిపాలనవల్ల నైతికంగా పతనమై చీలిపోయిన దేశాన్ని పునర్నిర్మించడానికి పూనుకున్నదీ ఆయనే! భారతదేశ ప్రాణశక్తి మతంలో ఉన్నదనీ, హైందవజాతి పునరుద్ధరణం మతాధారంగానే సమర్థమవుతుందనీ హెచ్చరించి ప్రబుద్ధ భారతానికి పునాది వేసినవారూ ఆయనే!

ఆ మహావీరుని సంస్మరించి ఆయన యెడల తమ గౌరవాన్ని ప్రకటించాలని ప్రజలు సిద్ధపడుతూ ఉన్నారు. శతజయంతి మహోత్సవ సంఘాలు తమ కృషిని ప్రారంభించాయి. అంతలోనే జాతి యావత్తూ ప్రకంపితమై వెంటనే ఏకమై సర్వశక్తులనూ సమాయత్తపరచి, దయా

దాక్షిణ్యాలూ నీతి నియమాలూ విడిచి ఉత్తరపు సరిహద్దును తాకిన శత్రువును, ఎదుర్కోవలసిన అవసరాన్ని గుర్తించింది. ఒకవంక ఆ శత్రువు పైకి స్నేహాన్ని నటిస్తూ దొంగచాటుగా యుద్ధ సన్నాహాలు చెయ్యడమే కాక మన దేశంలో ప్రవేశించే దారులకోసం సంప్రదింపులు జరుపుతూ ఉండడమూ, మరొకవంక మన పాలకులు అయథార్థమూ మిధ్యా అయిన స్వాప్నిక జగత్తులో నివసిస్తూ ఉండడమూ దేశాన్ని ఆశ్చర్యచకితం చెయ్యగా హిమవత్పర్వతాల మీదుగా పెద్ద దండయాత్ర చెయ్యనే చేశాడు శత్రువు.

ఇప్పుడు మన జాతి ఉన్న పరిస్థితిలో వివేకానంద స్వామి సందేశానికి వినూత్న ప్రాముఖ్యం వచ్చింది. ఎందుచేతనంటే ఆయన సందేశం బలాన్ని ప్రబోధించేది. బలం, బలం, దైహిక బలం, మానసిక బలం, సంకల్ప బలం — ఇదే ముఖ్యమని ఆయన ఎన్నడో చెప్పారు. ఇప్పుడు మన జాతి కవసర మయిందీ అదే. అన్నివిధాల బలమూ మన కిప్పుడు కావాలి. వివేకానంద స్వామి 'ఇనుప కండలతో ఉక్కునరాలతో వజ్రతుల్యమైన మనస్సుతో జాతి నిలబడా' లని వాంఛించారు. తన దేశీయులు బలాన్నీ పౌరుషాన్నీ సాధించాలనీ, క్షాత్ర వీర్యంతో బ్రహ్మ తేజాన్ని పొందాలనీ కోరారు. ఇప్పటి ప్రమాదకరమయిన క్లిష్టపరిస్థితిలో మనకు కావలసిన ముఖ్య లక్షణాలు ఇవే. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత విదేశాలనుండి దిగుమతి అయిన భౌతిక జీవన వ్యామోహమూ, భోగ లాలసతా ప్రబలి వీటినే మనం పూర్తిగా నిర్లక్ష్యం చేశాము.

స్వామీజీ ఉపదేశాల నన్నిటినీ సమాహారం చేసి చూస్తే ఆయన మనకొక మహామంత్రాన్ని అనుగ్రహించినట్లుతోస్తుంది. 'భగవద్విశ్వాసమూ, ఆత్మవిశ్వాసమూ' ఇదే ఆయన ఉపదేశించిన మంత్రం : ఆయన చెప్పిన ఆత్మవిశ్వాసం ఉపనిష త్పరమార్థం మీద ఆధారపడి ఉన్నది. 'నేను ఆత్మను. నన్ను కత్తి ఖండించలేదు. ఏ ఆయుధమూ నన్ను దూసుకు

పోలేదు. అగ్ని నన్ను కాల్చలేదు, వాయువు ఎండింపలేదు. నేను సర్వ గతుడను, సర్వవ్యాపిని.' తన దేశీయుల శ్రవణకుహరాల్లో పదే పదే ప్రతిధ్వనించేటట్లు వివేకానందస్వామి ఈ మంత్రాన్నే బోధించారు. ఆయన ఎక్కడ మాట్లాడినా, ఏమిచెప్పినా ఆయన ప్రబోధ గేయానికి ఈ మంత్రమే పల్లవి అయింది. ఈ మహత్తర సత్యాన్ని అవగాహన చేసుకుని తదనుగుణంగా జీవించవలసిన సమయం ఆసన్నమయింది. మన మీ పని చెయ్యగలిగితే ప్రపంచంలో ఏ శక్తీ మనకు హాని చెయ్యలేదు.

పైగా ఆయన మోక్షానికి కృషి చేసేముందు ధర్మానుష్ఠానంలో పరిపూర్ణులు కావాలని ప్రకటించారు. నిజానికి ధర్మం లేకపోతే మోక్షం రానేరాదు. మన మతం నిర్జీవమవుతున్న ఈ దశలో ఈ సత్యాన్ని మరింత దృఢంగా గుర్తించవలసిన అవసరమున్నది. గార్హస్థ్య జీవితాన్ని ఆయన సమర్థించి దాని కొక వినూత్న గౌరవాన్ని కల్పించారు. రాజ్యం వీరభోజ్యమనీ, అందుచేత వీరాన్ని ప్రకటించాలనీ బోధిస్తున్న ధర్మ శాస్త్రాలను ఆయన తన దేశీయులకు జ్ఞాపకం చేశారు. మనం జీవిస్తున్న నైతిక పరిస్థితుల కనుగుణంగా సంచరించాలని శాస్త్రాలు చెప్తున్న సంగతిని మరిచిపోగూడదని ఆయన హెచ్చరించారు. చుట్టూ ఉన్న పరిస్థితులను ఉన్నట్లంగీకరిస్తేనే వాటిల్లో నుంచి బైట పడడానికీ, బాగుచేసుకోడానికీ ఏమైనా ఆశ ఉంటుంది. అందుచేత వివేకానంద స్వామి తన దేశీయులు ఈ శాస్త్రవిధిని మరువరా దంటూ హెచ్చ రించారు. "పరిస్థితులను బట్టి శత్రువులను జయించడానికి సామ దాన భేద దండములనే నాలుగు ఉపాయాలలో అవసరమైనదాన్ని ప్రయోగించు. ప్రపంచాన్ని అనుభవించు అప్పుడే నీవు ధార్మికుడవు. ఇలాకాక ఇతరులు చేసే అవమానాలను సహిస్తూ పడిఉంటే, తలకు తిక్కపట్టిన ప్రతి అడ్డమైనవాడూ వచ్చి తన్నినా అణగద్రొక్కినా ఏమీ చెయ్యకుండా

ఊరుకుంటే నీ జీవిత మిక్కడ నికృష్టమూ, నరకప్రాయమూ కావడమే కాక తరువాత వచ్చే జీవితమూ అంతే అవుతుంది.''

మన స్వాతంత్ర్యాన్నీ, జీవన మార్గాన్నీ, స్వధర్మాన్నీ సంరక్షించుకోవడానికి జాతి అంతా సన్నద్ధం కావలసివచ్చిన ఈ క్లిష్ట పరిస్థితిలో మన నరాలకు సత్తువ తెచ్చుకుని, మన నిశ్చయాన్ని దృఢతరం చేసుకోవడానికి ఈ సందేశం ఎంతో అవసరమూ, ఎంతో విలువైనదీ!

భారతదేశంలో జాతీయ సమైక్యమంటే చెదరిఉన్న ఆధ్యాత్మిక శక్తులను సమీకరించడమే అని ఆయన ఎన్నో సార్లు చెప్పారు. భారత దేశంలో జాతి అంటే ఒకే ఆధ్యాత్మికాదర్శానికి సమానంగా స్పందించే హృదయాలు కలవాళ్ళ కూడికే అని ఆయన అభిప్రాయం. ఆయన ఇచ్చిన ఈ సందేశాన్ని జాతియైక్యమూ, సర్వశక్తి సమీకరణమూ అవసరమయిన ఈ తరుణంలో ఎంతో శ్రద్ధతో అర్థం చేసుకోవాలి.

స్వామీజీ హైందవజాతికి మరొకమాటగూడా చెప్పారు. మనం తమస్సును విడిచిపెట్టాలని ఆయన హెచ్చరించారు. నపుంసకత్వం, మూఢ విశ్వాసం, అల్ప మనస్కత, పరస్పర కలహాలూ, అల్ప విషయాల కధిక ప్రాధాన్యమివ్వడం మొదలైన అనర్థాల కన్నింటికీ ఈ తమస్సే హేతువు. ఇప్పుడు ప్రబలంగా ఉన్న ఈ అనర్థాలు పూర్తిగా తొలిగినప్పుడే జాతి సుసంఘటితమై ఐక్యభావంతో మహా శక్తిమంతమవుతుంది. అందరూచేరి ఒకే దృఢమైన సంకల్పంతో కృషిచేసి పూర్వంకంటె సముజ్జ్వలమైన భవిష్యత్తును నిర్మించుకో గలుగుతాము. స్వామీజీ చెప్పిన ఈ మాటలు గూడా ప్రస్తుత సమయానికి అవసరమైనవే. అందరూ కలిసి ఎదుర్కోన వలసి వచ్చిన ఇటువంటి ప్రమాదకర పరిస్థితులలోనే జాతులు తమ స్థితి గతుల నవగాహనం చేసుకుంటూ ఆత్మావలోకనానికి ఉపక్రమిస్తాయి.

ఇప్పటి ఈ అవసరాన్ని తీర్చడానికే ఈ ప్రచురణ ఉద్దిష్టమైంది

స్వామిజీ రచనలూ, ప్రసంగాలూ వివిధ విషయాలకు సంబంధించి ఉన్నాయి. వేదాంతం, మతం, సాంఘికం, సంగీతం, శిల్పం. కళా, ఒక టేమిటి- అనేకం : ఇటు సామాన్య విషయాలూ, అటు ఆధ్యాత్మిక విషయాలూ సమృద్ధిగా ఉన్నాయి. కాని ఈ ప్రచురణ పరిమితి ననుసరించి మన ప్రాచీన వైభవాన్నీ, అధఃపతన హేతువులనూ తెలిపి సముజ్జ్వల భవిష్యత్తును నిర్మించుకునే ప్రోత్సాహాన్నీ, శక్తినీ మనకు కలిగించే భాగాలను మాత్రమే ఎన్నుకోవడం తటస్థించింది. అలా ఎన్నిన భాగాలను మొదటినుండి చివరివరకు అంతా ఒక అనుస్యూతమైన ధోరణిలో ఉండేటట్లు ఏర్పాటు చెయ్యడం జరిగింది. పూర్వాపర సందర్భంతో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా అర్థమయ్యే భాగాలనే ఎన్నుకున్నాము.

ఈ ప్రచురణం కేవల సంకలనంగానే సంకల్పింపబడింది. స్వామిజీ సందేశాన్ని, వివరణగాని, వ్యాఖ్యానంగాని లేకుండా సరాసరి వారి మాటలలోనే అందించాలని మా ఉద్దేశ్యం అందుచేత అంతా స్వామిజీ మాటలుగానే ఉన్నది. శీర్షికలూ, ఉపశీర్షికలూ, విషయ విన్యాసం – వీటినిమాత్రమే సంకలనకర్త చేసింది. కొన్ని కొన్ని చోట్ల స్పష్టతకోసం సర్వనామాలకు బదులు నామవాచకాలు పెట్టాము.

ఈ సంకలనంలో ఉపయోగింపబడిన వస్తువంతా అద్వైతాశ్రమం వారు ప్రకటించిన ప్రామాణిక ప్రచురణలు వివేకానందస్వామి సంపూర్ణ గ్రంథావళి సంపుటాలు, ప్రాచ్య పాశ్చాత్య శిష్యవర్గ రచితమైన వివేకానంద స్వామి జీవితం, స్వామివారి జీవితకాలంలో ఆరంభించి ప్రకటితమైన ప్రబుద్ధ భారత్, బ్రహ్మవాదిని, ఉద్బోధన్ పత్రికల పాత సంచికలూ, మరి ఇతర పత్రికల నుండి సేకరింపబడింది.

అందుచేత ఈ పుస్తకంలో స్వామివారి మాటలకు అనుకరణ చిహ్నాలు ఎందుకు పెట్టలేదో పాఠకులకు బోధపడుతుంది. ఒక విధంగా పుస్తకమంతా స్వామివారి మాటలే కాబట్టి ఆ చిహ్నాలు ఉన్నట్లే.

ఉన్న విషయాన్నిబట్టి ఈ పుస్తకం నాలుగు భాగాలుగా విభక్త మయింది. (1) సందేశము (2) ఏర్చిన ఉపన్యాసాలూ, చర్చలూ, వ్యాసాలూ (3) కొన్ని పరిశీలనలూ, హెచ్చరికలూ. (4) మానవతా ప్రతి ష్ఠాపనం లేదా కార్యకర్తల శిక్షణ.

(1) సందేశము :- మన జాతి స్థితి గతులను గూర్చి స్వామివారి ప్రధాన భావాల్లో అధికభాగం ఇందులో ఉన్నది. ఒక విధంగా ఇది స్వామి వారు వ్రాసిన పరిశోధక వ్యాసంవంటిది అసంఖ్యాకమయిన స్వామివారి ఉపన్యాసాలూ, ప్రసంగాలూ, లేఖలూ, వ్యాసాలూ మొదలైనవాటినుండి ఉద్ధృతమైంది ఈ భాగం. వేరు వేరు చోట్లనుంచి సేకరించిన ముక్కలే అయినా స్వామివారి భావాలు అనుస్యూతంగా పొందికగా ఉండేటట్లు కూర్చబడ్డాయి.

(2) ఏర్చిన ఉపన్యాసాలూ, చర్చలూ, వ్యాసాలూ:- ఇందులో చేర్చిన భాగాలు మొదటిభాగంలో చేర్చడానికి వీలుకానివి. కాని అందులోని విష యానికి ఆధారమైన స్వామివారి అభిప్రాయాలు వీటినిబట్టి వ్యక్తమవుతాయి. కొన్ని ముఖ్య విషయాలను గూర్చి స్వామివారి అభిప్రాయాలు సరాసరి తెలిపే దృష్టితోనే వీటిని ఏర్పడం జరిగింది.

(3) కొన్ని పరిశీలనలూ, హెచ్చరికలూ :- స్వామివారి హృదయం ఏయే విషయాలను గూర్చి ఎక్కువగా స్పందించిందో, వారి మనస్సు ఏ ధోరణిలో పనిచేసిందో వ్యక్తంచేసే దృష్టితో ఈ భాగాలను సేకరించాము. స్వామివారి ప్రసన్న గంభీర వ్యక్తిత్వానికి వెనుక ఉన్న ఆవేశోత్సాహాలు వీటి మూలంగా పాఠకులకు స్పష్టమవుతాయి.

(4) మానవతా ప్రతిష్ఠాపనం లేదా కార్యకర్తల శిక్షణ :- జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన దలచిన కార్యకర్తలకు ఎటువంటి లక్షణాలు ఉండాలో స్వామివారు తమ రచనలలో అక్కడక్కడ అనేక

పర్యాయాలు చెప్పారు. అటువంటి ఉపదేశక వాక్యాల నన్నిటినీ సంఘ నిర్మాణం, నాయకత్వం, యథార్థ గురుత్వం, జీవితం విజయవంతం కావాలంటే-మొదలైన శీర్షికలతో ఇందులో గుదిగ్రుచ్చాము. స్వామీజీ సందేశాన్ని ఆచరణలో పెట్టడానికి ఉపయోగించే సూచనలయినందువల్ల వీటి నీ పుస్తకంలో చేర్చడం జరిగింది.

కొన్ని నిర్ణీత విషయాలకే పరిమితమై సేకరణ చేసినా ప్రతి విషయాన్ని గూర్చి ఎంతో విలువైన వస్తువు స్వామివారి రచనల్లో విస్తృతంగా ఉన్నది. అందులోనుండి కావలసిన భాగాన్ని ఎన్నుకోవడం అంతా ముఖ్యమే అనిపించినందువల్ల సంకలనకర్తకు ఎంతో కష్టమయింది. ముఖ్యమనిపించిన దంతా చేర్చినట్లయితే పుస్తకం చాలా పెద్దదయి ఖరీదు పెరిగిపోయేది. కాని ప్రచురణ కర్తలూ సంకలన కారుడు కూడా ఎక్కువమంది స్వామివారి భావాల ప్రయోజనాన్ని పొందడానికి వీలుగా పుస్తకం జనసామాన్యానికి అందుబాటులో ఉండే ఖరీదులోనే లభ్యమయేటట్లు చెయ్యాలనుకున్నారు. ఈ ప్రచురణం చదివి పాఠకులు స్వామివారి ఉపదేశాలను సమగ్రంగా తెలుసు కోవాలన్న ఉత్సాహం పొందుతారని ఆశిస్తున్నాము. అట్టివారికి అద్వైతాశ్రమం వారు ప్రకటించిన వివేకానందస్వామివారి సంపూర్ణ గ్రంథావళి సంపుటాలను చదివే కుతూహలం సహజంగానే నలుగుతుంది.

| 26, కారన్‌వాలీస్ వీథి,<br>కలకత్తా — 6. | ఏకనాథ రానడే<br>(సంకలన కర్త) |
|---|---|



# విషయ సూచిక

## సందేశము



## ఏర్చిన ఉపన్యాసాలూ, చర్చలూ



## కొన్ని పరిశీలనలూ, హెచ్చరికలూ

**పరిశీలనలు :**

## హెచ్చరికలు.



## మానవతా ప్రతిష్ఠాపనము - లేదా
## కార్యకర్తల శిక్షణ

# సందేశము

హిందువన్న మాట వినడంతోనే నీలో ఎక్కడలేని శక్తి ఆవిర్భ వించి నిన్ను సర్వ సమర్థుణ్ణి చెయ్యాలి. అప్పుడే నీవు నిజమైన హిందువువు.

ఏ దేశానికి చెందిన హిందువైనా, ఏ భాష మాట్లాడేవాడైనా నీకు బహిఃప్రాణం కావాలి. అప్పుడే నీవు నిజమైన హిందువువు.

ఏ హిందువు కష్టస్థితి అయినా నీ హృదయాన్ని కరిగించి, నీ కన్నకొడుకే కష్టంలో ఉన్నట్లు నీచేత భావింపజెయ్యాలి. అప్పుడే నీవు నిజమైన హిందువువు.

అంతేకాదు; హిందువులకోసం ఆ మహాత్ముడు గురుగోవిందసింగు వలె ఎటువంటి కష్టాన్నైనా భరించగలగాలి. హిందూధర్మ సంరక్షణం కోసం తన నెత్తురు ధారపోసి, యుద్ధ భూమిలో కన్నబిడ్డల చావును కళ్ళారా చూచి, ఎవరికోసం తా నీ త్యాగం చేశాడో వాళ్లే తన్ను విసర్జించి వెయ్యగా, దెబ్బతిన్న సింహమై ఆ మహానుభావుడు, తన యెడల కృత ఘ్నులై తన్ను పరిత్యజించిన తనవాళ్ళను, పల్లెత్తు మాటైనా అనకుండా, ప్రశాంతంగా కార్యరంగంనుండి ఉపసంహరించుకుని దక్షిణానికి వెళ్ళి పోయి అక్కడ చనిపోయాడు. ఆ ఉత్తమోత్తమ సహనశీలమే నీకు లక్ష్యం కావాలి; అప్పుడే నీవు నిజమైన హిందువువు.

దేశసేవాకాంక్ష ఉన్న ప్రతివ్యక్తీ గురుగోవిందసింగు కావాలి. సోదర దేశీయులలో సహస్రాధిక దోషాలు ఉండవచ్చు. అయినా వాళ్ళు హిందువులన్న సంగతి మరచిపోగూడదు. వాళ్ళు నిన్ను నానా యాతనలూ పెట్టినాసరే, వాళ్లే నీకు ముందు పూజింపదగిన దేవతలు. ఎవరెన్ని శాపాలు పెట్టినా నీవు వారిని ప్రేమతో ఆశీర్వదించగలగాలి. వాళ్ళు నిన్ను తరిమివేస్తే ఆ మహానాయకుడు గోవిందసింగువలె మౌనంతో మరణించ డానికి సిద్ధపడాలి. అట్టి కార్యదీక్ష, సహనశక్తీ ఉన్నవాడే హిందువు అని పించుకోవడానికి అర్హుడు. ఆ ఔన్నత్యాన్ని అందుకోవడమే మన కెల్ల ప్పుడూ లక్ష్యమై ఉండాలి.

పరస్పర వైమనస్యాలు పారద్రోలి ఈ మహత్తర ప్రేమ ప్రవా హాన్ని సర్వదిశలా వ్యాప్తం చేద్దాము!



# మన పుణ్యభూమి భారతం
# దాని మహోజ్జ్వల చరిత్ర

ఈ భూమండలంలో పుణ్యభూమి అనిపించుకోగల దేశం; కర్మాను భవానికై ఎక్కడెక్కడి జీవులూ అవతరించే దేశం; పరమార్థానికి అభి ముఖంగా జీవయాత్ర గడిపే ప్రతిజీవీ చిట్టచివరి మజిలీగా చేరుకోవలసిన దేశం; సౌజన్యంలో, ఔదార్యంలో, పావిత్ర్యంలో, శాంతి వైరాగ్యాల్లో, అన్నింటినీ మించి ఆత్మావలోకనంలోనూ, ఆధ్యాత్మికత్వంలోనూ మానవ జాతి పరాకాష్ఠ నందుకున్న దేశం ఏదైనా ఒకటి ఉందంటే అది భారత దేశమే ! ! !

## ప్రాచీన చరిత్ర

భారతదేశ ప్రాచీన చరిత్ర మహత్తర శక్తుల బహుముఖ కార్య కలాపాల వర్ణనలతో నిండిఉన్నది. నిస్సీమమైన ఆత్మతత్త్వమూ, అజయ్యమైన వివిధ శక్తుల వీర విహారమూ, ఉత్తమోత్తమ దివ్యజాతి, మహత్తర భావనా బలమూ అందులో మనకు ప్రత్యక్షమవుతాయి. కిరీటధారుల జీవిత విశేషాలూ; ఆయా కాలాల్లో గద్దె నెక్కిన దుష్ట రాజుల దుర్గుణాలకూ, కోపతాపాలకూ ఆహుతి అయి ప్రజలు పొందిన కడగండ్లు; రాజుల మంచి చెడ్డలనుబట్టి ప్రజ లనుభవించిన సుఖదుఃఖాలూ మాత్రమే చరిత్ర అన్న మాటకు అర్థమయ్యే పక్షంలో అటువంటి చరిత్ర బహుశః భారతదేశానికి

లేనేలేదేమో! కాని భారతదేశంలోఉన్న అసంఖ్యాక మత గ్రంథాలూ, పారావారసదృశమైన కావ్య వాఙ్మయమూ, వేదవేదాంగాలూ; వివిధ శాస్త్ర గ్రంథాలూ - వీటిల్లో ప్రతి పంక్తీ - రాజుల జీవిత విశేషాలూ వంశ వృక్షాలూ చెప్పినదానికంటే ఎంతో స్పష్టంగా - మహత్తరమైన ఈ భారత జాతి, ఇతర జాతులు నాగరికం కావడానికి ఎంతో ముందుగానే - మానవ సహజమైన క్షుత్పిపాసలూ, రాగద్వేషాలూ ప్రోత్సహింపగా, ప్రకృతి సౌందర్యంచేత ఆకృష్టమై, భగవద్దత్తమైన అసాధారణ మేధాశక్తి నుపయోగించి, ప్రకృతిని జయించి, ఐహిక భోగంతోపాటుగా మహో న్నతమైన ఆధ్యాత్మిక శిఖరాన్ని ఎలా అధిష్ఠించిందో, దాన్ని అందుకోవ డంలో ఏయే దశలు ఎలాదాటిందో మనకు ప్రకటిస్తూనేఉన్నది. యుగ యుగాలుగా ప్రకృతితో పోరాడి భారతజాతి సాధించిన అసంఖ్యాక విజయాలకు సూచకాలయిన విజయ పతాకలు కాలంవల్లా, వ్యతిరేక వాతావరణంవల్లా పాతబడి పీలికలై ఉండవచ్చునుగాని ఇప్పటికీ అవి ప్రాచీన భారత మహోజ్జ్వల చరిత్రను సూచిస్తూనే ఉన్నాయి.

## ఆర్య జాతి

ఈ ఆర్య జాతి మధ్యఆసియా, ఉత్తర ఐరోపా లేక ఆర్కిటిక్ ప్రాంతాలనుండి క్రమక్రమంగా కదిలి భారతదేశంలో స్థిరపడి దాన్ని పవిత్రంచేసిందా లేక ఈ పవిత్ర భారతభూమియే దానికి జన్మసానమా అన్నది నిర్ణయించడానికి మన కిప్పుడు సరియైన సాధనాలు లేవు.

అదీకాక భారతదేశంలోనో, బైటనో నివసిస్తూ ఉన్న ఒక మహాజాతి కాలక్రమేణా ప్రకృతిసూత్రాల ననుసరించి తన జన్మస్థానాన్ని వదలవలసి వచ్చి ఐరోపా మొదలైన ప్రాంతాలకు వలసపోయిందా, ఆ జాతీయులు తెల్లవాళ్ళా నల్లవాళ్ళా; వాళ్ళకళ్ళు నలుపా, నీలమా; వాళ్ళకు నల్లజుట్టు ఉండేదా రాగివెంట్రుకలుండేవా - మొదలైన విషయాలను నిర్ణయించడానికి

గూడా ఇప్పుడేమీ ఆధారాలు లేవు-కొన్ని ఐరోపీయ భాషలకూ సంస్కృతానికీ కనిపిస్తున్న సన్నిహితత్వం ఒక్కటే తప్పవిడిచి.

అలాగే ఆధునిక భారతీయులు ఆ పూర్వజాతికి సాంకర్యంలేని వారసులేనా, వీళ్ళల్లో ఆ జాతిరక్తం ఎన్నిపాళ్ళు ఉన్నది, దాంతో బొత్తిగా సంబంధంలేని వాళ్ళెవరు? మొదలైన విషయాలను నిర్ణయించి తీర్మానించడం గూడా ఏమంత తేలికైన విషయంగాదు.

అయినా ఈ అనిశ్చిత పరిస్థితివల్ల మనకువచ్చిన నష్టమేమీలేదు.

విస్పష్టంగా కనిపిస్తున్న ఈ సత్యాన్ని గమనిస్తే చాలు. ఏ ప్రాచీన భారతజాతి ప్రప్రథమంలో నాగరకతా శిఖరాల నందుకున్నదో, ఏ జాతిలో మానవ మేధ సంపూర్ణ వికాసం పొందిందో, ఆ జాతికి మేము వారసుల మని సగర్వంగా చెప్పగలవాళ్ళు, మనస్సులోనూ హృదయంలోనూ ఆ జాతి లక్షణాలే కలవాళ్ళు ఇప్పటికీ ఈ గడ్డమీద లక్షలకొలది జన్మిస్తూనే ఉన్నారు.

నదీ పర్వత సముద్రాలుదాటి, దేశకాల నిరోధాల నతిక్రమించి భారతీయ భావ సౌరభము పూర్వమూ ఇతరదేశాల నావరించింది. ప్రత్యక్షం గానో అప్రత్యక్షంగానో ఇప్పటికీ ఇతర జాతులకు అందిస్తూనే ఉన్నది. ఆ పూర్వజాతి వారసత్వంలో ప్రపంచంలో ఎవరికీలేని అధికభాగం మనకే ఉన్నదేమో!

## విమర్శనా నైశిత్యం

నా సతః సత్ జాయతే — అసత్తునుండి సత్పదార్థము జనింపదు.

ఉన్నదానికి లేని దెన్నడూ కారణం కాలేదు. శూన్యంలోనుండి ఏదీ ఉద్భవించదు. ఆర్యజాతి ఎంత ప్రాచీనమైనదో ఈ కార్యకారణ సిద్ధాంతం కూడా అంత ప్రాచీనమైనది. కార్యమైన ఈ జగత్తుకు కారణం ఉన్నదనీ,

అది సర్వ జగద్వ్యాప్త మవడమేకాక దేశకాలముల కతీతమైనదనీ ఆర్యజాతి మొదటినుండీ నమ్ముతూ ఉన్నది. సత్యద్రష్టలైన మహర్షులు గానం చెయ్యగా తాత్త్వికులు దీన్ని నిరూపించారు. నేటి హైందవుడు కూడా ఈ పునాది రాయిమీదనే తనజీవితసౌధాన్ని నిర్మించుకుంటున్నాడు.

ఈ జాతికి సహజంగా ఆరంభంలో ఉన్న జిజ్ఞాస అత్యల్ప వ్యవధిలో ధీర విమర్శగా పరిణమించి, భవిష్యత్తులో మహాశిల్పి కానున్న వాని చేతులు ఆరంభంలో వణికినట్లు, మొదట్లో కొంచెం ఊగులాడినా, త్వరలోనే స్థైర్యాన్ని పొంది, సునిశ్చితశాస్త్రమై, సుదృఢ ప్రయత్నంతో పరమాద్భుత ఫలితాలను సాధించింది.

ఆ ధీర విమర్శయే వాళ్ళచేత ఎన్ని పనులో చేయించింది. సత్యాన్వేషణ తత్పరులై వాళ్లు చెయ్యని పని లేదు. యజ్ఞవేదికలలో ప్రత్యణువునూ పరిశీలించారు. వేదవాఙ్మయంలో ప్రతి పదాన్నీ వ్యస్తంగా సమస్తంగా పిండి సారం తీశారు. తమ కర్మ కలాపాన్ని బహు విధాలుగా ఏర్పాటు చేసి చూచి, సందేహించి, తిరస్కరించీ అవుననీ కాదనీ తర్జన భర్జనలు చేసి, నిగ్గు తేల్చుకుని సమాధానం చెప్పుకున్నారు.

ఈ విమర్శచేతనే మొదట్లో తాము నమ్మిన దేవతలను గూడా వాళ్లు త్రోసివేయగలిగారు. సర్వాంతర్యామీ, సర్వగతుడూ అయి స్వర్గంలో ఉంటాడనుకున్న సృష్టికర్త అయిన విశ్వపితనుకూడ అప్రధానుణ్ణిగానే పరిగణించి, సాకారుడైన ఈశ్వరుణ్నికూడా ఎందుకూ పనికిరాడని త్రోసి వేసి, నేటికీ అన్ని మతాలకూ మించిన అధిక సంఖ్యాకు లనుసరించే మూర్తిమద్దైవంతో నిమిత్తంలేని విశ్వజనీన మతాన్ని స్థాపించగలిగారు.

యజ్ఞవేదికలకు ఇటుకలను పేర్చే పద్ధతులలో నుంచి, ఈ విమర్శ మూలంగానే, ఆర్యజాతిలో అత్యద్భుతమైన జ్యోతిశ్శాస్త్రం ఆవిర్భవించింది.

యజ్ఞయాగాదులకు కాలనిర్ణయం చేయడంకోసం ఖగోళ విజ్ఞానం పుట్టి సర్వ ప్రపంచాన్నీ ఆశ్చర్యచకితం చేసింది.

గణితశాస్త్ర విజ్ఞానానికి ప్రాచీనాధునికజాతుల్లో ఏ జాతికంటే ఎక్కువగా ఆర్యజాతి దోహదం చేయగలగడానికి ఈ విమర్శయే హేతువు. రసాయనిక శాస్త్రంలో, వివిధ రసాయన ద్రవ్య సమ్మేళనం తోడి వైద్యంలో, స్వరప్రస్తార వైవిధ్యంతోడి సంగీతంలో, ధనురాకార పరికరాల నిర్మాణంలో వారి విజ్ఞానం పరమావధి నందుకున్నది. ఆధునిక ఐరోపీయ నాగరకత ఈ ఆర్యజాతి విజ్ఞానానికి ఎంతో ఋణపడి ఉన్నది.

మనోహరమైన కథలతో పసిపిల్లల మనస్సులను పటిష్ఠంచేసే శాస్త్రాన్నీ, ప్రపంచంలోని నాగరక దేశాలన్నింటిలోనూ బాలబాలికలు చిన్నప్పుడు బళ్ళల్లో చదువుకుని యావజ్జీవితమూ జ్ఞప్తికుంచుకునే చక్కని కథలనూ ఆర్యజాతి ఈ విమర్శనా నైశిత్యంచేతనే సృష్టించగలిగింది.

## కవితా భావుకత

ఆర్యజాతి మనస్తత్త్వంలో మరొక విశిష్టలక్షణం – దాని కవితా భావుకత. అది వారి విమర్శనా నైశిత్యాన్ని ముఖమల్ తొడుగులా ఆవరించి ఉన్నది. ఆ జాతి మతం, దాని తత్త్వచింతనా, దాని చరిత్రా, దాని నీతి నియమాలూ, దాని రాజకీయాలూ అన్నీ ఈ కవితా భావుకత అనే పుష్ప శయ్యలో నిక్షేపింపబడ్డాయి. సార్థక నామధేయంగల సంస్కృతం వాటి నన్నింటినీ ఇతరభాష లన్నిటికంటే సర్వసమర్థంగా చెప్పగలిగింది. గణిత శాస్త్ర కఠోరసత్యాలు కూడా ఆ భాషా మహాత్మ్యంచేత మధురకవితా రూపాలు దాల్చాయి.

విమర్శనాశక్తి, దాన్ని పెంపొందించిన గంభీర సత్యదర్శన సమర్థ మైన కవితాభావుకతా ఇవి రెండే హైందవజాతి స్వస్వరూపావిష్కారానికి ముఖ్యమైన ఆంతరిక కారణాలు. ఈ రెండూ కలిసే జాతీయశీలానికి కీలక

మర్మాలయ్యాయి. ఇంద్రియాల కతీతమైన మహత్తర రహస్యాలను అవగాహన చేసుకునేటట్లు జాతిని ముందుకు నడిపించింది ఈ రెంటి సమ్మేళనమే. కఠినాతికఠినమైన ఇనుమును కోసేవైనా వర్తులాకారంలో మట్టడానికి వీలైన ఉక్కు-రంపాలవలె ఈ రెండూ కలిసి వారి సర్వవిజ్ఞానానికీ మూలహేతువు లయ్యాయి.

ఇవే వారి కవిత్వాన్ని సువర్ణమయం చేశాయి. ఆభరణాల పనితనంలో, ఆశ్చర్యాన్ని కల్పించే సౌధనిర్మాణాల చాకచక్యంలో, చిత్రకళా వర్ణ సామరస్యంలో, స్వాప్నిక దివ్యలోకాలకు చెందిన భవ్యకథా కల్పనంలో ఈ లక్షణాలతో వేలకొలది సంవత్సరాలు జాతి గావించిన కృషియావత్తూ కనిపిస్తుంది.

కళలూ శాస్త్రాలేకాదు, నిత్యజీవిత సామాన్య విషయాలు గూడా ఇంద్రియజన్య జ్ఞానం ద్వారా అతీంద్రియ పరమార్థాన్ని స్పృశింపజేస్తూ, కనిపించే సత్యం కంటే కనిపించని సత్యంయొక్క సౌందర్యాన్ని అందించే కవితా భావుకతతో సమాచ్ఛాదనం చేయబడ్డాయి.

అత్యంత శైశవదశలోనే ఈ జాతికి ఈ విశిష్టలక్షణం ఉన్నట్లూ దీన్ని అది ఉపయోగించుకున్నట్లూ మనకు నిదర్శనాలు లభిస్తాయి. వేద వేదాంగాల్లో మనకు విదితమయే ఆర్యజాతి మత సాంఘిక విషయాల్లో ఎంతో కాలంనుండి పురోగమిస్తూ ఎన్నో రూపాంతరాలు పొంది పరిపక్వమైనట్టుగా విస్పష్టమవుతుంది.

క్రమబద్ధ భిన్నదేవతా భావనా, విస్తృత కర్మ కలాపమూ, విభిన్న వృత్త్యాశ్రయంచేత అత్యవసరమై ఆనువంశిక వర్ణాలుగా విభక్తమైన సంఘ స్వరూపమూ, మానవ జీవిత క్షేమానికి అవసరమైన ఎన్నెన్నో విషయాలూ, మరెన్నెన్నో జీవిత భోగాలూ వేదకాలంనాటి ఆర్య జాతిలోనే కానవస్తాయి.

## ఆధ్యాత్మికతా జన్మభూమి

ప్రపంచంలో ఏ దేశానికీ ప్రవహించకముందు విజ్ఞాన స్రోతస్విని ఈ ప్రాచీన భారతదేశంలోనే ఉద్భవించింది. సముద్రాలవలె ఎన్నడూ తరగని జీవ నదులతో ఊర్ధ్వలోక రహస్యాలను భేదించడానికి ప్రయత్ని స్తోందా అన్నట్లు మహోత్తుంగ శిఖరాలతో ఆకాశంలోకి చొచ్చుకుపోయే శాశ్వత హిమవత్పర్వతశ్రేణితో ఈ భారతభూమి బాహ్య స్వరూపం ఇదే ఆధ్యాత్మిక విజ్ఞాన స్రోతస్వినీ జన్మ భూమి అని నిరూపిస్తోంది. తనువులు తాల్చిన బ్రహ్మవేత్తలు సంచరించినది ఈ పవిత్ర భారత భూమిలోనే!

మానవ ప్రకృతి తత్త్వ విజ్ఞానానికీ, అంతర్జగద్రహస్య భేదనానికీ జిజ్ఞాస ఇక్కడనే బయలుదేరింది.

'ఈ మానవుని తత్త్వమేమిటి ? బాహ్య జగత్తు ఎంత ఉన్నదో అంతా ఉన్నట్టున్న ఆంతర జగత్తు మాటేమిటి?' అన్న విచికిత్స ఇక్కడనే ప్రారంభమైంది. అమరమైన ఆత్మ ఉన్నదనీ, సర్వజగత్పర్యవేక్షకుడైన భగవంతు డున్నాడనీ, ఆ భగవంతుడు లో-వెలుపల-అంతటా ఉన్నాడనీ ప్రథమతః సిద్ధాంతీకరించింది ఈ గడ్డమీదనే. మతంలోనూ, తత్త్వశాస్త్రం లోనూ పరమోన్నత లక్ష్యాలను ఈ దేశమే అందుకున్నది. ఆధ్యాత్మిక విజ్ఞానమూ, తత్త్వచింతనా ఇక్కడనుంచే సముద్ర తరంగాల్లా లేచి ప్రపంచాన్ని ముంచెత్తివేశాయి.

## దివ్యత్వ సాధన

ఎంతమహత్తరమైన దీ దేశం!

దేశీయుడైనా విదేశీయుడైనా - వాని జీవన లక్షణం అధమాధమ పాశవస్థితికి దిగజారి ఉండకపోతే - ఈ గడ్డమీద ఉన్నంతసేపూ ఇక్కడ పుట్టి మూలావిద్యచే పశుప్రాయుడై యున్న జీవునకు దివ్యత్వాన్ని సిద్ధింప

జెయ్యాలని శతాబ్దాలుగా ప్రయత్నిస్తూన్న పరమ పవిత్ర మూర్తులైన బ్రహ్మర్షుల దివ్య భావాలు తన చుట్టూ క్రమ్ముకుంటున్నట్లు భావించి తిరుతాడు. ఇక్కడి గాలిలోనే ఆధ్యాత్మిక సంస్పందనం సమృద్ధంగా ఉన్నది.

నైతిక జీవితానికీ, తత్త్వ చింతనకూ, ఆధ్యాత్మికత్వానికీ ఈ దేశమే పవిత్రమైనది. తన్ను తాను మిగుల్చుకోవడానికి మానవుడు చేసే నిర్విరామ కృషికి దోహదం కల్పించేది ఈ దేశమే! పరమ మూర్ఖతను ఆరోపించే అజ్ఞానావరణాన్ని తొలగించివేసి జనన మరణ రహితమై. నిత్యమై సచ్చిదానందమయమైన ఆత్మస్వరూపంగా ఆవిష్కృతమయ్యే ఆధ్యాత్మిక శిక్షణ మానవున కివ్వగలిగింది ఈ దేశమే! ఐహికభోగ పరాకాష్ఠ నందుకుంటూనే జీవితంలో సుఖానికి రెట్టింపు దుఃఖం ఉన్నదనీ, మోహమే సర్వానర్థాలకూ మూలమనీ మానవుడు మొట్టమొదట గ్రహించింది ఈ గడ్డమీదనే! నడి యౌవనమూ, భోగ సమృద్ధీ, మహోన్నత ప్రశస్తీ, అనంత ప్రభుత్వమూ అన్నీ ఉండి ఇదంతా మిధ్య అని మోహ శృంఖలాలను మానవుడు మొట్టమొదట తెంచివేయగలిగినది ఈ పవిత్ర భారతదేశంలోనే!

వినోదమూ–బాధా, సత్తువా–నిస్సత్తువా, ఐశ్వర్యమూ - దారిద్ర్యమూ, సుఖమూ - దుఃఖమూ. నవ్వూ - ఏడుపూ, బ్రదుకూ - చావూ మొదలైన ద్వంద్వాలు పరస్పర విరుద్ధ లక్షణాలతో నిత్యమూ సంఘర్షిస్తున్న మానవ జీవిత మహాసాగారంలో సర్వసంగపరిత్యాగ సింహాసనస్థుడై, కదలాడే అలలతో నిమిత్తంలేని పరమ ప్రశాంతిని మానవు డనుభవించింది ఈ దేశంలోనే!

జనన మరణాలూ, జీవిత తృష్ణా, జీవితాన్ని నిలబెట్టుకునే ప్రయత్నంలో అనివార్యంగా ఎదురయ్యే దుఃఖ బాహుళ్యమూ మొదలైన మానవ జీవిత ప్రధాన సమస్యలను మొట్టమొదట గ్రహించి వాటి కన్నింటికీ

త్రికాలాబాధ్యమైన పరిష్కారాన్ని మానవుడు సాధించింది ఈ దేశంలోనే! అసలు జీవితమే బంధనమనీ, అది సద్వస్తువుకు ఛాయాచిత్రమనీ, తన నీడనే తాను చూచి బెదిరి బెగ్గడిల్లే అవివేకునివలె మాయామోహ జగత్తునూ అందులోని తన జీవితాన్నీ నిజమనుకుని మానవుడు బాధపడుతున్నాడనీ మొట్టమొదట తెలుసుకోగలిగింది ఈ దేశంలోనే!

యథార్థమూ, అనుష్ఠానయోగ్యమూ అయిన మతం ఈ ఒక్క దేశంలోనే ఉన్నది. ఇతర దేశాల్లో బలహీనులయిన తోడి సోదరులకు దక్కకుండాచేస్తూ జీవిత భోగాలను తామే అనుభవించడానికి వెఱ్ఱి ఆవేశంతో జను లెట్లా ముందుకు దూకుతున్నారో అట్లాగే జీవిత లక్ష్యమైన పరమార్థాన్ని సాధించడానికి అనంతమైన ధైర్య సాహసాలతో ఐహిక భోగాలను విడిచి స్త్రీలూ పురుషులూ వేలకొలది ఈ ఒక్క దేశంలోనే ముందుకు దూకారు.

ఇక్కడనే, ఈ ఒక్కదేశంలోనే, మానవహృదయం అతి విశాలమై అనంత విస్తృతినంది తోడి మానవజాతియేకాక పశుపక్ష్యాది సమస్త జీవకోటీ, చేతనాచేతన సర్వజగత్తూ పిపీలికాది బ్రహ్మపర్యంతం ఉచ్చ నీచ భేదం లేకుండా అంతా తనలోనే ఉన్నట్టు భావన చెయ్యగలిగింది. విశ్వాన్నంతటినీ ఆత్మమయంగా భావించి ఆ ఆత్మస్వరూపమే తానన్న వివేకాన్ని గూడా మానవు డిక్కడనే పొందాడు.

## సాధు హిందువు

మన మాతృభూమికి ప్రపంచం ఎంత ఋణపడి ఉన్నదో చెప్పడానికి వీల్లేదు, ఒక్కొక్క దేశాన్నీ విడివిడిగా తీసుకొని ఏయేదేశానికి ఎంతెంత ఋణపడి ఉన్నదో అంచనా వేసినా ఈ సాధు హిందువుకే ప్రపంచం అధికంగా ఋణపడి ఉంటుంది. ఈ సాధు హిందూ విశేషణం దూషణ

కుద్దిష్టమైంది కావచ్చు కాని దయామయుడైన ఈశ్వరుని అనుగ్రహానికి ఎల్లప్పుడూ పాత్రుడైన సాధు హిందువు విషయంలో ఆ దూషణలోనే పరమసత్యం దాగి ఉన్నది.

ప్రాచీనాధునిక కాలాల్లో బలవంతమైన మహాజాతులనుండి గొప్ప గొప్ప భావాలు ఉద్భవించాయి. ఒకజాతినుండి మరొకజాతికి వాని వినిమయమూ ప్రాచీనాధునికకాలాల్లో జరిగింది. ఒక్కొక్కజాతి వికసిస్తూ మహత్తర శక్తిమంతమైన సత్యబీజాలను ప్రాచీనాధునికకాలాల్లో ఇతర జాతులలో వెదజల్లడమూ జరిగింది. కాని ఒక్క విషయం గమనించండి. ఎప్పు దేజాతి మరొకజాతి కేమిచ్చినా భేరీభాంకారాలతో భీకరమైన యుద్ధంతో నిమిత్తంలేకుండా ఇవ్వడం జరగలేదు, ప్రతి భావాన్నీ రక్తంలో నానబెట్టి మరీ ఇచ్చారు. అన్ని భావాలూ కోట్లకొలది మానవుల రక్తప్రవాహంలో ఈదుకుంటూనే వెళ్ళవలసి వచ్చాయి. అన్నింటివెంటా వికలాంగుల ఆక్రందనాలూ, అనాథశిశువుల హాహాకారాలూ, విగత భర్తృకల విలాపాలూ అనుసరించక తప్పలేదు. ప్రధానంగా ఇతరజాతులు బోధించిన పద్ధతి ఇదీ!

దీనికొక్క హైందవజాతియే అపవాదం. గ్రీసు పుట్టకముందు, రోముపేరే వినబడకముందు, ఆధునిక ఐరోపీయ నాగరకతా పితామహులు పశుప్రాయులై జంతుభీతితో మసిపూసుకుని అడవుల్లో నివసించే రోజుల్లోనే ఈ దేశంలో చైతన్యం వెల్లివిరిసింది. ఇంకా ముందుగానే, చరిత్రకందని కాలంలో, సంప్రదాయం తొంగిచూడడానికి సాహసించలేని యుగయుగాల వెనుక, అప్పటినుండి ఇప్పటివరకూ, భావాలవెంట భావాలు ఈ జాతినుండి ఇతర జాతులకు అందుతూనే ఉన్నాయి. ప్రతిభావమూ ఆశీర్వాదంతో బయలుదేరి శాంతినే స్థాపించింది. ప్రపంచ జాతులన్నింటిలోను మన జాతి ఒక్కటే పశుబలంతో జయించే జాతికాలేదు. అదే మన అదృష్టం! అదే మన యోగ్యత!

## అమర భారతం

అసంఖ్యాక గ్రీకు సైన్యాలు ప్రపంచ విజయానికి బయలుదేరి నప్పుడు భూమి కంపించిన రోజులున్నాయి. అంత భయహేతువయిన గ్రీకు సామ్రాజ్యమూ జాడలోకి మాటలేకుండా తుడిచిపెట్టుకుపోయింది? ఒకప్పుడీ ప్రపంచంలో చెప్పుకోదగిన ప్రతిచోటా రోమనుల గృధ్రపతాకం రెపరెపలాడింది. వారి అధికార ప్రభావం ఎక్కడెక్కడి మానవుల తలలమీదా తాండవించింది. రోము పేరు వినబడితే భూమి గజగజ లాడింది. అయితే ఏం? ఆ చక్రవర్తులు నివసించిన చోట్లు ఇప్పుడు కుప్ప కూలి శిథిలాలయిపోయాయి. సీజర్లు పాలించినచోట సాలీళ్ళు గూళ్ళు కడుతున్నాయి.

ఈ జాతులతో తుల్యమైన ఔజ్జ్వల్యాన్ని అనుభవించిన ఇతర జాతులూ వచ్చాయి, పోయాయి. తటాక జలాలమీది వలయాలవలె ఔద్ధత్యంతోపుట్టి అంతలోనే నశించాయి. బ్రదికిన అల్పకాలంలో దురధికారమూ దౌర్జన్యమూ తప్ప మరొక లక్ష్యమే వాటికి లేకపోయింది. ఆజాతులీవిధంగా మానవజాతి ముఖంమీద కళంకాలు మాత్రమే కాగలిగాయి.

కాని మన జాతి ఇప్పటికీ జీవిస్తూనే ఉన్నది. ఈ జాతి నిర్మాత మనువు, ఈరోజున ఈ దేశానికి వస్తే ఆయన ఆశ్చర్యపడవలసిన అవసర ముండదు. దీన్ని అన్య దేశంగా ఆయన భావించడు. వేలకొలది సంవత్సరాలు ఆలోచించి ఆచరణలో పెట్టిన అప్పటి ధర్మాలే ఇప్పటికీ అనుసరింపబడుతున్నాయి. తరతరాల అనుభవంతో పరిణతమైన ఆచారాలు శాశ్వతమన్నట్లు ఇప్పటికీ ఉన్నాయి. రోజులు గడవగా గడవగా దురదృష్టంతో దెబ్బలుతిన్నా అవన్నీ ఈ జాతికి స్వధర్మంలో దృఢతరమైన విశ్వాసం ఏర్పడడానికే సహకరించాయి. ప్రపంచ దేశాలతో నాకున్న అనుభవాన్ని పురస్కరించుకుని నే చెప్పుతున్న ఈ మాటమీద విశ్వాసం ఉంచండి.

ఈ జాతి ఇప్పటికీ సురక్షితంగా ఉండడానికి ఈ స్వధర్మాభిరతియే హేతువు. ఈ జాతి కాయువుపట్టైన హృదయస్థానం ఈ ధర్మమే.

ఎన్ని విదేశ దండయాత్రలు జరిగినా చెక్కుచెదరక అప్పటి భారతమే ఇప్పటికీ ఉన్నది. తగ్గని ఉత్సాహంతో, అజయ్యమైన చైతన్యంతో సుస్థిరమైన కుల పర్వతంవలె రోజు రోజుకూ దృఢపడుతూ ఈ జాతి ఎప్పటికీ ఉంటుంది. ఆద్యంతరహితమై అమరమైన ఆత్మవస్తువువలె ఈ జాతి జీవితమూ నిత్యమైనదే ! మన మీ పవిత్ర మాతృభూమి కన్న బిడ్డలము !



# అప్పుడూ — ఇప్పుడూ

భారతీయ సాంఘిక ధర్మాలు కాలాన్నిబట్టి మార్పులు పొందుతూనే వచ్చాయి. ఆరంభంలో అవి క్రమక్రమంగా ఎంతో కాలానికి నెమ్మది నెమ్మదిగా ఆవిష్కృతం కావలసిన మహత్తర ప్రణాళికకు చెందినవి. ప్రాచీన భారత మహర్షులు, ప్రపంచం తమ వివేకాన్ని మెచ్చుకోడానికి ఎన్నో శతాబ్దులు పట్టేటంత దూరదృష్టితో, ఆ ప్రణాళిక నమలుపరిచారు. కాని దురదృష్టవశాత్తూ వారి సంతతివారే ఆ మహాద్భుత పథకం ఫలించేవరకూ విశ్వాసంతో అనుసరించడానికి అశక్తులై పోయారు. భారత జాతి దిగజారిపోవడానికి ఒక్కటే ఒక్కటైన ప్రధాన కారణం ఈ అశక్తతే: ప్రాచీనుల ధర్మాలూ, ఆచారాలూ చెడ్డవైనందువల్ల కాక వాటి ఫలితాల నవి సాధించేవరకూ అనుసరించక విసర్జించినందువల్లనే భారత జాతి దిగజారింది

## నేటి భారతదేశ స్వరూపం

పొంగి పొరలి పరవళ్లు తొక్కుతూ ప్రవహించే సువిశాల గంభీర జీవ స్రవంతులూ; ఆ నదీతీరాల వెంట నందనవనాన్ని పరిహసించే ఫల పుష్ప సంభరితములైన ఉద్యానవనాలూ; వాటి మధ్య ఆకాశాన్ని చుంబిస్తూ మహత్తర శిల్ప సౌందర్యంతో తళతళలాడే చంద్రకాంత శిలానిర్మిత సౌధరాజాలూ; వాటికి సమీపంలోనే, ముందూ వెనకా అన్ని వైపులా, అందవికారమైన గోడలతో, కూలిపోయే కప్పులతో, బయటపడ్డ అస్థిపంజరాల్లా

కనిపించే వెదుళ్ళతో, దారిద్ర్యదేవత తాండవించే పూరిగుడిసెల గుంపులూ; చినిగిన గుడ్డలతో, తరతరాల దారిద్ర్యాన్నీ నిరాశనూ సూచించే ముడతలు పడ్డ ముఖాలతో అటూ ఇటూ తిరుగాడే పెద్దలూ, పిన్నలూ; శుష్కించిన శరీరాలతో, వారివలెనే దైన్యాన్ని వెలిగ్రక్కే గుంటలుపడ్డ కళ్ళతో, ఎక్కడ పడితే అక్కడ కనిపించే ఆవులూ, ఎడ్లూ, గేదెలూ, దున్న పోతులూ; సర్వే సర్వత్రా ప్రత్యక్షమయ్యే చెత్తా చెదారమూ - ఇది నేటి భారతదేశ స్వరూపం!

దివ్యసౌధాల ప్రక్కనే చితికిపోయిన గుడిసెలూ, పవిత్ర దేవాలయాల ప్రక్కనే కశ్మలాల కుప్పలూ, చీనిచీనాంబరాలు ధరించే ఆగర్భ శ్రీమంతునితో నడిచే కౌపీన మాత్రధారి అయిన సన్న్యాసీ, సంపత్సమృద్ధితో మృష్టాన్నం భుజించి తెగబలసిన వ్యక్తులవంక క్షుద్బాధాపీడితులై కాంతి విహీన నేత్రాలతో దిగాలుపడి చూచే దరిద్రులూ — ఇది నేటి మన మాతృదేశం!

## విదేశీయుల దృష్టిలో మనదేశం

పెద్దపెట్టున జనసమూహాలను తుడిచివేసే ప్లేగు కలరాల భయంకర విహారమూ; జాతి నంటిపట్టుకుని నిర్జీవం చేసివేస్తున్న మలేరియా; అలవాటయిపోయిన ఆకలి బ్రతుకులూ; మృత్యువువలె భీకర తాండవంచేసే కరువుకాటకాలూ; ఆశలుడిగి, చైతన్యం కోల్పోయి, ధైర్యోత్సాహాలు నశించి జీవచ్ఛవాలయిన మనుష్యకళేబరాలు పడిఉండే శ్మశానభూములూ; వీటన్నింటిమధ్యా గంభీర మౌనంతో పద్మాసనస్థులై మోక్షైక లక్ష్యంతో ఆత్మానుసంధానంచేసే యోగీ — ఐరోపీయ యాత్రికుల కంటికి కనిపించే భారతదేశ స్వరూపం ఇదీ!

ఆకారమాత్ర మానవత్వం కలిగి, స్వదేశీయులూ విదేశీయులూ స్వమతస్థులూ విమతస్థులూ పీల్చి పిప్పిచెయ్యగా, ఎన్నెన్నో బాధలు

పడుతూ, గొడ్లవలె శ్రమిస్తూ, స్వబుద్ధి ఏ కొంచెమూలేని జానిసలై, గతాన్ని గూర్చిన గర్వమూ భవిష్యత్తుకు సంబంధించిన ఆశా రెండూ శూన్యమై. ఏదోఒకవిధంగా బ్రతుకు ఈడవడమే కోరుకుంటూ, తోడివారి పచ్చదనం దుస్సహమయ్యే పరమ నీచస్వభావం ప్రబలిపోయి, శ్రద్ధా విశ్వాసాలు నశించినందువల్ల నైరాశ్యమే క్రమ్మగా, వల్లకాటిలో గుంట నక్కల్లా వంచనా ద్రోహమూ కుతంత్రాలూ స్వీయ రక్షణోపాయాలుగా అవలంబిస్తూ, కరుడుగట్టిన స్వార్థపరత్వంతో బలవంతుల పాదధూళి నాక డానికైనా సిద్ధపడి, అందుచేతనే తమవంటి దుర్బలులను మరింత హత మారుస్తూ. దుర్బలులకూ నిరుత్సాహులకూ మాత్రమే తోచే అసత్యకరమైన మూఢ విశ్వాసాలతో, ఘోరాతిఘోరమైన నైతికపతనం చెంది, కుళ్లి కంపు కొడుతూ ఉన్న కళేబరంమీద కులకులలాడుతూ సంచరించే పురుగులవంటి ముప్ఫయికోట్ల జనానీకం భారతదేశంపై తిరుగాడుతూ ఉంది. అధికారం చెలాయించిన ఆంగ్లేయాధికారికి ఈ జాతి స్వరూపం ఇట్లా తోచడం సహజమే!

## భారతీయుల దృష్టిలో పాశ్చాత్యులు

కొత్తగా సంపాదించిన శక్తులతో ఉన్మత్తులై, యుక్తాయుక్త విచక్షణ జ్ఞానంలేక, మోహగ్రస్తులై పరమ క్రూరమైన ఆటవిక మృగాల వలె సంచరిస్తూ, ఆహార విహారాల్లో పారిశుద్ధ్య పావిత్ర్యాల ప్రస్తావనే లేక కామదాసులై తప్పత్రాగుతూ, పాంచభౌతిక జగత్తే సత్యమని నమ్మి దానిమీదే ఆధారపడిన తుచ్ఛ నాగరకత నవలంబిస్తూ, తమ పొట్ట నింపు కోవడమే లక్ష్యమై దానికై దౌర్జన్యంతో మోసంతో కుతంత్రాలతో ఇతర దేశాల నాక్రమించి ఇతరుల సంపదలను కొల్లగొట్టుతూ, జన్మాంతరాలున్నా యన్న వివేకమే లేక దేహాత్మవాదులై ఇంద్రియాలను తృప్తిపరచడమూ పాశవిక సుఖానుభూతీ మాత్రమే జీవితమని వ్యవహరించే రాక్షసులు పాశ్చాత్యులు. భారతీయుల దృష్టికి వారిలా కనిపిస్తారు!

## స్థూలదృష్టి ఫలితాలివి

ఉభయ పక్షాలకూ తోచే ఈ అభిప్రాయాలు సరిఅయినవి కావు. జాతీయ తత్త్వమేదో కనిపెట్టే శక్తిలేక పై పై విషయాలను మాత్రమే గమనించి అవిచాకితంగా నిర్ణయానికి వచ్చినందువల్లనే ఇటువంటి అభిప్రాయాలు తోస్తాయి. ఐరోపీయులు భారతదేశానికి వచ్చి పెద్ద పెద్ద పట్టణాల్లో పరిశుభ్రంగా ఉన్న మహా సౌధాల్లోఉండి మన దేశ పరిస్థితులను తమ దేశం వాటితో పోల్చి చూచుకుంటారు. వాళ్ళకు తటస్థపడే భారతీయులందరూ ఏదో ఒక విధంగా వాళ్ళ నాశ్రయించుకుని బ్రతికేవాళ్లే అవుతారు. నిజానికి ఈ దేశంలో ఉన్నంత దారిద్ర్యమూ దుఃఖమూ మరెచ్చటా ఉండవుగాని ఇక్కడున్నదంతా దుమ్మూ ధూళీ అనడంలో అర్థంలేదు. ఒకప్పుడున్న ఔన్నత్యం కోలుపోయి దాస్యంచేస్తూ దారిద్ర్యంతో బాధపడుతున్న జాతిలో ఏమాత్రమైనా మంచి ఉన్నదేమో ఊహించే శక్తి ఐరోపీయుల మనస్సులకు లేకపోయింది.

మనల్ని గూర్చి వాళ్ళు అలా భావిస్తే వాళ్ళను గూర్చి మనం ఐరోపీయులు మంచీచెడ్డా విచక్షణలేక ఏదిపడితే అది తింటారనీ, వాళ్ళకు పరిశుభ్రతే తెలియదనీ, వర్ణాశ్రమ విభేదాలు పాటించరనీ, స్త్రీలూ పురుషులూ కలగాపులగంగా సిగ్గు విడిచి తప్పత్రాగి యథేచ్ఛగా సంచరిస్తారనీ భావిస్తూ ఇటువంటి జాతిలో మంచి ఉండడానికి ఏమి అవకాశం ఉంటుందని శంకిస్తాము.

ఈ దృక్పథాలు రెండూ కేవలం స్థూల దృష్టి ఫలితాలు మాత్రమే. పై పొరలు తీసివేసి లోనికి చూచి గ్రహించిన సత్యాలు కావు. విదేశీయులు మనసంఘంలో మిళితమై తిరగడానికి మన మంగీకరించం. వాళ్ళను మనం మ్లేచ్ఛు లంటాం. వాళ్లూ మనల్ని బానిలని అసహ్యించుకుంటూ నీచులని వ్యవహరిస్తారు. ఉభయులూ ఒకరినొకరు

అర్థంచేసుకుని పరస్పరసత్యాలు గ్రహించకపోయినా ఈ అభిప్రాయాల్లో గూడా ఏదోకొంత సత్యం ఉండక తప్పదు.

## జీవించి ఉన్న ప్రతిజాతీ ఒక సందేశానికి నిలయం

ప్రతివ్యక్తిలోనూ ఏదో ఒక భావం ఉంటుంది. పైకి కనిపించే మానవుడు లోనున్న భావాన్ని ఆవిష్కరించే భాషవంటి బహిరావృతి మాత్రమే. ఇలాగే ప్రతి జాతికీ దానికే చెందిన జాతీయభావం ఉంటుంది. ఆ జాతీయ భావాలు ప్రపంచ క్షేమంకోసం ఉద్దిష్టమైనవి. వాటి అవసరం ఉన్నంతవరకూ అవి తమ్ముతాము నిలబెట్టుకుంటూనే ఉంటాయి. ప్రపంచ క్షేమానికి ఒక భావం అవసరం తీరిపోయినరోజు వచ్చినప్పుడు ఆ భావానికి ఆధారమైన వ్యక్తిగాని జాతిగాని వెంటనే నశించిపోతుంది. చెప్పరాని కష్టాలతో, ఘోర దారిద్ర్య దుఃఖాలతో, అయినవారూ కానివారూ ఎక్కి తొక్కి నెత్తి నణుస్తూ ఉన్నా మనజాతి ఇప్పటికీ బ్రతికి ఉన్నదంటే ఈ జాతీయభావం ప్రపంచక్షేమానికి ఇంకా అవసరమై ఉండడం ఒక్కటే హేతువు.

భారతజాతి ఇప్పటికీ జీవిస్తూ ఉండడం విశ్వవిజ్ఞాన భాండారానికి తనవంతు తాను ఇవ్వవలసి ఉన్నందువల్లనే అని అర్థం చేసుకోవాలి.

దీనితోపాటు మరొక్క విషయంగూడా గ్రహించాలి. ఏ మంచి లక్షణాలైనా ఒకానొక జాతిలోనే ఉంటాయని మనమెన్నడూ భావించ కూడదు. వ్యక్తులలో వలెనే జాతులలోకూడా ఒక్కొక్కరిలో కొన్ని కొన్ని విశిష్ట లక్షణాలు ఉండవచ్చు.

## ధర్మమూ, మోక్షమూ — లక్ష్య వైవిధ్యం

మన జాతీయ భావం మోక్షం. పాశ్చాత్యుల జాతీయ భావం ధర్మం. మనం కోరేది ముక్తి అయితే వాళ్ళు కోరేది ధర్మం. ఇక్కడ

ధర్మ శబ్దం మీమాంసకార్థంలో ప్రయుక్త మవుతోంది. ధర్మమంటే ఏమిటి? ఈ లోకంలోగాని పరలోకంలోగాని సుఖాన్ని అపేక్షించేవాడు ఆచరింప వలసింది ధర్మం. ధర్మమెప్పుడూ క్రియాపర్యవసాయియే అవుతుంది. అది మానవుడు సుఖార్థియై దివారాత్రాలు కృషిచేసేటట్లు చేస్తుంది.

మరి ముక్తి అంటే ఏమిటి? ఈ లోకమూ, పరలోకమూ అనిత్యాలే అయినందువల్ల అందలి సుఖమూ అనిత్యమే అనీ, సుఖాపేక్ష శృంఖలవంటిదనీ, ఇహలోకసుఖం అయశ్శృంఖల అయితే పరలోకసుఖం సువర్ణ శృంఖల మాత్రమే అవుతుందనీ, అందుచేత సుఖాపేక్షతో జీవితాన్ని తెచ్చుకోవడమే బంధనమనీ బోధిస్తుంది. ఇంద్రియాలద్వారా లభించే సర్వ సుఖాలూ ప్రకృతినియమాలకు లొంగినవేకాబట్టి తాత్కాలికాలే అవుతాయి గాని శాశ్వతాలు కావు. అందుచేత మానవుడు వాటికి దాసుడుకాక భవబంధ విముక్తికై ప్రయత్నించి ముక్తుడు కావాలి. ఈ మోక్షమార్గం ప్రపంచ మంతటిలో ఒక్క భారతదేశంలోనే ఉన్నది.

ఈ దేశంలో కూడా ఒకప్పుడు ముక్తి లక్ష్యంలో ధర్మలక్ష్యమూ ఆదరింపబడింది. భీష్మ కర్ణ పార్థ యుధిష్ఠిరాది ధర్మారాధకులూ; శుక వ్యాసాది మోక్షకాంక్షులూ ఒకే కాలంలో సహజీవనం చేశారు. బౌద్ధమత ప్రాదుర్భావంతో ఈ దేశంలో ధర్మం ఉపేక్షితమై మోక్షమే ప్రాముఖ్యం వహించింది.

## హిందూ ధర్మ శాస్త్రాలూ, బౌద్ధులూ

'జీవితానికి మోక్షమే లక్ష్యం. ఎవరెవరు ఏ స్థితిలో ఉన్నా సరే రండి. మోక్షాన్ని స్వీకరించండి' అని బౌద్ధులు ప్రకటించారు. 'అది ఏవిధంగా సాధ్యమవుతుంది ?' అని నా ప్రశ్న. 'నీవు గృహస్థువు. అటువంటి అందని ఆదర్శాలతో నీవు ప్రసక్తి పెట్టుకోగూడదు. స్వధర్మ నిష్ఠుడవై జీవితాన్ని గడుపు' అని బోధిస్తాయి హిందూ ధర్మశాస్త్రాలు.

ఇదే సరియైన మాట ! ఇందులోనే వివేకం ఉన్నది ! ఒక్క అడుగు దూకలేని కుంటివాడట, ఒక్క అంగలో సముద్రాన్ని లంఘించి లంకను చేరతాడట ! ఏమైనా అర్థం ఉన్నదా ? నీ కుటుంబాన్ని నీవు పోషించుకో లేవు, తోడివాళ్ళ కొకరిద్దరికైనా ఒక్క పూట ఆతిథ్య మివ్వలేవు. నలుగురితో సామరస్యంతో బ్రతుకుతూ సమష్టి క్షేమానికై ఏ కొంచెమూ చెయ్యలేవు - ఈ స్థితిలో ఉన్న నీవు ముక్తిని కాంక్షిస్తావా ? 'ధర్మం కంటె మోక్షమే శ్రేష్ఠం, అందులో సందేహం లేదు. అయినా ప్రథమంలో ధర్మమే శరణ్యం. అందులో పరిపూర్ణత నందాకే మోక్షం !' అంటాయి హిందూ ధర్మశాస్త్రాలు. బౌద్ధులిక్కడే తికమకపడి సర్వానర్థాలకూ కారకు లయ్యారు. అహింస పరమోత్తమ ధర్మం. అపకారానికి ప్రతీకారం చెయ్యగూడదు. ఇవన్నీ గొప్ప సిద్ధాంతాలని అంగీకరిస్తూనే ధర్మశాస్త్రాలు ఇలా హితబోధ చేస్తున్నాయి.

"నీవు గృహస్థువు. నిన్నాశ్రయించుకుని ఎందరో ఉన్నారు. నీ కపకారం చేసేవానికి నీవు ప్రతీకారం చెయ్యకపోతే నిన్నాశ్రయించినవాళ్లు నశిస్తారు కాబట్టి నీవు పాతకుడవే అవుతావు."

గురుం వా బాల వృద్ధౌ వా బ్రాహ్మణం వా బహుశ్రుతమ్
ఆతతాయిన మాయన్తం హన్యా దేవా విచారయన్

( మను-8.అ 350 )

'నిన్ను చంపడానికి వచ్చినవాడు గురువైనా, పసివాడైనా, వృద్ధుడైనా, బ్రాహ్మణుడైనా నిర్విచారంగా చంపవలసినదే. ఇందులో ఏ పాపమూ లేదు' అంటోంది మనుస్మృతి. ఇది నిజం;దీన్నెన్నడూ విస్మరించగూడదు.

## స్వధర్మాచరణాన్ని మించింది లేదు

ఈ జగత్తు వీరభోజ్యము. నీ వీరాన్ని ప్రకటించి పరిస్థితులనుబట్టి సామ దాన భేద దండములనే చతుర్విధోపాయాలలో ఏది అవసరమయితే

దాన్ని ఉపయోగించి స్వాధీనం చేసుకుని జగత్తు ననుభవించు. అప్పుడే నీవు ధార్మికుడ వవుతావు. అలా చెయ్యవో నీకంటె నికృష్టుడు మరొక డుండడు. అవమానాలను భరిస్తూ, తన్నులూ తాపులూ తింటూ ఎవరేం చేసినా సహిస్తూ పడిఉంటే ఈ జీవిత మిక్కడ నరకప్రాయం కావడమే కాదు, తర్వాత వచ్చేదీ ఇలాంటిదే అవుతుంది. మన ధర్మశాస్త్రాలు మన కీ హితాన్ని బోధిస్తున్నాయి.

నీ ధర్మాన్ని నీవు అనుష్ఠించు. ఇంతకంటె పరమోత్తమ సత్యం లేదు. నాతోడి హైందవుల కందరకూ ఇదే నా సలహా. స్వధర్మాన్ని అనుష్ఠిస్తూ ఎవరికీ ఎట్టి అపకారమూ చెయ్యకు. ఇతరులకు చేతనైనంత మేలు చెయ్యి. కాని ఎవరైనా ఔద్ధత్యంతో నీ కపకారంచేస్తే గృహస్థువైన నీవు సహించి ఉండడం పాపమన్న సంగతి మరిచిపోకు. దెబ్బకు దెబ్బతో ఎప్పటికప్పుడు దుర్మార్గులను అణచివెయ్యాలి. గృహస్థు కష్టపడి ఉత్సాహంతో ద్రవ్య మార్జించాలి. దాంతో తనకూ తనవాళ్ళకూ సుఖాన్ని సమకూర్చుకోవాలి; వీటైనన్ని మంచిపనులు చేస్తూ ఉండాలి. ఈ మాత్రం చెయ్యలేకపోతే నీవు మనిషి వెట్లా అవుతావు? గార్హస్థ్యాన్నే అనుసరించలేని వాడివి మోక్షాన్నేం సాధిస్తావు !

## భిన్న స్వభావాలకు భిన్న మార్గాలు

ఇంతకూ ఏమార్గం మంచిదని ప్రశ్నిస్తే ఒక్కొక్కరి కొక్కొక్క మార్గం మంచిదని తెలుతుంది. మోక్షకామికి ఒకమార్గం మంచిదయితే ధర్మార్థికి మరొకమార్గం మంచిదవుతుంది. ఈ మహత్తర సత్యాన్ని శ్రీకృష్ణ భగవానుడు గీతలో ప్రకటించి దాన్ని సుబోధం చెయ్యడానికి ప్రయత్నించాడు. హైందవ మతానికి చెందిన వర్ణాశ్రమ వ్యవస్థా, స్వధర్మానుష్ఠాన సిద్ధాంతమూ ఈ సత్యాన్ని అనుసరించే స్థాపించబడ్డాయి.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ ॥

గీత - 12 అ - 13

శత్రువులు లేనివాడు, అందరితోనూ మైత్రి కలిగి కరుణామయుడై ఉండేవాడు, అహంకార మమకారములు లేనివాడు, సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా స్వాస్థ్యం చెడనివాడూ, క్షమాశీలీ—

ఇవీ ఇటువంటి ఇతర లక్షణాలూ మోక్షార్థి నుద్దేశించినవి.

క్లైబ్యం మాస్మగమఃపార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥

గీత - 2 అ - 3

ఓయి పార్థా! నపుంసకుడవు కాకు. నీకీ లక్షణం ఏ మాత్రమూ తగదు. క్షుద్రమైన హృదయ దౌర్బల్యాన్ని విడిచి పరంతపుడవై లేచి నిలబడు!

తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ ॥

గీత - 11 అ - 33

అందుచేత ఇక లేచి నిలబడు, యశస్సు సంపాదించు. శత్రువులను జయించి సమృద్ధమైన రాజ్యాన్ని అనుభవించు. పైకి బ్రతికి ఉన్నట్లు కనిపిస్తున్నా నీ శత్రువులు నాచేత పూర్వమే నిహతులై ఉన్నారు. ఓ సవ్యసాచీ! నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము!

ధర్మార్థి అయిన పార్థుణ్ని ఉద్దేశించి భగవంతుడు చెప్పిన మాటలివి.

## సాత్త్విక ప్రశాంతీ — తామసిక జడత్వమూ

ఇప్పుడు చెప్పు, నీవు నిష్క్రియుడవై ఉన్నంత మాత్రాన నీలో సత్త్వమే అధికంగా ఉన్నదో తమస్సే అధికమో పైకి కనిపించేదాన్ని బట్టి ఎలా తెలుసుకోవడం? సర్వకర్మలూ ఉడిగిపోయి, సుఖ దుఃఖాల కతీతమైన సమస్థితి తోడి సాత్త్విక ప్రశాంతియే లభించిందా లేక జీవచ్ఛవాలమై, ఏ శక్తీ లేదుకాబట్టి ఏ పనీ చెయ్యక, లోలోపల కుళ్ళిపోతూ క్రమశః సర్వనాశనం పొందించే అధమాధమ తామసిక స్థితిలో ఉన్నామా? నాకీ ప్రశ్నకు సమాధానం కావాలి. నీ మనస్సును నీ వడుగు. నిజమేదో నీకే తెలుస్తుంది.

## సాత్త్విక ప్రశాంతి సర్వశక్తి నిలయం

నీ జవాబుతో నిమిత్త మేమిటి? చెట్టు ఏ జాతిదో పండును బట్టే తెలుస్తుంది. సత్త్వమే అధికమయినప్పుడు నిస్తరంగ సముద్రంవలె మానవుడు శాంతుడై నిష్క్రియు డవుతాడు. ఆ శాంతి అనేక మహా శక్తుల కేంద్రీకరణంచేత సిద్ధించింది. అది పరమాద్భుత చైతన్య నిలయం. పరిశుద్ధ సత్త్వమే ప్రధానమైన మహాత్ముడు మనవలె కరచరణాద్యవయవములతో పనిచెయ్యవలసిన అవసరమే ఉండదు. సంకల్పమాత్రంచేతనే అతని పనులన్నీ అతనికి సమగ్రంగా నెరవేరతాయి.

సత్త్వ ప్రధానుడైన ఆ మహానుభావుడే బ్రాహ్మణుడు. సర్వ జగత్పూజ్యుడు. తన్ను పూజించమని కోరుతూ ఆయన ఇంటింటికీ తిరగవలసిన అవసర మేముంటుంది? ఆ మహానుభావుని నుదుటిమీద జగన్మాతయే స్వయంగా ' ఈ మహాత్ముడు నా బిడ్డ. ఇతన్నందరూ పూజించండి' అని సువర్ణాక్షరాలతో వ్రాస్తుంది. ప్రపంచమంతా ఆ వ్రాతను గుర్తించి, ఆ తల్లి మాటలు విని, ఆ మహానుభావునకు వినయ విధేయతలతో పాదాక్రాంత మవుతుంది.

అతడే గీతలో చెప్పిన

అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకారః సమ దుఃఖ సుఖః క్షమీ ॥

ఇత్యాది ఉత్తమ లక్షణాలు కలవాడు.

## తామసిక జడత్వం మృత్యు చిహ్నమే

వారం పది రోజులుగా పస్తులుంటున్నందువల్ల ఓపిక బొత్తుగా లేనట్టున్న సన్నని గొంతుతో, మాట మాటా నములుతూ ముక్కుతో మాట్లాడుతూ ఉంటారు కొందరు ఆడంగిరేకల అబ్బనాకారులు. చివికిన పాతగుడ్డలకూ అట్టివాళ్ళకూ భేదం లేదు. తిట్టినా కొట్టినా వాళ్ళు అలాగే పడి ఉంటారు. ఇవన్నీ అధమాధమ తమో లక్షణాలు. రాబోయే మృత్యువునే ఈ లక్షణాలు సూచిస్తున్నాయి. లోపల ఉన్నదంతా కుళ్లూ కశ్మలమే గాని సత్త్వము ఏమాత్రమూ కాదు. అటువంటివాళ్ళను చూచి మోసపోగూడదు. ఆ స్థితికి మనం దిగజారగూడదు.

అర్జునుడు వాళ్ళ స్థాయిలోకి పడిపోతూ ఉండబట్టే గీతలో భగవంతుడు అంతగా వివరించి చెప్పాడు. అదిగదా అసలు విషయం! భగవంతుని ముఖం నుండి మొట్టమొదట్లో వెలువడిన మాట లేమిటో వినండి—

క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే—

(పార్థా ! నపుంసకుడవు కాకు నీ కిది యెంతమాత్రమూ తగదు !) తర్వాత చేసిన ఉపదేశ మేమిటి ?

'తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ'

( అందుచేత లేచి నిలబడు. యశస్సు సంపాదించు. )

కడచిన వేయిసంవత్సరాలుగా దేశం యావత్తూ భగవన్నామంతో రోదసిని నింపుతూ ప్రార్థనలు చేస్తూనే ఉన్నది. కాని ఆయన వీటిని పట్టించుకోవడమే లేదు. అవు నాయన కేం పట్టింది? మూర్ఖ ప్రలాపాలను మానవుడే పట్టించుకోడుగదా! భగవంతు డెందుకు పట్టించుకుంటాడు? ఇప్పుడు మనకున్న మార్గమల్లా ఆ భగవంతుని గీతోపదేశాన్ని శిరసా వహించడమే!

క్లైబ్యం మాస్మగమః పార్థ! —
తస్మాత్త్వ ముత్తిష్ఠ యశోలభస్వ —

## మహా వైపరీత్యం

ఎంత వైపరీత్యమో చూడండి. ఐరోపీయులకు దేవుడైన క్రీస్తు 'ఎవరినీ శత్రువులుగా భావించకు. నిన్ను శపిస్తున్నా వాళ్ళ నాశీర్వదించు. ఎవరైనా నిన్ను కుడిచెంపమీద కొట్టితే ఎడంచెంప కూడా వాళ్ళకందించు. అన్నిపనులూ మానేసి పరలోకయాత్రకు సిద్ధంగా ఉండు. విశ్వప్రళయం సమీపంలోనే ఉన్నది' అని వాళ్ళకు బోధించాడు. గీతోపదేష్ట శ్రీకృష్ణ భగవానుడు 'ధైర్యోత్సాహాలతో విడవకుండా స్వధర్మాన్ని అనుష్ఠించు శత్రువులను నిర్జించి ప్రపంచాన్ని అనుభవించు' అంటూ మనకు బోధించాడు. కాని జరిగిందేమిటి? అక్కడ క్రీస్తూ, ఇక్కడ కృష్ణుడూ చేసిన బోధలు పూర్తిగా తలక్రిందులై పోయాయి.

క్రీస్తు ఉపదేశాలను ఐరోపీయు లెన్నడూ పట్టించుకోలేదు. ఎల్లప్పుడూ ఉత్సాహంతో పరిశ్రమించే అలవాటు కలిగి అత్యద్భుత రజోగుణంతో విస్తృత ప్రపంచంలోని సమస్తభోగాలనూ స్వాధీనం చేసుకుని మనస్తృప్తిగా అనుభవిస్తున్నారు.

మరి మనమో! మూటాముల్లే కట్టివేసి ఒక మూలకూర్చుని చావెప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ రాత్రింబగళ్ళు

నళినీ దళగత జలమతి తరళం
తద్వజ్జీవిత మతిశయ చపలమ్

(తామరాకులో నీటివలె జీవితం మిక్కిలి చంచలమైనది) అని పాడుకుంటు న్నాము. దీనితో మన నెత్తురు చల్లబడిపోయి విపరీతమైన మృత్యుభయ మావహిస్తోంది. మృత్యువు నాజ్ఞాపించే యముడు కూడా మనమాట నిజ మనుకుని మన్ని అనుగ్రహించడానికి మృత్యుపరివారకోటియైన సకల రోగాలతోనూ దేశాన్ని ఆక్రమించుకుని ఉన్నాడు.

గీతోపదేశాన్ని అనుష్ఠిస్తున్న దెవరు? మనం కాదు, ఐరోపీయులు! క్రీస్తు చెప్పిన ప్రకారం నడుచుకుంటున్నదెవరు? ఐరోపీయులుకాదు. శ్రీకృష్ణ భగవానుని సంతతి అయిన మనం! జరుగుతున్న ఈ వైపరీ త్యాన్ని బాగా అర్థం చేసుకోవాలి.

## బౌద్ధమే అనర్థానికి హేతువు

బౌద్ధానికీ వేద మతానికీ లక్ష్యాలు ఒక్కటే అయినా బౌద్ధం పూర్తిగా అపమార్గాన్ని అవలంబించింది. బౌద్ధ మార్గమే సరియయిన దయితే మన జాతి ఇలా శిథిలం కావడానికి కారణమేమిటి? కాల విప ర్యయం చేతనే ఈ స్థితి వచ్చిందంటే సరిపోదు. కార్య కారణ నియమాన్ని అతిక్రమించి కాలం మాత్రం పనిచెయ్యగలదా?

## క్రీస్తు ప్రభావానికి ఐరోపా లొంగలేదు

ధర్మార్థ కామ మోక్షాలు నాలుగూ పురుషార్థాలనిచెప్పి వాటిని సాధించే మార్గాలను వేదమతమొక్కటే బోధిస్తోంది. ఆ మతంలో ఉన్న మనల్ని బుద్ధుడు పాడుచేశాడు. గ్రీకు జాతినీ, రోమను జాతినీ, క్రీస్తు సర్వనాశనం చేశాడు. కొంతకాలం గడిచాక అదృష్టవశాత్తూ ఐరోపీయులు క్రీస్తు బోధల ప్రభావానికి గ్రీకు రోమను జాతులవలె లొంగిపోయి నిర్వీ

ర్యులు కాక ప్రొటెస్టెంటులై (రోమను అనుసరించిన క్రైస్తవం నుండి విడిపోయి 16వ శతాబ్దిలో నూతన క్రైస్తవాన్ని స్థాపించుకున్నవారు) తేరుకుని పునరుజ్జీవితు లయ్యారు.

భారతదేశంలో కుమారిలభట్టు బౌద్ధ ప్రభావాన్ని నిలవనివ్వక కేవల కర్మనే అవలంబించి వైదిక కర్మ మార్గాన్ని మళ్లీ ప్రచారంలోకి తెచ్చాడు. ధర్మార్థ కామ మోక్షాలు నాల్గింటికీ సామరస్యాన్ని చూపుతూ ఆది శంకరులూ, రామానుజులూ సనాతన వైదిక ధర్మాన్ని పునః ప్రతిష్ఠించారు. ఈ విధంగా మన జాతి బౌద్ధంవల్ల సర్వనాశనం కాక పునరుజ్జీవనాన్ని పొందింది. అయినా ఈ జాతిలో కోట్లకొలది జీవులున్నారు. అందరూ మేలుకొనడానికి ఎంతోకాలం పట్టవచ్చు. అందుకే ఈ ఆలస్యం! ఇన్ని కోట్ల జీవులను ఒక్కరోజులో మేలుకొలపడం సాధ్యంకాదుగదా!



# మతమే భారత జాతి ఆత్మ

ప్రతి జాతికీ చేరవలసిన గమ్యం ఉన్నది; ఇవ్వవలసిన సందేశం ఉన్నది; నిర్వర్తించవలసిన భగవదాదేశం ఉన్నది. అందుచేత ఆరంభం నుండీ మన జాతిని భగవంతుడెందుకు సృష్టించాడో తెలుసుకోవాలి; చేర వలసిన గమ్యమేమిటో గ్రహించాలి; వివిధ జాతుల పురోగమనంలో మన స్థానమేమిటో తెలియాలి; సర్వ ప్రపంచ సామరస్యానికి మనం నిర్వహించ వలసిన పాత్ర ఏమిటో తెలుసుకుని మరీ ప్రవర్తించాలి.

## మనం హిందువులం

మనం హిందువులం. హిందూశబ్దాన్ని నేనెట్టి దురర్థంలోనూ వాడడంలేదు. అసలు దానికి దురర్థం ఉన్నదన్నమాటే నేనంగీకరించను. పూర్వ మీమాటకు సింధునది కవతల నివసించే జనమన్న అర్థమే ఉండేది. ఈ పూట మనమంటే అసహ్యపడే జనులు దీనికేమైనా దురర్థం కల్పించు కుని ఉండవచ్చు. కాని వట్టి పేరుతో అయ్యేదేమీలేదు. ఈ హిందూశబ్దం ఔన్నత్యానికీ, ఆధ్యాత్మికత్వానికీ సంకేతమే అవుతుందో లేక ఎందుకూ పనికిరాని సిగ్గుపడవలసిన అధమాధమత్వాన్నే సూచిస్తుందో మనప్రవర్తన మీద ఆధారపడిఉంటుంది. ప్రస్తుతానికీ పేరు ఏ చెడ్డనైనా సూచిస్తుంటే దాన్ని మనం లక్ష్యం చెయ్యక ప్రపంచంలో ఏ భాషలోనూ ఇంతకంటే ఉత్తమ పదం పుట్టలేదని మన ప్రవర్తనచేత మనం ఋజువు చేద్దాము.

నా పూర్వులను గూర్చి నేను సిగ్గుపడకూడ దన్నది నా జీవిత సిద్ధాంతాలలో ప్రధానమైనది. నాకంటే గర్విష్ఠి మరెక్కడా పుట్టి ఉండడు. అయినా నా గర్వం నన్నుగురించి కానేకాదు. నా పూర్వులను పురస్కరించుకునే నేను గర్విస్తాను. గతాన్నిగూర్చి చదివినకొద్దీ చరిత్రలో వెనుకటి పుటలు త్రిప్పినకొద్దీ నా గర్వం అధికాధికమైంది. ఈ గర్వమే నాకు సుస్థిర విశ్వాంతో శక్తినీ, సామర్థ్యాన్నీ ఇచ్చింది. అధమస్థితిలోనుండి నన్ను ఉద్ధరించి మన పూర్వుల మహత్తర ప్రణాళికను ఆచరణలో పెట్టేటందుకు ప్రోత్సహించింది.

ప్రాచీనార్యజాతి సంతానమైన మీకున్నూ భగవత్కృపచే ఆ గర్వం కలుగుగాక ! పూర్వుల యందలి విశ్వాసం రక్తగుణమై జీవితంలో పెనవేసుకుపోయి మిమ్మల్ని సర్వప్రపంచ మోక్షప్రదాతలను చేయును గాక !

## ప్రతి జాతికీ చేరవలసిన గమ్యం ఉన్నది

మనిషి మనిషికీ వ్యక్తిత్వం ఉన్నట్టే జాతి జాతికీ వ్యక్తిత్వం ఉంటుంది. మనిషిని పోలిన మనిషి ఉండడు. ఏవ్యక్తి కా వ్యక్తిలో ఏదో ప్రత్యేకత ఉంటూనే ఉంటుంది. అలాగే జాతులూ విభిన్న లక్షణాలతో విశిష్టా లవుతూనే ఉంటాయి. మానవు లెలా వేరువేరు ప్రయోజనాలకై పుట్టి తాము చేసుకున్న కర్మనుబట్టే వేరువేరు నిర్దిష్టమార్గాల్లో నడుస్తున్నారో జాతులూ అలాగే ఉద్భవిస్తున్నాయి, నడుస్తున్నాయి. ప్రతి జాతికీ చేరవలసిన గమ్యం ఉన్నది, ఇవ్వవలసిన సందేశం ఉన్నది, నిర్వర్తించవలసిన భగవదాదేశం ఉన్నది.

అందుచేత ఆరంభంనుండీ మనజాతిని భగవంతు డెందుకు సృష్టించాడో తెలుసుకోవాలి, చేరవలసిన గమ్యమేమిటో గ్రహించాలి, వివిధ జాతుల పురోగమనంలో మన స్థానమేమిటో తెలియాలి, సర్వప్రపంచ

సామరస్యానికి మనం నిర్వహించవలసిన పాత్ర ఏమిటో తెలుసుకుని మరీ ప్రవర్తించాలి.

## జాతీయాత్మ

మనదేశంలో మన చిన్నప్పుడు కొన్ని సర్పాలకు తలలమీద మణు లుంటాయనీ, అవి భద్రంగా ఉన్నంతకాలం వాటికి చావు ఉండదనీ కథల్లో చెప్పగా విని ఉంటాము. కొన్ని కథల్లో రాక్షసులు తమ ప్రాణాలను ఏ పక్షి లోనోపెట్టి, దాన్ని ఎక్కడోదాచి తాము తిరుగుతూ ఉంటారనీ,ఆపక్షి క్షేమంగా ఉన్నంతకాలం వాళ్ళను ముక్కలు ముక్కలుగా నరికినా చావరనీ విని ఉంటాము. అదేవిధంగా జాతుల విషయంలో గూడా వాటికి ప్రాణభూత మైన, విశిష్ట వ్యక్తిత్వాలకు నిలయాలైన మర్మస్థానాలు ఎక్కడో ఉంటాయి. అవి చెక్కుచెదరనంతకాలం ఆ జాతులకు హాని ఉండదు.

అంతేకాదు, ఒక్కొక్కజాతి ఏ ముఖ్య ప్రయోజనంకోసం ఆవిర్భ వించిందో దాని జోలికి పోకుండా ఉన్నంతకాలం ఎన్ని ఔద్ధత్యాలనయినా సహిస్తుంది. కాని జాతి, మనిషికి మూలమైన ప్రధాన ప్రయోజనానికి ఏ కొంచెం హాని జరిగినా ఎంతమాత్రమూ సహించదు సరిగదా అత్యద్భుత మైన శక్తితో ఎదుర్కొని నిలబడుతుంది.

## ఆంగ్లేయ పరాసు జాతుల శీల వైవిధ్యం

ఉదాహరణకు నేటికీ సజీవమై విదితచరిత్రలుగల ఇంగ్లీషు, ఫ్రెంచి, హిందూ జాతుల తత్త్వాలు, రాజకీయ స్వాతంత్ర్యం ఫ్రెంచి జాతీయతకు వెన్నెముక వంటిది. ఆ జాతివాళ్ళు రకరకాల ఔద్ధత్యాలు భరించగలరు. భారపు పన్నులువేసి కట్టమను, కిమ్మనకుండా చెల్లిస్తారు. అందరూ సైన్యంలో చేరాలని ఆదేశించు, మారుమాటాడకుండా చేరుతారు. కాని రాజ కీయ స్వాతంత్ర్యం జోలికి ఎవరైనా వెళ్ళారో జాతి యావత్తూ ఒక్క

వ్యక్తిగా లేచి నిలబడి ఎదురు తిరుగుతుంది. 'మానుండి మా అధికారాన్ని ఎవ్వరూ తొలగించలేరు. విజ్ఞుడుగానీ, అజ్ఞుడుగానీ; ధనికుడుగానీ, దరిద్రుడు గానీ; పెద్దింట పుట్టనీ చిన్నింట పుట్టనీ మాదేశ పరిపాలనలోనూ, మా సంఘాన్ని మేము స్వతంత్రంగా నిర్వహించుకోవడంలోనూ మా అందరికీ సమాన భాగస్వామ్యం ఉన్నది.' ఫ్రెంచిజాతి స్వభావంలో కీలకమైన సిద్ధాంత మిదీ : ఆజాతి స్వాతంత్ర్యంలో ఎవడైనా జోక్యం కల్పించుకుంటే వాడు హతమైనాడన్నమాటే.

ఇంగ్లీషు జాతి స్వభావంలో ఇచ్చి పుచ్చుకునే లక్షణమూ, వర్తకుని వ్యాపార సరళీ ప్రాధాన్యం వహిస్తాయి. వాళ్ళ కెంతసేపూ తమకు రావలసినవి వస్తూ స్వప్రయోజనానికి భంగం కలగకపోవడమే ముఖ్యం. ఇంగ్లీషు వాడు రాజరికాన్ని సహిస్తాడు, భూస్వాములను కొలుస్తాడు. కాని దమ్మిడీ ఇమ్మంటే లెక్క అడగందే ఇవ్వడు, రాజున్నాడు బాగానే ఉన్నది. రాజాజ్ఞ శిరసావహించడానికీ, రాజును గౌరవించడానికీ అతని కేమీ అభ్యంతరం లేదు. రాజయినా డబ్బడిగితే మాత్రం ఇంగ్లీషువాడు వెంటనే 'నీ కెందు కవసరముందో చెప్పు. నీ కిస్తే నాకు వచ్చే లాభ మేమిటో చెప్పు. తర్వాత దాన్ని ఖర్చుపెట్టడంలో నా మాటకు విలువుండాలి. ఇలా అయితే నే నిస్తాను' అంటాడు నిర్మొహమాటంగా. ఒకప్పుడు రాజు బలవంతాన ధనం రాబట్టడానికి ప్రయత్నిస్తే ఆంగ్లజాతీ ఎదురు తిరిగి రాజును చంపివేసింది.

## హిందూ జాతి శీలం

'సాంఘిక రాజకీయ స్వాతంత్ర్యాలు మంచివే, కావలసినవే. కాని వాటికంటే ముఖ్యమైంది ఆత్మ స్వాతంత్ర్యం - అదే ముక్తి' అంటుంది హిందూ జాతి. మన జాతి ఆవిర్భవించిందే ఇందుకు. వైదికుడు, జైనుడు, బౌద్ధుడు, అద్వైతి, ద్వైతి, విశిష్టాద్వైతి,

శైవుడు, వైష్ణవుడు, శాక్తేయుడు — అందరూ ఏక మనస్కులై ముక్తినే కోరతారు. ఆ ఒక్క విషయం తప్పవిడిచి నువ్వేమైనా చెయ్యి, హిందువు తన్ను కాదన్నట్టు మౌనం వహిసాడు, కాని అతని జీవిత లక్ష్యమైన ముక్తిని కాదని, దానికై అతడు చేసే ప్రయత్నానికి విఘాతం కల్పించావో నీ మరణాన్ని నీవు ఆహ్వానించు కున్నట్టే! ముక్తి మార్గాని కడ్డు తగలకుండా ఉండి నిలువు దోపిడీ చెయ్యి, తన్ను, తిట్టు, ఎంత నీచమైన పేరుతోనయినా పిలు వాటి నన్నిటినీ అతడు సహించగలడు. దేహాభిమాన నిరాశానికి సహాయపడుతున్నావని కృతజ్ఞతకూడా ప్రకటిస్తాడు. ఇదీ హిందూ జాతి స్వభావం!

ఈ దేశంమీదికి పఠాను వంశీయులు ఎందరో దండెత్తి వచ్చారు, పోయారు. ఒక్కరూ స్థిరమైన రాజ్యం స్థాపించలేకపోయారు. కారణం వాళ్ళందరూ హిందూమతాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నించడమే. తర్వాత వచ్చిన మొగలాయీలు మతంజోలికి పోలేదు. నిజానికి మొగల్ సామ్రాజ్యానికి మూల స్తంభాలుగా నిలబడ్డది హిందువులే!

ఈ పర్యాలోచన బట్టి తేలిన సారాంశమేమిటంటే మన శక్తీ, మన సామర్థ్యం, మన జాతి ప్రాణం మన మతంలో ఉన్నాయి. మన జాతి ప్రాణశక్తి మతైకనిష్ఠ మయి ఉండడం మంచిదా చెడ్డదా, తప్పా ఒప్పా, ప్రయోజనకరమా హానికరమా, అన్న విచారణ ఇప్పుడనవసరం. మంచికో చెడ్డకో మన తత్త్వ మలా ఉన్నది. ఈ తత్త్వ మీ జాతికి పుట్టుకతో వచ్చింది, ఎప్పటికీ ఉంటుంది. ఇది మారేదికాదు. అందుచేత మన మతంలో నాకున్న విశ్వాసం నీకున్నా లేకపోయినా నీవూ దాన్ని అంటిపట్టుకునే ఉండాలి. కాదని విడిచిపెట్టితే జాతి ముక్కలు ముక్కలై పోతుంది. మతమే ఈ జాతికి ప్రాణంకాబట్టి దాన్ని శక్తిమంతం చెయ్యాలి.

సోమనాథ దేవాలయ చరిత్ర
కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది.

యుగయుగాల ధాటికి తట్టుకుని నీ జాతి ఇప్పటికీ సజీవమై ఉండడానికి హేతువు మతమే ప్రధానంగా పూర్వులు బ్రతికారు, దానికోసం సమస్తమూ త్యాగంచేశారు. ఎంతో ధైర్యంతో, ఎన్నో కష్టాలుపడి ప్రాణాలుకూడా అర్పించి మతాన్ని నిలబెట్టుకున్నారు. విమతస్థుల దౌష్ట్యానికి ఆహుతిఅయి వరసవరసగా దేవాలయాలు కూలిపోతే దాడి పోటు తగ్గగానే ఎక్కడివక్కడ మళ్ళీ వెలిశాయి.

దక్షిణ భారత ప్రాచీన దేవాలయాలూ, గుజరాతులోని సోమనాథ దేవాలయమూ అనేక పుస్తకాలకంటే ఎక్కువగా ఈ జాతి తత్త్వాన్నీ మన కర్తవ్యాన్నీ ఉపదేశిస్తాయి. ఆ దేవాలయాలు ఎన్నిసార్లు హతమై ఎన్నిసార్లు పునర్జన్మ లెత్తాయో గమనించండి. శిథిలమై పునరుద్భవాన్ని పొందినప్పుడల్లా మొట్టమొదటి దార్ఢ్యంతోనే నిలబడుతూ వచ్చాయి. అవి ఈ జాతి మనస్తత్త్వం! జాతీయ జీవ స్రవంతి అలా ప్రవహిస్తోంది. దాన్ని అనుసరిస్తే జౌజ్జ్వల్యాన్ని పొందుతాము విడిచిపెట్టితే వినాశమే గతి. జాతీయ జీవస్రవంతిని గమనించక ఒక్క అడుగు ఇవతలికి వేశామో నిర్జీవమై నామరూపాలు లేకుండా జాతి నశించిపోతుంది.

ఇలా అన్నందువల్ల ఇతర విషయాలేమీ అవసరంలేదని నా ఉద్దేశం కాదు. రాజకీయంగానూ, సాంఘికంగానూ అభివృద్ధి పొందవలసిందే! అంతకంటే ముఖ్యంగా మన మతంలో మనకు దార్ఢ్యం కలగాలి. ఈ జాతి ఆత్మ మతమై ఉన్నది కాబట్టి! మత నిష్ఠ ప్రధానమూ తక్కిన వప్రధానమూ అన్నమాట మరిచిపోగూడదు.

## యుగయుగాల జీవనంతో ఆవిష్కృతమైన శీల మిది!

ఈ జాతి ఆత్మ మతమే అన్నది నిశ్చయం. ఆ మతాన్ని ఎవ్వరూ నాశనం చెయ్యలేకపోయారు. కాబట్టే ఎన్నో కష్టాలన్నూ అవరోధాలనూ అతిక్రమించి ఈ హిందూజాతి ఇప్పటికీ సజీవంగా ఉండగలుగుతోంది. 'మన జాతి ఆత్మ మీరన్నట్లు మతమైనందువల్ల ప్రయోజన మేమిటి? ఇతర జాతులకువలె సాంఘిక స్వాతంత్ర్యమో, రాజకీయ స్వాతంత్ర్యమో ఆత్మగా ఎందుకు పెట్టుకోగూడదు?' అని భారతీయ పండితుడే అడిగాడు. అలా అడగడం చాలా తేలికే. కాని అది బాగా ఆలోచించి వేసిన ప్రశ్న కాదు.

మతము, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమూ, జీవుడూ, దేవుడూ, ముక్తి మొదలైనవన్నీ అయథార్థాలే అని వాదంకోసం అంగీకరించినా తత్త్వ మెలా ఉంటుందో గమనించండి. ఒకే అగ్ని దాని కాశ్రయమైన ఉపాధు లనుబట్టి వివిధరూపాలతో కనిపించినట్లు ఒకే మహాశక్తి ఫ్రెంచిజాతిలో రాజకీయ స్వాతంత్ర్యంగాను, ఆంగ్లజాతిలో వర్తక ప్రతిభగానూ, హిందూ జాతిలో ముక్తి కాంక్షగానూ ఆవిష్కృతమవుతోంది,

ఈ శక్తి ప్రభావంచేతనే కొన్ని శతాబ్దాలు ఉజ్జ్వలంగా జీవించి ఇంగ్లీషు, ఫ్రెంచి జాతులు తమ తమ జాతీయ శీలాలను నిర్మించుకున్నాయి, కొన్నివేల శతాబ్దాలు బ్రతికిన హిందూజాతిలో అదేశక్తివల్ల ఇప్పటి జాతీయ శీలం ఆవిష్కృతమైంది.

ఒకటి రెండు శతాబ్దాల పరాయి పాలనవల్ల మన కంటుకున్న విజాతీయ సంస్కారాన్ని విడిచిపెట్టడం తేలికా, లేక యుగయుగాల జీవనం వల్ల ఆవిష్కృతమైన జాతీయశీలాన్ని విడిచిపెట్టడం తేలికా? ఏది తేలికో మీరే చెప్పండి. మన జాతీయ శీలాన్ని విడిచిపెట్టాలన్న బుద్ధి మనకు

పుడుతోందిగాని ఇతరుల కిలాంటి దుర్బుద్ధి కలగడంలేదే? ఇంగ్లీషువాళ్ళు తమ అలవాట్లన్నీ మానుకుని రక్తపాతంతోకూడిన యుద్ధాలు విసర్జించి మతమే జీవితలక్ష్యం చేసుకుని ఎందుకు ప్రశాంతంగా కూర్చోరు?

ఉన్న సంగతిది. కొండల్లో ఉన్న జన్మస్థానం నుండి మహానది కొన్నివేల మైళ్ళు ప్రవహించి వచ్చింది. అది మళ్లీ వెనక్కి వెళ్తుందా, వెళ్ళగలదా? ఒకవేళ అలాంటి ప్రయత్నమే జరిగితే దిక్కుదిక్కులా చెదరి ఎండిపోవడమే తటస్థిస్తుంది. ఏమైనా 'నదీనాం సాగరో గతిః' అన్నట్లు అందమైన మైదానాల్లో సుఖంగా ప్రవహించో లేక ఇరుకు కొండలమధ్య కష్టపడుతూనో త్వరగానో ఆలస్యంగానో నదులు సముద్రాన్ని చేరుకోవలసిందే.

ఇన్నివేల సంవత్సరాల మన జాతీయ జీవనమూ అదేమార్గాన్నే అనుసరించి ఉంటే మనం చెయ్యగలిగిందేమీలేదు. ఇప్పుడు మనం మార్చాలని ప్రయత్నిస్తే మాత్రం మనకు వినాశమే గతి అవుతుంది.

## మన జాతీయ జీవనంలో ఇమిడిఉన్న అగ్ని

ఈపూట మన జాతిఉన్న పరిస్థితిని బట్టి మన జాతీయ లక్ష్యం పొరపాటైందని భావించడం వట్టి తెలివితక్కువా, అజ్ఞానమూ అని నే నంటున్నందుకు క్షమించండి. మొట్టమొదట ఇతర దేశాలకు వెళ్లి వాళ్ళ ఆచారాలనూ, పరిస్థితులనూ ఇతరుల కళ్ళతోకాక మీ కళ్ళతో మీరు చూచి, మీకేమైనా ఆలోచించే మనస్సుంటే వాటినిగూర్చి చక్కగా విచారించండి. తర్వాత మన ధర్మశాస్త్రాలనూ, ప్రాచీన సాహిత్యాన్నీ చదివి, ఆసేతు శీతాచలం భారతమంతా పర్యటించి, వివిధ ప్రాంతాల్లో ప్రజలు ఎలా బ్రతుకుతున్నారో, వాళ్ళ అలవాట్లేమిటో పూర్తిగా తెరిచిన కళ్ళతో నిసితంగా పరిశీలించండి. అప్పుడు మీకే తెలుస్తుంది సత్యమేమిటో! ఈ జాతి ఇప్పటికీ విస్పష్టమైన ప్రాణస్పందనంతో ఎప్పటివలెనే సజీవంగా ఉన్నది.

పై పై చూపులకు నిర్జీవంగా ఉన్నట్టు తోచినా నివురుగప్పిన నిప్పులా ఈ జాతిలో ప్రాణాగ్ని జ్వాలా విరహితంగా లోలోపల కాలుతూనే ఉన్నది. ఈ జాతికి మతమే ప్రాణం, మతమే భాష, మతమే ఆదర్శం! రాజకీయాలు, సంఘ వ్యవస్థ, గ్రామ పరిపాలన. రోగ నిరోధం, క్షామ నివారణం మొదలైనవన్నీ అనాదిగా ఎలా జరుగుతున్నాయో ఇప్పుడూ అలానే మతంద్వారానే జరుగుతున్నాయి. ఆ మతాన్ని తప్పిస్తే ఈ జాతికి నువ్వేమీ చెయ్యలేవు. నీ అనుతాపమూ, ఆక్రోశమూ కేవలం వృధాయే అవుతాయి.

## జాతి మూలసూత్రం

ప్రతి జాతీ ఒక్కొక్క ప్రత్యేక మార్గంలో పనిచేస్తూ ఉంటుంది. కొన్ని రాజకీయాల ద్వారా, కొన్ని సంఘ సంస్కారాల ద్వారా, మరికొన్ని ఇతర పద్ధతుల ద్వారానూ పనిచేస్తాయి. మన జాతి విషయంలో ఏం జరిగినా మతం ద్వారానే జరగాలి. ఇంగ్లీషువాళ్లు మతాన్నిగూడా రాజకీయాల ద్వారానే అర్థం చేసుకుంటారు. అమెరికావాళ్ళు బహుశః సంఘసంస్కారం ద్వారానే సమస్తమూ గ్రహిస్తారు. కాని హిందువు మతం ద్వారా వచ్చినప్పుడే రాజకీయాలనైనా గ్రహించగలడు. దేనైనా అతడు మతంద్వారానే గ్రహిస్తాడు, ఈ జాతి మూలసూత్రం మతమూ, తక్కినవన్నీ దాని రూపాంతరాలూ కాబట్టి!

రాజకీయ సర్వాధిక్యమే మరొకజాతికి మూలసూత్రం కావచ్చు. అయితే ఆజాతిలో మతమూ మొదలైన ఇతర విషయాలన్నీ ఆ మూల సూత్రానికి లొంగిపోవలసిందే. వైరాగ్యంతోడి ఆధ్యాత్మికత్వమే మూల సూత్రమై ఈ జగత్తు అంతా మిధ్య అనీ, మూన్నాళ్ళ ముచ్చట మాత్రమే అనీ చెప్పే మన జాతి ఒకటి ఉన్నది. శాస్త్రం, విజ్ఞానం, భోగాలూ,

అధికారాలూ, పేరు ప్రతిష్ఠలూ, సిరి సంపదలూ అన్నీ ఆ మూల సూత్రానికి లొంగిపోవలసినవే!

మనం నేర్చుకునే పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానమూ, సాధించే సిరి సంపదలూ, సంపాదించే పేరుప్రతిష్ఠలూ అన్నీ ప్రతి హైందవునకూ సహజంగా సిద్ధించే ఆధ్యాత్మికత్వానికి లొంగి ఉన్నప్పుడే హిందూజాతి శీలం సురక్షిత మవుతుంది.

## ఆధ్యాత్మికత్వమే సర్వాధారం కావాలి

పాశ్చాత్యుల భౌతిక నాగరకతను మోహించి ఆధ్యాత్మికత్వాన్ని విడిచిపెట్టితే మూడు తరాల్లో మన జాతి చూస్తూ ఉండగా వినష్టమైపోతుంది ఆధ్మాత్మికత్వం పోవడమంటే జాతి వెన్నెముక విరగడమన్నమాట. ఈ జాతి అనే మహాసౌధం ఏ పునాదిమీద నిర్మింపబడిందో దాన్నే పెకలించడమన్న మాట. ఫలితం సర్వనాశనం కాక మరేమవుతుంది?

అందుచేత మొట్టమొదట మనం చేయవలసిన కర్తవ్యం ఏమిటంటే మనకు మన పూర్వు లిచ్చిన అమూల్యసంపద అయిన ఆధ్యాత్మికత్వాన్ని దృఢంగా అంటిపట్టుకుని ఉండాలి. మహారాజులు గూడా రాజులనూ, కొండ గుహల్లో దాక్కుని ఉండి బాటసారులను దోచుకునే చోర శిఖామణులనూ కాక అడవుల్లో ఆశ్రమాల్లో నివసించే అర్ధదిగంబరులైన మహర్షులను తమ తమ వంశాలకు మూలపురుషులుగా చెప్పుకునే దేశాన్ని గూర్చి మీరు విన్నారా? ఇదే ఆదేశం! ఇతరదేశాల్లో మతాచార్యులు తమతమ వంశాలకు మూలపురుషులుగా రాజులను చెప్పుకుంటూ ఉంటే ఈ దేశంలో మహా రాజులు సర్వసంగపరిత్యాగులైన మహర్షులను మూలపురుషులుగా చెప్పు కుంటారు

అందుచేత నీకు ఆధ్యాత్మికత్వంలో నమ్మకమున్నా లేకపోయినా జాతీయ జీవనం సురక్షితంగా ఉండేటందుకు ఆ ఆధ్యాత్మికత్వాన్ని దృఢంగా అంటిపట్టుకుని ఉండాలి. దాన్ని సర్వాధారం చేసుకుని వీలైతే ఇతరజాతులనుండి ఎన్నైనా నేర్చుకోవచ్చు. ఏమి నేర్చుకున్నా జీవిత లక్ష్యమైన ఆధ్యాత్మికత్వం దృష్ట్యా అప్రధానమే కావాలి. అలా చెయ్య గలిగిననాడు ఈ భారతజాతికి మహోజ్జ్వల భవిష్యత్తు ఉంటుంది. పూర్వం కంటె మహోజ్జ్వలంగా భారతజాతి ప్రకాశించి తీరుతుంది.



# పునరుజ్జీవన కార్యక్రమం : దాని పునాదీ, లక్ష్యమూ.

ఓ భారతా !

ఈచిలకపలుకులతో, ఈనీచమైన అనుకరణంతో, ఈపరాధీనతతో.... ఇవే సాధనాలుగా నాగరకతా శిఖరాన్నీ. ఔన్నత్యాన్నీ పొందుతానని భావిస్తున్నావా నీవు ?

ఓయి భారతా !

మరిచిపోకు — నీ జాతిలో ఉత్తమ స్త్రీత్వానికి సీతా సావిత్రీ దమయంతులు ఆదర్శ మహిళామణులు.

మరిచిపోకు — నీ వారాధించే భగవంతుడు కఠోరదీక్షాపరులలో దీక్షాపరుడు, సర్వసంగపరిత్యాగి, ఆదిశంకరుడు, ఉమావల్లభుడు.

మరిచిపోకు — నీ వివాహం; నీ ఐశ్వర్యం, నీ జీవితం సమస్తమూ ఇంద్రియ సుఖానుభూతికీ వ్యక్తిగత సౌఖ్యానికీ కాదు.

మరిచిపోకు — నీవు పుట్టింది జగన్మాతృ పాదపీఠంవద్ద ఆత్మార్పణ చేసుకోవడానికి.

మరిచిపోకు — నీ సాంఘిక వ్యవస్థ సర్వానుగ్రహశీలమైన అనంత విశ్వ మాతృత్వానికి సాక్షాత్ప్రతిబింబం.

మరిచిపోకు — హీనకులజులు, అజ్ఞులు, పేదలు, నిరక్షరకుక్షులు, మాలలు, మాదిగలు సర్వులూ నీ సోదరులే !

ధీరాగ్రేసరా !

స్థైర్యం తెచ్చుకో, ధైర్యం వహించు. భారతవాసి వైనందుకు గర్వించు. సగర్వంగా గొంతెత్తి ప్రకటించు 'నేను భారతవాసిని. భారత వాసు లందరూ నా సోదరులు.'

స్పష్టంగా చెప్పు 'భారతవాసి అజ్ఞుడైనా, పేదవాడైనా, దిక్కులేని వాడైనా, బ్రాహ్మణుడైనా, అస్పృశ్యుడైనా అందరూ నా సోదరులే' అని.

తిన తిండీ, కట్ట గుడ్డా లేని దరిద్రుడవైన నీవుకూడా సంకోచింపక గర్వంగా ప్రకటించవోయి ప్రకటించు "భారతవాసు లెల్లరూ నా సోద రులు. భారతీయుడు నా ప్రాణం. భారతీయులు విశ్వసించే దేవతలే నా దైవం. భారతీయసంఘమే నా శైశవడోల, నా యౌవన సుందరోద్యానం, నా పవిత్ర స్వర్గం, వార్ధక్యంలో నా వారణాసి."

సోదరా !

భారత మృత్తిక స్వర్గంకంటే పవిత్రమైనదని ప్రకటించు. భారతావని కేది శ్రేయస్సో అదే నా శ్రేయస్సని చెప్పు.

'హే భగవాన్ గౌరీపతీ! ఓ విశ్వజననీ! దయామయీ! మీరు నాకు పౌరుషాన్ని ప్రసాదించండి. ఓ శక్తి స్వరూపిణీ! నా దౌర్బల్యాన్ని తొల గించు. క్లైబ్యాన్ని నిర్మూలించి నన్ను పురుషుణ్ని చెయ్యి' రాత్రింబగళ్ళు నిర్విరామంగా ఈ ప్రార్థన చెయ్యి!

పడమటినుంచి వచ్చిందంతా మంచిదట!

ఈ శతాబ్ది ప్రారంభంలో మన దేశానికి పాశ్చాత్యులు విజేతలుగా వచ్చి అధికార దౌర్జన్యంతో మన పిల్లలకు మన పూర్వ మహర్షులు అనాగ

రకులైన ఆటవికులనీ; పిచ్చి పిచ్చి కలలుకనే జాతికి చెందిన వాళ్ళనీ; మన మతం, మన పురాణాలు, జీవుడూ దేవుడూ అనే మన విశ్వాసం, పరమ పురుషార్థ సిద్ధికై మన జాతి చేసే సర్వ ప్రయత్నమూ, అన్నీ ఎందుకూ పనికిరాని నిరర్థక కాలక్షేపమనీ; అర్థంలేని వైరాగ్యంతో తప్పుడు లక్ష్యంతో మన జాతి వేలకొలది సంవత్సరాలు నిద్రాణమై వృథా చేసిందనీ; కత్తి ఎత్తి బెదిరిస్తూ బోధించినప్పుడు కళాశాలల్లో చదువుకునే భారతీయ యువకులకు "మన జాతి ఇన్నాళ్ళ మనుగడా వ్యర్థమైనట్లేనా? ప్రాచీన గ్రంథాలనూ, వేదాంతాలనూ తగలబెట్టి; మతాన్ని బోధించే సాధువులనూ, సన్యాసులనూ తరిమివేసి; దేవాలయాలు కూలద్రోసి ప్రాచ్య దృక్పథం పూర్తిగా విడిచిపెట్టి పాశ్చాత్య దృక్పథంతో పునర్జీవనం ప్రారంభించ వలసిందేనా? గత్యంతరంలేదా?" అన్న ఆందోళన తీవ్రంగానే కలిగింది. కత్తి మొన చూపి, తుపాకి గురిపెట్టి తన మతాన్ని ప్రచారం చేసిన పాశ్చాత్య విజేత మన ప్రాచీనుల పద్ధతులన్నీ ఎందుకూ పనికిరానివనీ, కేవల మూఢ విశ్వాసాలనీ చెప్పిన మాట నిజమే గదా!

పాశ్చాత్య దృక్పథంతో ప్రారంభింపబడిన కొత్త పాఠశాలల్లో చదువుకొని పెద్దవాళ్ళయిన మన పిల్లలందరూ చిన్నప్పటినుంచీ ఈభావాల్లో మునిగితేలారు. మరి అటువంటివాళ్ళకు ఇలాంటి సందేహాలు తోచాయంటే ఆశ్చర్య మేముంది? సందేహాలు కలిగినప్పుడు మూఢ విశ్వాసాలను తొల గించుకుని సత్యమేమిటని పరిశోధించవలసింది ఆపని చెయ్యలేదు సరిగదా పాశ్చాత్యులు చెప్పిందే సత్య మన్న మూర్ఖతలో పడిపోయారు. వాళ్ళు చెప్పారు కాబట్టి సన్న్యాసులు పోవాలి, వేదాలు తగలబెట్టాలి అన్న నిర్ణ యానికి వచ్చారు.

## దుర్బలు లందరూ బలవంతుల వైపుకే మొగ్గుతారు

పాశ్చాత్య దేశాల్లోకూడా బలహీనజాతులవాళ్లు ఇంగ్లాండులో పుట్టిన వాళ్ళయితే తమతమ జాతుల పేర్లు గ్రీకులనో పోర్చుగీసులనో

చెప్పుకోక ఇంగ్లీషువాళ్ళమనే చెప్పుకోవడం నేను గమనించాను. దుర్బలు లందరూ బలవంతుల వైపునే మొగ్గుతారు. గొప్పవాళ్ళ తేజస్సు ఎలాగైనా తమమీద పడితే చాలు, తామూ ఆ తేజస్సులో ప్రకాశించవచ్చుగదా అని వాళ్ళ ఉద్దేశ్యం. సహజ తేజస్సుతోకాక గొప్పవారినుండి అరువు తెచ్చు కున్నదాంతోనైనా వెలగడమే ఆ దుర్బలుల కోరిక.

## మేలుకొంటున్న భారతజాతి

ప్రస్తుతం భారతదేశాన్ని పాలిస్తున్న ప్రభుత్వంలో కీళ్లూ ఉన్నాయి కొన్ని గొప్ప మేళ్ళూ ఉన్నాయి. అన్నింటి కంటె గొప్ప మేలేమిటంటే పాటలీపుత్ర సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తరువాత ఆ మూలనుండి ఈ మూలవరకూ యావద్భారతమూ బ్రిటిషు ప్రభుత్వం వంటి శక్తివంతమైన నాయకత్వంలో ఎన్నడూ వుండలేదు.

ఈ వైశ్య ప్రభుత్వంలో వాళ్ళ సహజ లక్షణమైన నిర్విరామకృషిని పురస్కరించుకునే ప్రపంచంలో వ్యాపారానికి పనికివచ్చే వస్తువులన్నీ సేకరించబడుతున్నట్లే వాటితోపాటు భిన్నదేశాల భావాలూ, ఆదర్శాలూ సహజంగానే వచ్చి భారత జాతికి ఒంటబట్టిపోతున్నాయి. వీటిల్లో కొన్ని జాతి కెంతో ఉపయోగకరమైనవి, కొన్ని హానికరమైనవి. తక్కినవి ఈ దేశానికి ఏది మంచో నిర్ణయించలేని విదేశీయుల అజ్ఞానాన్ని ప్రకటించేవి.

ఇది ఇలా ఉండగా ఇప్పటికి జరిగిన మేలు కీళ్ళ సమాహారం మధ్యనుండే భవిష్యద్భారతాభ్యుదయ సూచనలూ గోచరమవుతున్నాయి ప్రాచీనమైన తమ జాతీయాదర్శాలకూ కొత్తగా ప్రవేశించిన ఇతరజాతుల ఆదర్శాలకూ ఉన్న వైవిధ్యం వల్ల సుదీర్ఘ గాఢ నిద్రనుండి నెమ్మది నెమ్మదిగా జాతి మేలుకుంటోంది.

ఆధునిక భారతంలో ఇప్పుడు కనిపిస్తున్న స్వతంత్రమైన ఆలోచ నకు కొంతవరకు ఈ మెలకువే కారణం. ఒకవంక పాశ్చాత్య విజ్ఞాన

శాస్త్రం కోటి సూర్యప్రకాశంతో కళ్లు మిరుమిట్లు గొల్పుతూ ప్రకృతి శక్తుల నుపయోగించి సాధించిన ప్రత్యక్ష ఫలితాలద్వారా విశ్వాసాన్ని చూరగొంటోంది. మరొకవంక తమ జాతి మహోన్నతవైభవాన్ని అనుభవించిన రోజుల్లో విజ్ఞానమూర్తులైన ప్రాచీను లేర్పరచిన శ్రేయస్కరాలయిన బలిష్ఠ సంప్రదాయాలు, బహుకాలం బ్రదికిన అనుభవంతో ఈ దేశానికి చెందిన మహర్షులు వ్యవస్థ చెయ్యగా విశ్వప్రేమతో స్పందిస్తూ జాతి నరనరానికీ పట్టి వేలకొలది సంవత్సరాలుగా ఆచరణలో ఉంటున్న సంప్రదాయాలు, అవధిలేని పరాక్రమాన్నీ అతిమానవ మేధాసంపత్తినీ అత్యుత్తమమైన ఆధ్యాత్మికత్వాన్నీ వ్యక్తంచేస్తూ దేవతలకు గూడా అసూయాజనకమయ్యే మహత్తర సంప్రదాయాలు — నీకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉందని జాతిని ఉత్తేజపరుస్తూ ఉన్నాయి.

ఒకవంక కేవల భౌతికవాదం సంపత్సమృద్ధినీ, మహత్తర శక్తి సమాహారాన్నీ, ఇంద్రియ సుఖపరాయణతనూ చూపి పాశ్చాత్య సాహిత్యం ద్వారా సంక్షోభపరుస్తోంది. మరొకవంక విజాతీయ భావాల వికటధ్వనుల ఆర్భాటం ఎంత చెలరేగుతున్నా యుగయుగాలుగా తాను నమ్మిన ప్రాచీన దేవతల ఆక్రందనాలు హృదయాన్ని మెలివేస్తూ సన్నగానైనా విస్పష్టంగానే వినిపిస్తున్నాయి.

పాశ్చాత్యులు చవిచూపిన వింత వింత భోగాలు, మైమరపించే మద్యాలు, విలువైన భోజనం, అద్భుతమైన దుస్తులు, పెద్ద పెద్ద సౌధాలు; కొత్తరకాల యాన సౌకర్యాలు, సరికొత్త ఆచారాలు, ఎన్నడూ ఎరగని నూతన వేషాలు, వాటితో అలంకరించుకుని సిగ్గులేని స్వాతంత్ర్యంతో తిరుగాడుతూ మిరుమిట్లు గొలిపే చదువుకున్న యువతులూ– ఇవన్నీ ఎదురుగా కనిపించి జాతికి కొత్తకోరికలు పుట్టిస్తున్నాయి.

అంతలో దృశ్యం మారి గంభీర ముద్రతో అదేచోట మరో దృశ్యం గోచరమవుతుంది. హిందూస్త్రీత్వ మహత్తర లక్ష్యమైన పతివ్రతా

త్వమూ, దానికి ప్రతీకలైన సీతా సావిత్రులూ, చతుర్విధ పురుషార్థ సిద్ధికై జాతి అవలంబించే నీతి నియమాలూ, ఉపవాసాలూ, వ్రతాలూ, వానప్రస్థమూ, శిరోజ సంస్కారం మాని జడలు కట్టించుకునే సాధువులూ, సర్వసంగపరిత్యాగ చిహ్నమైన కాషాయవస్త్రాన్ని ధరించే సన్న్యాసులూ, సమాధీ, ఆత్మావలోకనమూ- ఇవన్నీ స్మృతికి వచ్చి జాతిని నిలవేస్తున్నాయి. ఒకప్రక్క కేవలం స్వార్థపరత్వంమీద ఆధారపడిన పాశ్చాత్య సంఘాల స్వాతంత్ర్య మాకర్షిస్తుంటే రెండవప్రక్క ఆర్యసంఘ ప్రధాన లక్షణమైన సంపూర్ణ స్వార్థత్యాగం 'నీవూ నన్ను వదలివేస్తావా' అని ప్రశ్నిస్తోంది. పరస్పర విరుద్ధాలయిన ఈ ఆదర్శాల మధ్య భారత జాతి డోలాందోళిత మయిందంటే ఆశ్చర్య మేమున్నది ?

పాశ్చాత్య జాతులకు వ్యక్తి స్వాతంత్ర్య లక్ష్యం, ద్రవ్యార్జన విద్యయే భాష, రాజకీయాలే సాధనం ! భారతజాతికి భవబంధ విమోచనం లక్ష్యం. వేదమే దాని భాష, సర్వసంగ పరిత్యాగమే సాధనం !

ఇంత వైవిధ్యం ఉండడంచేతనే ఆధునిక భారతం 'ఇన్నాళ్ళూ నా మనస్సు నాకర్షించిన అనిశ్చితమైన ఆధ్యాత్మిక క్షేమంకోసం ఇహలోక జీవితమంతా నాశనం చేసుకుంటున్నాను.' అని ఒకప్పుడు భావిస్తుంది. అంతలోనే గట్టిచేసుకుని 'ఇహ సంసారే స్ఫుటతర దోషః కథ మిహ మానవ తవ సంతోషః - అనిత్యమూ మర్త్యమూ అయిన ఈ లోకంలో నీకు సంతోష మెలా లభిస్తుందోయి మానవా !' అన్న వేదాంతబోధను చెవులొగ్గి వింటుంది.

'మనమే గనక పాశ్చాత్య లక్ష్యాలనూ, భావాలనూ అంగీకరించి వాళ్ళ భాష నుపయోగించుకుని, వాళ్ళ వేషం, వాళ్ళ తిండీ, వాళ్ళ పద్ధతులూ అవలంబిస్తే వాళ్ళవలె మనం కూడా బలవంతులమూ, శక్తివంతులమూ అవుతాము' అని ఒకప్రక్క నూతన భారతం ప్రకటిస్తోంది. మరొకప్రక్క ప్రాచీన భారతం 'మూర్ఖులారా ! అనుకరణవల్ల ఇతరుల భావాలు మీవి

ఎన్నడూ కావు. మీ స్వయంకృషితో మీరు సాధించిందే మీ దవుతుంది. పులితోలు కప్పుకున్నంతమాత్రాన గాడిద పులి అవుతుందా?' అని హెచ్చరిస్తోంది.

'పాశ్చాత్యుల మార్గమే సరిఅయినది, కాకపోతే వాళ్ళంత గొప్ప వాళ్ళు ఎలా అయ్యారు?' అని నూతన భారతం ప్రశ్నిస్తూ ఉంటే ప్రాచీన భారతం 'క్షణంలో మాయమయ్యే మెరుపు, ఎక్కడలేని కాంతి కలిగి ఉంటుంది. అది ఒక్క క్షణమే ఉంటుం దన్న సంగతి మరిచిపోగూడదు. అటువంటి మెరుపే నీ కళ్ళను మోసగిస్తోంది, జాగ్రత!' అని హెచ్చరిస్తోంది.

## నేర్చుకోవాలిగాని అనుకరించగూడదు

అయితే మనం పాశ్చాత్యులనుండి నేర్చుకోవలసిన దేమీ లేదా? మన మింతకంటే బాగుపడడానికి చెయ్యవలసిన దేమీ లేదా? మనం పరిపూర్ణులమా? మన సంఘంలో ఏ దోషమూ లేదా! మనం నేర్చుకోవలసినవి చాలా ఉన్నాయి. చచ్చేవరకూ అభ్యుదయానికి కృషిచేస్తూ ఉండవలసినదే. కృషితోనే మానవజీవితం పరిసమాప్త మవుతుంది.

శ్రీ రామకృష్ణ పరమహంస 'నేను బ్రదికి ఉన్నంతకాలం నేర్చుకుంటూనే ఉంటాను.' అని ఎప్పుడూ అంటూ ఉండేవారు. మానవుడుకాని సంఘంగాని నేర్చుకోవలసింది లేదని అనుకుంటే మృత్యు ముఖంలో ఉన్నట్లే! నిజంగానే పాశ్చాత్యులనుండి మనం నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. ఆ నేర్చుకోవడంలో ప్రమాదాలూ ఉన్నాయి కాబట్టి ఎంతో హెచ్చరికతో నేర్చుకోవాలి.

శ్రీ రామకృష్ణుని దగ్గరకు ఒక మిడిమిడి జ్ఞానంగల యువకుడువచ్చి హిందూ ధర్మశాస్త్రాలను ఎప్పుడూ దూషిస్తూ ఉండేవాడు. ఒకరోజున అతను అకస్మాత్తుగా భగవద్గీతను ప్రశంసిస్తూ మాట్లాడాడు. వెంటనే

శ్రీ రామకృష్ణ లన్నారుగదా 'ఎవడో పాశ్చాత్య పండితుడు భగవద్గీతను మెచ్చుకుని ఉండాలి. అందుకే మనవాడిలా మాట్లాడాడు!

హే భారతా! నీ వీ ప్రమాదంలో పడి పోతున్నావు. పాశ్చాత్యాను కరణ మోహం నిన్ను బంధించి వేస్తోంది. మంచిచెడ్డల నిర్ణయానికి తర్కమూ, ఆలోచనా, అంతస్సాక్షీ, శాస్త్రాధారమూ హేతువులుకాక కేవలం పాశ్చాత్యులాచరిస్తూ ఉండడమే హేతువయిపోతోంది. తెల్లవాళ్ల ఔనన్నవి మంచివి, కాదన్నవి చెడ్డవి. అయ్యో! ఇంతకంటె అవివేకం ఇంకేముంటుంది?

## వాళ్ళ కమృతమైంది మనకు విషం కావచ్చు

మనం మన స్వభావానికి అనుగుణంగా అభ్యుదయం పొందాలి. పాశ్చాత్యులు మన సంఘానికి అంటగట్టిన పద్ధతుల ననుసరించడం నిష్ప్రయోజన మవుతుంది. అది సాధ్యమూ కాదు. ఒక జాతి మరొక జాతిగా వెయ్యి పుటాలు వేసినా మారడానికి వీలులేనట్లు సృష్టించిన భగవంతునకు నమోవాకాలు.

ఇతర జాతుల విధానాలను నేను దూషించడంలేదు. అవి వాళ్ళకు మంచివి కావచ్చు, మనకు కావు. వాళ్ళ కమృతమైంది మనకు విషం కావచ్చు. ముందు మనం నేర్చుకోవలసిందిది. ఈ పూట వాళ్ళు అనుసరిస్తున్న మార్గాని కంతకూ వెనుక, వాళ్ళ వ్యవస్థలు, వాళ్ళ సంప్రదాయాలు, వాళ్ళ శాస్త్రాలు వాళ్ళకున్నాయి. యుగయుగాలు నమ్మిన కర్మ సిద్ధాంతమూ, స్థిరపడిన సంప్రదాయాలూ ఉన్న మనం వీటి కనుగుణమైన మార్గంలోనే నడవాలి, అందులోనే నడవగలుగుతాం.

## రెండురకాల నాగరకతలు

సంఘ జీవన నిర్మాణానికి ప్రపంచంలో రెండు పద్ధతు లవలంబించబడ్డాయి. ఒకచోట మతం పునాదిగా సంఘజీవనం నిర్మింపబడితే, మరొక

చోట సాంఘికావసరమే పునాదిగా నిర్మింపబడింది. మొదటిదానికి ఆధ్యాత్మికత్వం ఆధారం. రెండవదానికి భౌతికత్వమే మూలం. దీనికి ప్రమాణాతీతమైన పరమార్థమే హేతువు. దానికి ప్రత్యక్షమైన వాస్తవమే హేతువు. ఈ సంఘం అల్పమైన భౌతిక జగత్తును దాటి చూచి ఆ పరమార్థపు దృష్టితో ఈ లోకాన్ని కాదని ధైర్యంతో ఇక్కడి జీవితాన్ని ప్రారంభిస్తుంది. ఆ సంఘం ఈలోకంతో తృప్తిపడి ఇక్కడ స్థిరపడడానికి ప్రయత్నిస్తుంది.

అందుచేత దేని పద్ధతి దానిదే. భారతజాతి మతైకనిష్ఠం, అంటే అంతర్ముఖమైనది. పాశ్చాత్యజాతులు భౌతికశాస్త్రనిష్ఠాలు, అంటే బహిర్ముఖమైనవి. పాశ్చాత్యజాతులకు సాంఘికాభ్యుదయం ద్వారానే ఆధ్యాత్మిక ఫలితాలు కావాలి. ప్రాచ్యజాతులకు ఆధ్యాత్మికత్వంలోనే సాంఘికాభ్యుదయం కావాలి. అందుకనే మన దేశంలో ఆధునిక సంస్కర్త లందరూ మతాన్ని అణగద్రొక్కి ఏవేవో సంస్కారాలు చెయ్యాలనుకున్నారు. వాళ్ళ ప్రయత్నాలు ఏమీ ఫలించలేదు. ఎందుచేత ? వాళ్ళెవరూ మన మతాన్నిగూర్చి చదివినవాళ్ళు కారు. అన్ని మతాలకూ తల్లి అయిన వేదమతాన్ని అర్థంచేసుకునేందుకు తగిన శిక్షణ పొందినవాళ్లూ కారు.

హిందూసంఘాన్ని పెంపొందించేందుకు మతాన్ని నాశనం చెయ్యవలసిన అవసరం లేదని నా విశ్వాసం. ఈ రోజున మన సంఘం ఇలా ఉండడానికి హేతువు మతం కాదు, ఆ మతాన్ని సరిగ్గా వినియోగించుకోక పోవడమే :

కొన్ని మార్పు లవసరమే - కాని
భారతదేశం ఎన్నడూ ఐరోపా కాలేదు

భారతదేశానికి తటస్థించిన కొత్త పరిస్థితులు సంఘ వ్యవస్థలో మార్పులు తేవాలని ప్రయత్నిస్తున్నాయి. కడచిన ఏభై అరవై సంవత్స

రాల్లో సంఘ సంస్కరణ సమాజాలూ, సంస్కర్తలూ విపరీతంగా పెరిగి భారతజాతి కుతకుత లాడుతోంది. కాని ఎవరి ప్రయత్నాలూ ఫలించలేదు. ఉన్న రహస్యం వాళ్ళ కెవరికీ తెలియలేదు. వా శ్లెవరూ నేర్చుకోవలసిన పాఠం నేర్చుకోలేదు. ఏదో చెయ్యాలన్న తొందరలో సంఘంలో ఉన్న అనర్థాల కన్నింటికీ కారణం మతమని దాని మీద సర్వ దోషాలూ ఆరోపించారు. వెనకటి కేదో కథలో చెప్పినట్టు స్నేహితుని మెడ మీద వాలిన దోమను కత్తితో చంపడానికి యత్నించిన మనిషివలె దోమా స్నేహితుడూ ఇద్దరూ చచ్చేటంత పెద్ద దెబ్బలే వేశారు. కాని అదృష్ట వశాత్తూ ఇక్కడ మాత్రం వాళ్ళెదుర్కొన్నది దుర్భేద్యములైన కుల పర్వతాలై తలలు పగిలి వాళ్ళే వినాశం పొందారు.

తప్పుడు మార్గా లవలంబించి వైఫల్యం పొందినా నిస్వార్థపరులై జాతీయాభ్యుదయానికి జీవితా లర్పించిన ఆ మహానుభావులు అందరూ అభినందనీయులు. సంస్కరణదీక్షతో వాళ్ళు సాధించిన మహోద్యమాలు తీవ్రాఘాతాలవంటివై ఎన్నాళ్ళబట్టో నిద్రిస్తున్న జాతిని మేల్కొల్పాయి. కాని వాళ్ళ సంస్కారాలు నిర్మాణాత్మకం కాక వినాశనాన్ని కోరినవే అయి నందువల్ల మర్త్యములై వినాశనాన్నే పొందాయి.

వాళ్ళ నభినందించి ఆ అనుభవాన్ని మన ముపయోగించుకుందాము. ఈ సృష్టిలో పెరుగుదలకు అంతరమైన శక్తియే హేతువు. పై మార్పు లన్నీ లోపలి మార్పుల కావిష్కారాలే అవుతాయి. ఆంతరమైన పరిణామం లేకుండా పైపై మార్పులు చేస్తే అవి అతకడమే అవుతుందిగాని పెరగడం కాదు. విత్తు భూమిలోపడి, లభించిన పరిసర పదార్థాల నన్నింటినీ వినియోగించుకుని తన స్వభావాన్ననుసరించే చెట్టుగా పెరుగుతుంది. ఈ సంగతి మన సంఘ సంస్కర్తలకు తెలియలేదు. హిందూజాతి యావత్తూ నశించి (అటువంటి దెన్నడూ జరగదు - పాపం శమించుగాక!) మరొక కొత్త

జాతి ఈ దేశాన్ని స్వాధీనం చేసుకుంటేతప్ప ప్రాచ్యులుకాని, అప్రాచ్యులు కాని ఎవ రెంత ప్రయత్నించినా భారతదేశం ఐరోపా కాలేదు.

ఇతిర జాతులనుండి మనం నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయని నే నంగీకరిస్తాను. కాని మన ఆధునిక సంస్కరణోద్యమాలన్నీ ఆలోచన ఏమాత్రమూలేని అనుకరణలు మాత్రమే అని చెప్పడానికి విచారిస్తున్నాను. ఇటువంటి అనుకరణ భారతదేశానికి ఎంతమాత్రమూ పనికిరాదు. ఇందుకనే ఒక్క సంస్కరణోద్యమమూ ఫలించలేదు. చారిత్రకంగా ఆవిష్కృతమైన మన జాతీయ శీలాన్ని మనం నిలబెట్టుకోవాలి.

## మారని కేంద్రం చుట్టూ మారే రూపాలు

మొట్టమొదట మనం ప్రతి విషయంలోనూ ఏది ప్రధానమో, ఏది అప్రధానమో విచక్షణతో గ్రహించాలి. ప్రధానమైనవి శాశ్వతాలు, అప్రధానమైనవి తాత్కాలికాలు.

కులాలు మారుతున్నాయి, కర్మలు మారుతున్నాయి. అందుచేత అవి మారే రూపాలు. కాని వాటికి సారమైన సిద్ధాంతం మారడంలేదు. అది మారని కేంద్రం. మన మతాన్ని మనం వేదాలు చదివి తెలుసుకోవాలి. వేదాలుతప్ప మిగిలిన గ్రంథాలన్నీ మారవలసినవే!

వేదం నిత్యమైంది కాబట్టి అది అన్నికాలాలకూ ఒకటిగానే ఉంటుంది. కాని స్మృతులు మారుతాయి. కాలం గడిచినకొద్దీ ఒక స్మృతి తర్వాత మరొక స్మృతి వస్తూ ఉంటుంది. మహర్షు లావిర్భవించి కాలాన్ని బట్టి ఉత్తమమార్గాల్లో సంఘాన్ని నడిపిస్తూ విధినిషేధాలు తెలిపే నూతన స్మృతులను ప్రసాదిస్తూ ఉంటారు. ఈ పని జరగకపోతే సంఘం బ్రతకదు.

పూర్వం మీదేశంలో ఎన్నో మహత్తర కార్యాలు జరిగాయి. ఇంకా గొప్పపనులు జరగడానికి కాలమూ, అవకాశమూ అనంతంగా ఉన్నాయి. మనం నిశ్చలంగా ఉండడానికి వీలులేదని మీ కందరకూ తెలుసు. జాతి నైశ్చల్యం వహించిందంటే మరణించిందన్న మాటే! ముందుకో వెనక్కో మనం కదిలి తీరాలి. ప్రాచీనకాలంలో మన పూర్వులు గొప్ప పనులే చేశారు. అయినా మనం పురోగమించి మరింత సంపూర్ణ జీవితాన్ని పొంది వాళ్లు సాధించిన వాటికంటే గొప్ప ఫలితాలను సాధించాలి. యుగయుగాలు బ్రదికిన జాతికి చెందిన మనం వెనకడుగువేసి ఎందుకు నిర్వీర్యుల మవుతాము? అది జరగదు, జరగకూడదు. వెనకడుగు వెయ్యడమంటే జాతీయ వినాశాన్ని కోరి తెచ్చుకోవడమే. అందుచేత మనం పురోగమనమే చేద్దాము మహత్తర కార్యాలు సాధిద్దాము. ఇదే నే నివ్వవలసిన సందేశం!

## కాలపరీక్ష కాగిన భారతీయ సాంఘిక వ్యవస్థ

మన కులాలూ, కట్టుబాట్లూ మతానికి సంబంధించినట్లు పైకి కనిపిస్తున్నా నిజానికి మనమతం వాటి కతీతమైంది. ఈ నియమాలన్నీ మన్ని ఒక జాతిగా సంరక్షించడానికి అవసరమై వచ్చాయి. ఆ అవసరం తీరిపోవడం తోటే అవన్నీ వాటంతటవే పోతాయి.

నేను పెరిగినకొద్దీ కాలపరీక్ష కాగిన భారతీయ సాంఘికవ్యవస్థలోని తత్త్వం నాకు అధికాధికంగా అర్థమవుతూ వచ్చింది. ఒకప్పుడు నేను గూడా ఇవన్నీ ఎందుకూ పనికిరానివనీ, వీటివల్ల ప్రయోజనం లేదనీ అనుకున్నాను. కాని పెరిగి పెద్దయిన తర్వాత బాగా ఆలోచిస్తే యుగ యుగాల అనుభవం ఫలితంగా అవసరమై ఏర్పడిన సహజ నియమాల్లో ఏ ఒక్కదాన్నీ కాదనడానికి ధైర్యం చాలడంలేదు.

నిన్నగాక మొన్నపుట్టి రేపో ఎల్లుండో చచ్చిపోయే శిశువువచ్చి నా ప్రణాళిక నంతనూ మార్చుకొమ్మని నాకు బోధచేస్తోంది. ఆ శిశువు సలహాను

పాటించి దాని ఊహలప్రకారం నా పరిసరాల నన్నింటినీ మార్చివేసుకుంటే నాకంటే మూర్ఖుడు మరొకడుండడు.

ఇతరదేశాలనుండి మనకు వచ్చే సలహాలన్నీ ఇంచుమించు ఇటువంటివే! ఆ అల్పప్రజ్ఞులకు మనం 'ముందు మీ దేశాల్లో సుస్థిరమైన సంఘాలను స్థాపించుకోండి. తర్వాత మీ సలహాను గూర్చి ఆలోచిస్తాము. రెండురోజులపాటు మీ రొక్క భావంమీద నిలబడలేరు. అదికాదని ఇదీ, ఇదికాదని అదీ మార్చివేస్తూనే ఉంటారు. మీబోటి వాళ్ళందరూ ఎప్పుడూ కలహిస్తూనే ఉంటారు. ఈ క్షణంలోపుట్టి మరుక్షణంలో నశించే పురుగుల్లా పుట్టి పోతూ ఉంటారు. మీ బ్రతుకులు నీటిబుడగలకంటె కనాకష్టం: ఇటువంటి జాతులవాళ్ళు సలహాలిస్తా రెందుకు! ముందు మీరు మా మాదిరిగా సుస్థిరమైన సంఘాన్ని స్థాపించండి. శతాబ్దాలు నిలబడే నియమాలూ కట్టుబాట్లూ ఏర్పరచండి. ఆ తర్వాత మీతో సంప్రదించడానికి ఏమైనా అవకాశం ఉంటుంది. అంతవరకూ ఏమీ తెలియని శిశువులే మీరు' అని చెప్పవలసి ఉంటుంది.

## మన మానవాభ్యుదయ ప్రణాళికా, దాని లక్ష్యమూ

నేను తాత్కాలిక సంఘ సంస్కారాన్ని బోధించేవాణ్ని కాను. ఇప్పటి అనర్థాలను నిర్మూలించడానికీ యత్నించను. మన పూర్వులు సక్రమంగా ఏర్పరచిన మానవాభ్యుదయ ప్రణాళికను తుదముట్టా నిర్వహించండని మాత్రమే నేను కోరుతున్నాను. ఏకమైన ఆత్మవస్తువే భిన్న రూపాల్లో కనిపిస్తోందనీ, మానవుడు సాక్షాద్భగవత్స్వరూపుడనీ బోధించే వైదిక లక్ష్యాన్ని అందుకోవడానికి అధికాధికంగా కృషిచెయ్యండి.

మన కిప్పటి కట్టుబాట్ల నేర్పరచిన ప్రాచీనులు కూడా వర్ణాల నతిక్రమించారు. కాని వాళ్ళు ఆధునిక సంస్కర్తలవంటివాళ్ళు కారు. వర్ణాతిక్రమణ మంటే ఊళ్ళో ఉన్న భిన్నవర్ణాలవాళ్లూ ఒకచోట కూర్చుని మద్య

మాంసాలు సేవించడమనీ, మూర్ఖులూ ఉన్మత్తులూ అయి యథేచ్ఛగా వివాహాలు చేసుకోవడమనీ - ఆ విధంగా దేశాన్ని ఉన్మత్తనిలయం చెయ్యడమే అభ్యుదయమనీ వా శ్శెన్నడూ భావించలేదు. ఈనాటి సంస్కర్తలవలె జాతీయాభ్యుదయం విధవా వివాహాలమీదనే ఆధారపడి ఉందని అనుకోలేదు. ఇటువంటి వాటివల్ల బాగుపడ్డ జాతిని నే నింతవరకూ చూడలేదు, వినలేదు.

## బ్రాహ్మణత్వమే హిందూజాతి ఆదర్శం

మన పూర్వులకు బ్రాహ్మణుడే ఆదర్శ మానవుడు. ఈ బ్రాహ్మణ లక్ష్యం మన గ్రంథా లన్నిటిలోనూ కనిపిస్తుంది. ఐరోపాలో కార్డినలు ప్రభువు తన ఆభిజాత్యాన్ని నిరూపించుకోవడానికి ఎంతో కష్టపడి వేల కొలది పౌనులు ఖర్చుపెట్టి పాత రికార్డులన్నీ వెతికించి తాను పూర్వ మెప్పుడో ఏ కొండ గుహల్లోనో దాక్కొని బాటసారులను దోచుకుని తిన్న ఫలానా మహానుభావుని వంశానికి చెందినవాణ్ణని తెల్చుకునేవరకూ తృప్తి పడడు. వాళ్ళ వంశాలకు గొప్పతనాన్ని తెచ్చే మూల పురుషుల ప్రవర్తన అలాంటిది.

భారతదేశంలో ఆభిజాత్య నిరూపకమైనది ఇతరదేశాలకు పూర్తిగా భిన్నమైనది. ఇక్కడ ఏకచ్ఛత్రంగా భూమండలాన్ని పాలించిన చక్రవర్తులు కూడా కందమూల ఫలాలు తింటూ దిగంబరులై అడవుల్లో నివసించే వేదాధ్యయన పరులైన మహర్షులను మూల పురుషులుగా చెప్పుకుంటారు. ఈ దేశంలో ఋషి గోత్రజులు కావడమే ఆభిజాత్య నిరూపకమైన లక్షణం.

అందుచేత ఉత్తమ వంశమంటే మనలక్ష్యం ఇతరుల లక్ష్యం కంటే ఎంతో భిన్నమైనది. సర్వసంగ పరిత్యాగియై ఆధ్యాత్మిక సంస్కృతితో పరిపూర్ణుడైన బ్రాహ్మణుడే మన ఆదర్శం. బ్రాహ్మణుడు మన ఆదర

మంటే నా తాత్పర్య మేమిటో గ్రహించండి. ప్రాపంచిక దృష్టి ఏ కొంచెమూ లేక సత్యమైన పరమార్థ విజ్ఞానం సంపూర్ణంగా ఉన్న బ్రాహ్మణత్వమే మన ఆదర్శమని నా ఉద్దేశం. అదే హిందూజాతి ఆదర్శం,

బ్రాహ్మణుడు సర్వ నియమాలకూ అతీతుడనీ, ఏ చట్టమూ అతన్ని నిగ్రహించదనీ, రాజుల అధికారానికి అతడు లొంగడనీ, అతని శరీరానికి ఏ హానీ కలుగదనీ చెప్పుకోవడం మీరు వినలేదా? అది ముమ్మాటికీ నిజం! బ్రాహ్మణుని గూర్చిన ఈ వర్ణనకు స్వార్థపరులూ, మూర్ఖులూ చేసిన వ్యాఖ్యానాన్ని బట్టి దీన్ని అర్థం చేసుకోకండి. తాత్త్వికంగా సరియైన దృష్టితో అర్థం చేసుకుంటే బ్రాహ్మణత్వ మంటే ఏమిటో తెలుస్తుంది.

ప్రభుత్వమే అక్కరలేదు.

స్వార్థ పరత్వం సమూలంగా పెకలించివేసే విశ్వప్రేమ మయుడై, విజ్ఞానం ఆర్జించడానికీ, ఆర్జించిన విజ్ఞానం వెదజల్లడానికి బ్రదికేవాడే బ్రాహ్మణుడైతే, దేశమంతా అట్టి బ్రాహ్మణులతో, నైతికాధ్యాత్మిక పరాకాష్ఠనంది సౌజన్య మూర్తులయిన స్త్రీ పురుషులతో నిండి ఉన్నప్పుడు అట్టి దేశం నియమాలకూ, చట్టాలకూ అతీతం కావడంలో ఆశ్చర్య మేమున్నది? అట్టి దేశాన్ని పాలించడానికి పోలీసులూ, సైన్యాలూ ఎందుకు? అట్టి ఉత్తములను పాలించవలసిన అవసర మేముంటుంది? వాళ్లొకరి ప్రభుత్వంలో ఉండవలసిన అవసర మేమిటి? తమ్ము తాము అదుపులో పెట్టుకుని సర్వజ్ఞులైన మహాత్ములు వాళ్ళు! భగవంతుని ప్రతినిధులు! మన కాదర్శమైన బ్రాహ్మణులు! సత్యయుగంలో ఒకే వర్ణ మున్నదనీ, అది బ్రాహ్మణ వర్ణమనీ మన గ్రంథాల్లో ఉన్నది.

## సత్యయుగంలో వర్ణాలు లేవు - అందరూ బ్రాహ్మణులే!

ప్రపంచంలో మొదట్లో అందరూ బ్రాహ్మణులే ననీ, తరువాత తరువాత ధర్మచ్యుతివల్ల వివిధ వర్ణాలుగా మానవులు విభక్తమైనారనీ మహాభారతం మనకు తెలియజేస్తోంది.

న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్
బ్రహ్మణా పూర్వ సృష్టంహి కర్మభి ర్వర్ణతాం గతమ్ ॥

(మహా. భా. శాంతి)

చక్రభ్రమణం పూర్తి అయి మళ్ళీ మొదటికి వచ్చేసరికీ అందరూ ఆరంభంలోని బ్రాహ్మణత్వాన్ని పొందుతారు. ఇప్పుడా చక్రం పరిభ్రమిస్తోంది. మీ రీ సత్యాన్ని గమనించండి.

అందుచేత వర్ణవిభేద సమస్యకు మన మవలంబించవలసిన పరిష్కారమార్గం ఇప్పటికే ఉన్నత స్థానంలో ఉన్నవాళ్ళను క్రిందికి దిగలాగడమూ కాదు; సహభోజనం వెంట వెఱ్ఱెత్తి పరుగులెత్తడమూ కాదు, అధిక భోగాలకై హద్దుల నతిక్రమిస్తూ నియమాల నుల్లంఘించడమూ కాదు. మనలో ప్రతి ఒక్కరూ వేదవిధులను సక్రమంగా పాటిస్తూ ఆధ్యాత్మికాభ్యుదయం పొంది ఆదర్శమైన బ్రాహ్మణత్వాన్ని అందుకున్ననాడే ఆ సమస్య పరిష్కార మవుతుంది.

## ప్రతి ఒక్కడూ ఆదర్శ బ్రాహ్మణుడు కావాలి

ఈ దేశంలో ఉన్న ఆర్యులనూ, అనార్యులనూ, ఋషులనూ, బ్రాహ్మణులనూ, హీన కులజులనూ, బహిష్కృతులనూ అందరినీ బద్ధులను చేసే ప్రాచీనుల శాసనం ఒకటి ఉన్నది. అలసతతో ఆగకుండా ప్రతివాడూ ప్రగతిపథంలో పురోగమించవలెనని ఆజ్ఞాపించేదే ఆ శాసనం. ఉచ్చ నీచ భేదంతో నిమిత్తంలేకుండా ప్రతివాడూ ప్రయత్నించి ఆదర్శ

బ్రాహ్మణుడుకావాలి. ఈ వేదాంత లక్ష్యం ఈ దేశంలోనివారికే కాదు; సర్వ ప్రపంచ మానవులకూ వర్తిస్తుంది.

మానవ సమాజాన్నంతటినీ నెమ్మది నెమ్మదిగా క్రమ క్రమంగా అత్యుత్తమ స్థాయికి తీసుకునిపోయి ధైర్య, గాంభీర్య, పావిత్ర్యాలతో ప్రకృతిని జయించి పూజాపరులై తపస్సమాధిమగ్నులయే ఆధ్యాత్మిక మానవులనుగా మార్చాలన్న లక్ష్యం కలిగినదే మన వర్ణ వ్యవస్థ: ఆ లక్ష్యంలో భగవంతు డున్నాడు.

## విజాతీయ సంస్కర్తలు

హిందూజాతిని పునరుజ్జీవనం పొందించే దృష్టితో మన మతాన్ని సంస్కరించి అంతా తలక్రిందులు చెయ్యాలనే సంస్కర్తలు కొందరు మనలోనే బయలుదేరారు. వాళ్ళల్లో కొందరు ఆలోచనాపరు లున్నా చాలామంది తామేంచేస్తున్నారో తమకే తెలియకుండా ఇతరులను గుడ్డిగా అనుసరించే మూర్ఖులు. ఈ రకం సంస్కర్తలు మన మతంలోకి విజాతీయ భావాలను తీసుకురావాలని ఎంతో తహతహలాడుతున్నారు. వాళ్ళకు విగ్రహారాధన ఒక నెపంగా దొరికింది. దాంతో విగ్రహారాధనను అనుమతిస్తోంది కాబట్టి హిందూమతం మతమేకాదని పట్టుదలతో నిశ్చయిస్తున్నారు. అసలీ విగ్రహారాధన తత్త్వమేమిటి? ఇది మంచిదా చెడ్డదా అన్న ఆలోచన చేసిన పాపాన వాళ్ళు పోలేదు. విజాతీయుల మాటలను పట్టుకుని హిందూమతాన్ని కాదని గొంతెత్తి చెప్పడానికి సాహసిస్తున్నారు.

విగ్రహారాధన తప్పనడం సర్వసామాన్యమై పోయింది. ఎందుకు తప్పని ప్రశ్న అయినా వెయ్యకుండా అందరూ దాన్ని అంగీకరిస్తున్నారు. నేనూ ఒకప్పుడు అలాగే అనుకున్నాను. దానికి తీవ్రమైన ప్రాయశ్చిత్తమా అన్నట్లు విగ్రహాలమూలంగానే సమస్తమూ సాధించిన మహానుభావుని చరణ

సన్నిధిలో నా పాఠం నేను నేర్చుకోవలసి వచ్చింది. శ్రీ రామకృష్ణ పరమ హంసల నుద్దేశించి ఈ మాట లంటున్నాను.

విగ్రహాల నారాధించడంవల్ల శ్రీ రామకృష్ణ పరమహంసలే ఉద్భవించే టట్లయితే మనమేం కోరుకోవాలి? సంస్కర్తల సిద్ధాంతాన్నా, విగ్రహాలనా? సమాధానం చెప్పండి. విగ్రహారాధనతో శ్రీ రామకృష్ణ పరమహంస లావిర్భ వించేటప్పుడు మరో వెయ్యి విగ్రహాలు స్వీకరించి మరింత వేగంగా పురోగమిద్దాము. ఏమార్గంలోనైనా అటువంటి మహాత్ములు రూపొందడమే మనకు కావలసింది.

అయినా విగ్రహారాధన దూషింపబడుతూనే ఉన్నది. కారణం? ఎవ్వరికీ తెలియదు. కొన్నివందల సంవత్సరాల వెనక ఒకానొక యూదు జాతీయుడు దాన్ని కాదనడం తటస్థించింది. అంటే అతగాడు తనకు ధ్యేయమైన విగ్రహంతప్ప తక్కినవన్నీ కాదన్నాడు. దేవునికి ఏ సుందర రూపం కల్పించినా, ఏ సంకేతం పెట్టినా అది చాలా తప్పనీ, మహాపాపమనీ బోధించాడా పెద్దమనిషి. కాని ఆ దేవునకే ఇద్దరు రెక్కలున్న దేవదూతలు అటూఇటూ కూర్చున్న ఒక పెట్టె ఉండి, పైన ఒక మేఘం ఎగురుతున్నట్లు రూపకల్పనచేస్తే అది పవిత్రాల్లో పవిత్రమట! దేవుడు పావురంగా, గోవుగా వస్తే అపవిత్రమూ, మూఢవిశ్వాసమూ – ఛీ ఛీ పనికిరాదు. ఇలా నడుస్తోంది లోకం!

## ఉత్తమ సంస్కర్తలు పూర్వమనేకు లున్నారు

భారతదేశం సంస్కర్తల కరువుతో ఎన్నడూ బాధపడలేదు. చరిత్ర చదివితే తెలుస్తుంది. రామానుజు లెవరు? శంకరు లెవరు? గురు నానక్ ఎవరు? చైతన్యు లెవరు? కబీరు, దాదూ లెవరు? ఒకరి తరువాత ఒకరుగా దేశమంతా వెలుగుతో నింపే తేజోమండలాల్లా వచ్చి జాతి నుత్తేజపరచిన ఈ మహా బోధకు లందరూ ఎవరు?

హీనకులజుల దుస్థితి తొలగించాలని రామానుజులు పరితపించ లేదా? అస్పృశ్యులను గూడా తన సంఘంలో చేర్చుకోవాలని యావజ్జీవితమూ ఆయన ప్రయత్నించ లేదా? మహమ్మదీయులను గూడా తన సంఘంలో కలుపుకోవాలని యత్నించ లేదా? హిందువులనూ మహమ్మదీయులనూ సంప్రదించి నూతన వాతావరణం సృష్టించాలని నానక్ ప్రయత్నించలేదా? ఆ మహానుభావు లందరూ జాతిని ఉద్ధరించాలని ప్రయత్నించారు. వాళ్ళ కృషి ఇప్పటికీ సాగుతూనే ఉన్నది. వాళ్ళకూ ఇప్పటి వాళ్ళకూ ఉన్నభేదం ఇది. ఆధునిక సంస్కర్తలవలె వాళ్ళు మూర్ఖప్రలాపాలు చెయ్యలేదు. వాళ్ళు ఎవరినైనా ఆశీర్వదించారే గాని వీళ్ళవలె శాపనార్థాలు పెట్టలేదు.

## అనంతమైన సానుభూతీ, ఓర్పూ ఉన్న సంస్కర్తలు

ప్రపంచాన్ని సంస్కరించడానికి యత్నించిన మహానుభావు లందరూ తాము లోకాన్ని పరిపూర్ణం చెయ్యడానికి తప్ప వినాశం చెయ్యడానికి రాలేదని స్పష్టంగా ప్రకటించారు. ఈ విషయం మనం ముందు జ్ఞప్తి కుంచుకోవాలి. దీన్ని సరిగా అర్థంచేసుకోక ఆ మహానుభావుల ఓర్పును, ఉన్న ప్రజాభిప్రాయంతో అనుచితమైన లాలూచీగా దుర్వ్యాఖ్యానం చేస్తూ వచ్చింది లోకం. ఇప్పటికీ అక్కడక్కడ ఈ ప్రవక్తలూ, జగద్గురువులూ తాము నమ్మిన సత్యాన్ని ప్రకటించడానికి జంకారనే విమర్శలు వినిపిస్తూనే ఉంటాయి కాని అది ఎంతమాత్రమూ యథార్థం కాదు.

సర్వజీవ సంతతినీ తమ కన్నబిడ్డలుగా భావించే ఆ మహాత్ముల హృదయాలలోని అనంత ప్రేమ శక్తి వట్టి ఆవేశపరుల కర్థంకాదు. వారు దైవతుల్యులైన పితృమూర్తులు కాబట్టి అందరి యెడలా సానుభూతీ, ఓర్పూ కలిగి అవసరమైనప్పుడు సహనాన్నీ, నిగ్రహాన్నీ ప్రదర్శించేవారు. మానవ సమాజం నెమ్మది నెమ్మదిగా క్రమక్రమంగా

ఎలా పెరగాలో వాళ్ళకు తెలుసును కాబట్టి ప్రజలను నిందించడమూ, భయపెట్టడమూ ఎన్నడూ చెయ్యక తమకు తోచిన అభ్యుదయ సాధనాలను పదే పదే ఓపికతో ఉపయోగిస్తూ మెట్టుపై మెట్టెక్కి ఔన్నత్యం పొందడానికి సహాయపడేవారు.

మన ఉపనిషద్ద్రష్టలు అటువంటివారు. పూర్వం దేవుణ్నిగూర్చి సంఘానికున్న అభిప్రాయాలు ఇప్పుడావిష్కృతమైన తాత్త్విక సిద్ధాంతాలతో ఎలా సమన్వయించవో వాళ్ళకు తెలుసు. నాస్తికుల ప్రవచనాల్లో ఎంతో సత్యం ఉన్నదనీ వాళ్ళు ఎరుగుదురు. అయినా వాళ్ళకు సూత్రం తెంపి పూసలదండ కట్టబూనడమూ, నిరాధారమైన బయలులో కొత్త సంఘాన్ని నిర్మించబూనడమూ వ్యర్థప్రయత్నాలన్న సంగతి కూడా తెలుసు.

మనం చోట్లు మారుస్తామేగాని కొత్తగా నిర్మించము. పదార్థసంచయంలో మార్పు చెయ్యగలమేగాని ఏ కొత్తదాన్నీ సృష్టించలేము. బీజం నెమ్మదినెమ్మదిగా పెరిగి చెట్టవుతుంది. మన శక్తిసామర్థ్యాలను సత్యాని కభిముఖంగా నడిపి ఉన్నసత్యం పరిపూర్ణంగా ఆవిష్కృత మయ్యేటట్లు చెయ్యాలేగాని కొత్తసత్యాన్ని కల్పించడానికి యత్నించగూడదు.

తత్వజ్ఞులైన ప్రాచీన మహర్షులు ఈ కారణంచేతనే పూర్వమున్న భిన్నదేవతా భావనను నిరసించక అందులోని యాథార్థ్యాన్ని గ్రహించడానికి కృషిచేశారు. దాని ఫలితమే వేదాంతతత్త్వం: పూర్వపు దేవతా బాహుళ్యంలో నుండి, ఏకేశ్వర సిద్ధాంతంనుండి, విశ్వప్రభు భావననుండి అంతకంటే ఉత్తమమై అత్యున్నతమైన కైవల్యభావనను పొందగలిగారు. నానాత్వం తోడి విశ్వంలో వారి కేకత్వమే గోచరించింది.

సంస్కరణ మంటే కూలద్రోయ్యడం కాదు
చక్కబరచడం

విగ్రహారాధనను దూషిస్తూ దానికి వ్యతిరేకంగా ప్రచారంచేసే సంస్కర్తలకు నే నొక మాట చెప్తాను. 'సోదరులారా ! బాహ్యసహాయంతో నిమిత్తం లేకుండా నిరాకారుడైన ఈశ్వరుణ్ని పూజించే యోగ్యత మీ కున్నట్లయితే మీ రలాగే చెయ్యండి. అంతేకాని మీఅంత యోగ్యతలేని సామాన్యులైన చేతకానివాళ్ళను ఎందుకు నిందిస్తారు?'

ఒక పెద్ద అందమైన మహాసౌధం — ప్రాచీనుల మహోజ్జ్వల వైభవానికి చిహ్నమైనది - ఉపేక్షచేతనో, ఉపయోగించకపోవడం చేతనో ఈపూట సిధిలావస్థలో కనిపిస్తోంది. ఎక్కడచూచినా దుమ్మూ, ధూళీ కుప్పలు కుప్పలుగా పడిఉన్నది. కొన్నికొన్ని భాగాలు కాలపుధాటి కాగలేక కూలిపోతున్నాయి గూడాను. ఆ సౌధాన్ని మన మేం చెయ్యాలి ! దుమ్మూ ధూళీ తుడిచి శిథిలభాగాలు బాగుచేసి యథాస్థితికి తేవాలా లేక బాగున్నదాన్ని గూడా పడగొట్టి ఎన్నాళ్లు నిలుస్తాయో తెలియని మిడిమిడిజ్ఞానంతోడి నూతన ప్రణాళికల ననుసరించి కొత్తసౌధం కట్టాలా? ఏం చెయ్యాలి ? ఉన్నదాన్ని మనం సంస్కరించుకోవాలి. అంటే తుడిచి శుభ్రంచేసి అవసర మైన మరమ్మతులుచేసి మళ్ళీ ఉపయోగపడేటట్లు చేసుకోవాలేగాని ఉన్న దంతా కూలద్రొయ్యగూడదు. సంస్కరణ కార్యక్రమం చక్కబరచడంతో ఆగిపోవాలి.

సంస్కరణమే లక్ష్యంగా పెట్టుకున్న ఏ సంస్కరణ సంఘమూ బ్రతకదు. బ్రతకడానికి సజీవమైన సిద్ధాంతా లుండాలి. ఒక సంస్కరణం సాధించిన తర్వాత పెరిగే సజీవ సిద్ధాంతం ప్రాముఖ్యం వహించాలి. సౌధ నిర్మాణం పూర్తిఅయ్యాక పరంజాలూ, మూసకట్లూ తీసి వెయ్యాలి.

మునగడమో తరించడమో కలిసేచేద్దాము;
హిందూమతాన్ని విడవడ మెందుకు ?

ఈ దేశంలో ఇప్పుడున్న సంస్కర్తలు ఉన్నదాన్ని బాగుచేసుకునే విజ్ఞత లేక కొత్తవాటిని నిర్మించాలని వాంఛిస్తున్నారు. కొంతవరకు వాళ్ళు మంచినే చేశారు. ఈశ్వరాశీర్వాదం వారికి లభించును గాక! కాని మీరు హిందువులు గదా! హిందూ సంఘంనుండి విడిపోవాలని ఎందుకు కోరుకుంటున్నారు ? మీ కున్నవాటన్నింటిలోనూ ఉత్తమమూ ఉజ్జ్వలమూ అయిన హైందవత్వాన్ని కాదంటూ హిందువని చెప్పుకోవడానికి గూడా సిగ్గుపడతా రెందుకు ?

సోదర దేశీయులారా! అమర్త్యుల బిడ్డలారా!

పరమోత్తమ నాగరకతను వహించి అమూల్యములైన దివ్య భావ నిధానాలతో ప్రపంచాన్ని ధన్య మొనరుస్తూ మన జాతీయ మహానావ విశ్వజీవన సాగరంలో యుగయుగాలుగా ప్రయాణం చేస్తోంది. ఈ మన జాతీయనౌక జీవన సముద్రంలో సుఖప్రయాణం చేస్తూ కొన్ని వందల శతాబ్దాలపాటు కోటానుకోట్ల జీవుల నెక్కించుకుని సర్వదుఃఖాలకూ అతీతమైన అవ్వలితీరానికి సురక్షితంగా చేర్చింది. ఈ రోజున ఆ నౌక అందులో ఎక్కి ఉన్న మీ దోషం మూలంగానే చిన్నచిన్న బెజ్జాలు పడి పాడయింది. ఆ నౌకపై ప్రయాణం చేస్తున్న మీ రిప్పుడు చెయ్యవలసిం దేమిటి ? మీలో మీరు పోట్లాడుకుంటూ నౌకను నిందిస్తూ అటూ ఇటూ పరుగెత్తుతారా ? అందరూ ఏకమై బెజ్జాలు పూడ్చి బాగుచేసుకోవడానికి సర్వ ప్రయత్నాలూ చెయ్యరూ ? రండి, రండి; మనరక్తాలు ధారవోసి దాన్ని బాగుచేసుకుందాము. మన ప్రయత్నాలు విఫలమవుతాయా; శాపనార్థాలతో కాక ఆశీర్వాదాలతో అందరమూ కలిసే మునిగి చచ్చిపోదాము.

## దోషాలు దీర్ఘకాల రుగ్మతల వంటివి

మన సంఘంలో దోషాలు ఎన్నో ఉన్నాయి. అలాగే ఇతర సంఘాల్లోనూ ఉన్నాయి, ఇక్కడ ఒక్కొక్కప్పుడు విధవల కన్నీళ్ళతో భూమి తడుస్తూ ఉంటుంది; అక్కడ పశ్చిమ దేశాల్లో అవివాహితల నిట్టూర్పు గాడ్పులతో వాతావరణం వేడెక్కుతూ ఉంటుంది. ఇక్కడ దారిద్ర్యం ప్రాణాలను కొరికివేస్తోంది; అక్కడ భోగబాహుళ్యం జాతీయ జీవితాన్ని విషమయం చేస్తోంది. ఇక్కడ తినడానికి తిండిలేదని మనుష్యులాత్మహత్య చేసుకుంటారు; అక్కడ సమృద్ధిగా ఉందికాబట్టే మన స్తృప్తి లేక ఆత్మహత్య చేసుకుంటారు.

దోషం సర్వేసర్వత్రా ఉన్నది. అది దీర్ఘకాల రుగ్మత. ఒకరకంగా కీళ్ళవాతం వంటిది. కాలికి చికిత్సచేస్తే వేలికీ, కుడిపక్కచేస్తే ఎడంపక్కకూ, ఎక్కడో ఒకచోట వస్తూనే ఉంటుంది. ఒకచోటనుంచి మరొకచోటుకు తరమడం జరుగుతుంది. అంతే! అంతకుమించి ప్రయోజనం ఉండదు. పూర్తిగా పోదు. అందుచేత దోషనిర్మూలన ప్రయత్నం సరిఅయిన మార్గం కాదు. మంచిచెడ్డలు రెండూ ఎప్పుడూ కలిసేఉంటాయనీ, అవి వెలుగు నీడలవలె విడదియ్యడానికి వీలులేనివనీ మనవేదాంతం మనకు బోధిస్తోంది. ఒకటి కావాలంటే రెండోదాన్నికూడా మనం భరించకతప్పదు. సముద్రంలో ఒకచోట ఎత్తైన తరంగంలేస్తే మరొకచోట గుంట ఏర్పడక తప్పదు. అసలు జీవితమే దోషభూయిష్ఠం. జీవహింస జరగకుండా ఊపిరి పీల్చుకోవడానికి వీలులేదు. ఎవరికో ఒకరికి లేకుండా చేస్తేనేగాని అన్నంముద్ద నోటికిరాదు. ఇది ప్రకృతి నియమం - సృష్టి తత్త్వం. ఈ సత్యాన్నే వేదాంతం బోధిస్తోంది.

కాబట్టి మనం చెయ్యగలిగిందల్లా ఈ దోషనిర్మూలన ప్రయత్నం అధికంగా వ్యక్త్యాశ్రయమనీ ఎవరికివారు తంటాలుపడితే ఫలించవలసిందే గాని ఇతరులవల్ల అయ్యేదికాదనీ గ్రహించటమే. మన మెన్ని ప్రగల్భాలు

పలికినా వాస్తవంగా దోషనిర్మూలనం సాధ్యంకాదు. విద్య ద్వారా యుక్తా యుక్త విచక్షణజ్ఞానం కలిగినజాతి అల్పదోషయుక్తమైన ప్రవర్తన కలిగి ఉంటుంది. అందుచేత దోషాలకు ప్రతిక్రియగా మొట్టమొదట మనం సంఘాన్ని విద్యావంతం చెయ్యాలి. ఆపని చెయ్యాలంటే ప్రశాంతులం కావాలి. తొందరపాటూ ఆవేశమూ తొలగిపోవాలి.

## ఆవేశంతో తెచ్చిన సంస్కరణలు స్వీయలక్ష్యాన్నే భగ్నంచేస్తాయి!

ఆవేశంతో సంస్కరణలు ఎక్కడజరిగినా వాటిలక్ష్యాలే భగ్నమైనట్లు ప్రపంచ చరిత్ర మనకు నిరూపిస్తోంది. అమెరికాలో బానిసతనాన్ని నిర్మూలించడానికి జరిగిన యుద్ధంకంటె మానవ హక్కులనూ, స్వాతంత్ర్యాన్నీ స్థాపించడానికి చెలరేగిన తీవ్ర సాంఘికవిప్లవం మరొకటి ఉండదుకదా! దాని సంగతి మీ కందరకూ తెలుసు. కాని దాని ఫలితం ఏమైంది? బానిస తనాన్ని నిర్మూలించే శాసనం రాకముందటికంటె వచ్చినతర్వాత అక్కడి బానిసలు ఈ రోజున గూడా నూరింతల దుర్భర పరిస్థితులలో ఉన్నారు.

నిర్మూలన శాసనం రాకముందు పాప మా నీగ్రోలు ఎవరి ఆస్తి గానో ఉండి తక్కిన ఆస్తులవలెనే వినాశం పొందకుండా రక్షింపబడేవారు. ఇప్పుడు వాళ్ళు ఎవరి ఆస్తీ కాదు. అందుచేత వాళ్ళ ప్రాణాలకు విలువ లేదు. ఏదో వంకపెట్టి సజీవంగా వాళ్ళను కాల్చివేస్తున్నారు. చెట్లకు తలక్రిందులుగా వ్రేలాడగట్టి నిలువునా మంటలుపెట్టి కాల్చి తోళ్ళు వొలిచినా, తుపాకులతో కాల్చి చంపినా వాళ్ళను హత్యచేసినవాళ్ళను శిక్షించే శాసనమే లేదు. ఎందుచేతనంటే వాళ్లు బానిసలు. మనుష్యులు కాను సరిగదా జంతువులు కూడా కారు. తీవ్రావేశంతో అకస్మాత్తుగా శాసనాలు చేసి దోషాన్ని నిర్మూలిద్దామని ప్రయత్నిస్తే వచ్చిన ఫలిత మిది.

మూర్తిమద్దైవభావనను బుద్ధుడు పదే పదే తీవ్రంగా ఖండించి నందువల్లనే భారతదేశంలో విగ్రహారాధన ప్రవేశించింది. వేదాల్లో దేవతా మూర్తి భావన కనిపించదు, భగవంతుణ్ని సృష్టికర్తగానూ స్నేహితుణ్ని గానూ అర్చించే అవకాశం బుద్ధుని బోధలవల్ల పోయేటప్పటికి గొప్ప గొప్ప గురువుల విగ్రహాలను పూజించడం మొదలుపెట్టారు. చివరకు బుద్ధుడే విగ్రహమై కోట్లకొలది జనులచే పూజింపబడ్డాడు. సంస్కరణకై జరిగే తీవ్ర ప్రయత్నాలు ఇటువంటి విపరీత పరిణామాలనే పొందుతూ ఉంటాయి.

మంచి పనుల కయినా సరే ఆవేశంతో కూడిన ఉద్యమాలు పనికిరావని చరిత్ర చూపిస్తున్న సాక్ష్య మిది :

## సంస్కరణలు వాంఛించే జను లేరీ ?

మన మాలోచించవలసిన ముఖ్య విషయం మరొక టున్నది. భారతదేశంలో సామాన్య జనానికి తమ్ము తాము ఆవిష్కరించుకునే అవకాశం ఎన్నడూ లభించలేదు? కడచిన రెండు మూడు శతాబ్దాలుగా పశ్చిమ జాతులు త్వరితగమనంతో స్వాతంత్ర్యాభిముఖంగా ప్రయాణం చేస్తున్నాయి. భారతదేశంలో మొదటినుంచీ రాజులే సర్వమూ నిర్ణయిస్తూ ఉండేవారు. పాశ్చాత్య దేశాల్లో ప్రజలు తమకు తాముగానే అన్నిపనులూ చేస్తారు.

భారతప్రజలకు ఆత్మవిశ్వాసమే కొరవడి ఉన్నప్పుడు తమ మీదే తాము ఆధారపడే ధైర్యం ఎలా వస్తుంది? వేదాంతానికి మూలమైన ఆత్మయందలి విశ్వాసం ప్రజాసామాన్యంలోకి కొంచెంగానైనా ప్రవేశించ లేదు.

అందుచేత సంఘ సంస్కార సమస్య యావత్తూ సంస్కారాన్ని వాంఛించే జను లెక్కడున్నారన్న ప్రశ్నలోకి పర్యవసిస్తుంది. ముందు

జనసామాన్యాన్ని సంస్కారాన్ని వాంఛించే వాళ్ళనుగా చెయ్యాలి. తల ఉంటే గదా తలనొప్పి కవకాశం?

## దేశం తమోమగ్నమై ఉన్నది

ప్రపంచ పర్యటనం చేసిన అనుభవం మీద ఇతర దేశాల ప్రజలతో పోల్చిచూస్తే ఈ దేశంలోని ప్రజలు తమోముద్రితులై ఉన్నారని స్పష్టమవుతోంది. పైకది సాత్త్వికమన్న భ్రాంతి కల్పించవచ్చునుగాని ఆంతర్యంలో అది రాయీ రప్పల వంటి జడత్వమే. ఎంత తరిచి చూచినా మరొకటి కాదు. అటువంటి ప్రజలు ప్రపంచంలో ఏమి సాధించగలరు?

ఇంత సోమరితనంతో, ఇంద్రియ వశులై, జడులై పడిఉండే ప్రజలు ఎన్నాళ్ళు బ్రదకగలరు? మొదట పశ్చిమ దేశాల్లో పర్యటించి వచ్చి తర్వాత వీలయితే నా మాటలు కాదనండి. ఆ దేశాల ప్రజల్లో కష్టపడి పని చెయ్యడంలో ఎంతశ్రద్ధా, ఎంత ఉత్సాహమూ కనిపిస్తుందో ఆశ్చర్యం వేస్తుంది. వాళ్ళల్లో రజోగుణం సమృద్ధిగా ఉన్నది. ఈ దేశంలోచూస్తే గుండెల్లో నెత్తురు గడ్డకట్టుకుపోయి నరాల్లో ప్రవహించడం మానివేసినట్లు, పక్షవాతంతో శరీరాలు ముద్దలై పోయినట్లు ఎక్కడివాళ్ళక్కడ పడి ఉంటున్నారు.

## రజస్సును పెంచుకుని తమస్సు నణచాలి.

ఈనాడు భారత జాతిలో రాజసం బొత్తిగా లుప్తమై పోయింది. పాశ్చాత్యుల్లో సత్త్వం బొత్తిగా లేదు. అందుచేత పశ్చిమజాతుల జీవితం పరిపూర్ణం కావడం భారతదేశంనుండి సాత్త్వికభావాలు ప్రవహించడం మీద ఆధారపడి ఉంటుంది. అలాగే మనం రజోగుణాన్ని పెంపొందించుకుని తమస్సు నణచివేస్తేనేగాని ఈ జీవితంలో క్షేమమూ ఉండదు, ప్రపంచంలో ఏ మంచినీ సాధించలేము. రజస్సు పెరగనినాడు ఆధ్యాత్మి

కాదర్శాలను అందుకునే ప్రయత్నంలో కూడా ఎన్నో అవరోధాలను ఎదు ర్కొనక తప్పదు.

సర్వసంగపరిత్యాగంకంటె శాంతిప్రదాత మరొకటి లేదు. శాశ్వత శ్రేయస్సుతో పోలిస్తే ప్రాపంచిక శ్రేయస్సు ఎందుకూ పనికిరాదు. ఈ విషయాల్లో సందేహంలేదు. సత్త్వగుణంకంటె శక్తినిచ్చే దేమీ లేదు. ఆత్మ జ్ఞానంతో పోలిస్తే ఇతర విజ్ఞానాలన్నీ అజ్ఞానంతో సమానమే నిజమేకాని ఆ సత్త్వగుణాన్ని సాధించగలిగిన అదృష్టవంతు లీ ప్రపంచంలో ఎంతమంది ఉన్నారు? ఈ భారతదేశంలో ఎందరున్నారు? అహంకార మమకార విరహితులై సర్వసంగపరిత్యాగం చెయ్యగలిగిన ధీరు లెంతమంది ఉన్నారు?

భౌతికసుఖాల నన్నింటినీ మిధ్యల్లో మిధ్యలుగా కనిపింపజేసే జ్ఞాన దృష్టిగల మహానుభావు లెంతమంది ఉన్నారు? సచ్చిదానందమయమైన దివ్యతేజాన్ని భావన చెయ్యడంలో తన శరీరాన్నే తాను మరిచిపోయే విశాలహృదయు డెక్కడ ఉన్నాడు? భారతదేశంలోని అసంఖ్యాక ప్రజా నీకంలో అటువంటివాళ్లు ఒకరో ఇద్దరో ఉంటారు. ఆ ఒక రిద్దరి ముక్తి కోసమూ తక్కిన కోట్లకొలది భారతీయ స్త్రీ పురుషులందరూ ప్రస్తుత పరిస్థితులలో అణగారి పోవలసిందేనా?

అలా జరగనిస్తే వచ్చే మంచి ఏమిటి?

సర్వసంగపరిత్యాగంలోని మహాత్మ్యాన్ని పసివాడికి మనం బోధించ లేము. వాడు పుట్టుకతోనే ఆశావాది. వాడి జీవితం యావత్తూ ఇంద్రియాల్లోనే ఉంటుంది. ఇంద్రియ సుఖానుభవమే వాడి జీవిత సర్వస్వం. ప్రతి సంఘం లోనూ ఆ పసివాళ్ళవంటివారు ఎందరో ఉంటారు. వాళ్ళకు కొంత అనుభవమూ, సుఖానుభూతీ అవసరం. అది నిజమైన సుఖమో కాదో వాళ్ళే అనుభవించి తెలుసుకోవాలి; పరిత్యాగబుద్ధి క్రమక్రమంగా వాళ్ళకే వస్తుంది, మన ప్రాచీన గ్రంథాల్లో అటువంటివాళ్ళకోసం ఎన్నోవిషయాలు చెప్పారు.

తరువాత తరువాత దురదృష్టవశాత్తూ సన్న్యాసికీ సంసారికీ ఒకే రకం నియమాలు విధించడం ఆచారంలోకి వచ్చింది. అదే పెద్ద పొరపాటయి పోయింది. ఆ పొరపాటే జరిగి ఉండకపోతే ఈ దేశంలో ఇంత దారిద్ర్యానికీ ఇంత దుఃఖానికీ అవకాశమే ఉండేదికాదు.

## అధఃపతనానికి తమో మాఢ్యమే హేతువు

సత్త్వగుణావలంబన మన్న భ్రాంతితో దేశం నెమ్మది నెమ్మదిగా తమస్సముద్రంలో అజ్ఞానాంధకారంలో నిమగ్నమైపోవడం కనిపించడం లేదా? కాయిక మానసిక వ్యాపారాల కన్నింటికీ అవ్వలిదై అత్యుత్తమమైన బ్రహ్మజ్ఞానాన్ని పొందాలన్న అందని వాంఛతో పరమ మూర్ఖులు తమ అజ్ఞానాన్ని కప్పిపుచ్చాలని చూచే చోట, సోమరితనంలో పుట్టిపెరిగి ఏ పనీ చెయ్యలేని తమ అయోగ్యతను సర్వసంగపరిత్యాగపు ముసుగులో దాచిపెట్టే దౌర్భాగ్యులున్నచోట మతానికి చెందిన దీక్షల పేరుతో క్రౌర్యాన్ని కప్పి పుచ్చే రాక్షసు లున్నచోట, తన అసమర్థతను ఏ కొంచెమూ గుర్తించక ప్రతివాడూ ఇతరులను నిందించేచోట, స్వబుద్ధి నుపయోగించక చిలక పలుకులు పలకడమే విజ్ఞానమైనచోట, ప్రాచీనులపేరు చెప్పుకుని బ్రతకడమే. గొప్పతనమైనచోట దేశమంతా తమస్సులో కూరుకు పోయిందని చెప్పడానికి వేరే నిదర్శనం కావలసిన అవసర మే మున్నది?

అందుచేత శుద్ధ సత్త్వం అంటే పరిశుద్ధమైన మనస్స్వచ్ఛత మన కెన్నో ఆమడల దూరాన ఉన్నది. కేవలం పరిపూర్ణమైన పరమహంస స్థితిని పొందే యోగ్యత ప్రస్తుతానికి లేకపోయినా ఎప్పటికో వస్తుందని ఆశించేవాళ్లు రజస్సును పెంపొందించుకోవడం ఎంతైనా ప్రయోజనకారి. రజస్సు నతిక్రమించకుండా తమస్సులోనుండి సరాసరి శుద్ధ సాత్త్విక స్థితిని ఎవరైనా అందుకోగలరా? భోగతృష్ణ నివారితం కానప్పుడు

భగవంతునితో యోగాన్ని ఎలా ఆశించగలం? సుఖానుభూతి లాలస తొలగి వైరాగ్యం సిద్ధించందే సర్వసంగపరిత్యాగులు ఎలా అవుతారు?

అసలైన జాతి గుడిసెల్లో నివసిస్తోంది

గత శతాబ్దినుండీ మనదేశంలో జరుగుతున్న సంస్కరణలన్నీ పైపై మెరుపులు మాత్రమే. ప్రతి సంస్కరణాపై రెండు తరగతుల వారినే స్పృశిస్తోంది. విధవా వివాహ సమస్య భారతీయ స్త్రీలలో నూటికి దెబ్భైమందికి లేనేలేదు. వాళ్ళకు మారుమనువు లుండనే ఉన్నాయి. తక్కువ స్థితిలో పడిఉన్న అధిక జనానీకం వ్యయంతో విద్యావంతులైన పై రెండు తరగతుల అల్పసంఖ్యాకులను బాగుచెయ్యడానికే సంస్కరణోద్యమాలన్నీ ప్రయత్నించాయి. సంస్కర్త లెంతసేపూ తమ ఇళ్ల తాము పరిశుభ్రం చేసుకోవడానికే సర్వ ప్రయత్నాలూ చేశారన్నమాట. జాతిని సంస్కరించడం ఇది కాదు. జాతి నిర్వీర్యమై పడి ఉండడానికి హేతువైన మూలాన్ని పట్టుకుని సంస్కారం అక్కడ చెయ్యాలి. వేరుకు పురుగుపట్టి చెట్టు పుల్ల విరుగుతోంది. ఆ పుల్ల లెన్నాళ్ళు విరుస్తున్నా చెట్టు పునరుజ్జీవితం కాదు. పురుగుపట్టిన వేరు తీసివెయ్యాలి. ఎరువువేసి నీళ్ల పెట్టాలి. అప్పుడు చెట్టు నవనవలాడుతూ పెరుగుతుంది. అది సరియయిన సంస్కార మని నా ఉద్దేశం. అట్టడుగునుంచి తేజోవంతమై భారతజాతి ప్రకాశించాలి.

విగ్రహాలు ఉన్నా లేకపోయినా ఒకటేకాబట్టి మన మతాన్ని అందు కోసం నిందించవలసిన అవసరం లేదు. ఉన్న దోషమంతా ఇక్కడ ఉన్నది :— ప్రధానమైన జాతి గుడిసెల్లో నివసిస్తోంది. వాళ్ళకు తాము మనుష్యులమనే తెలియదు. వ్యక్తిత్వంకోలుపోయి పశుప్రాయులై ఉన్న వాళ్ళందరినీ విద్యావంతులను చెయ్యాలి.

## పోయిన వ్యక్తిత్వాన్ని పునరుద్ధరించాలి

సామాన్యప్రజల మనస్సులను కదిలించి మంచిభావాలు అందించాలి. వాళ్ళ కళ్ళుతెరిచి చుట్టూ ప్రపంచంలో ఏం జరుగుతూందో చూపించాలి, అప్పుడు వాళ్ళంతటవాళ్ళే తమ ముక్తికై కృషి చేస్తారు. ప్రతి జాతీ, ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ ఎవరి ముక్తికి వాళ్ళే కృషిచేయాలి. మనం చెయ్యవలసింది సద్భావాలు అందించడమే. అదే వాళ్ళ కవసరమైన సహాయం. తర్వాత ఫలితం దానంతటదే వస్తుంది. రసాయన పదార్థాలను సమ్మేళనం చేయడమే మనవంతు. స్ఫటికీకరణం ప్రకృతి నియమాన్ననుసరించే జరుగుతుంది. అజ్ఞానాంధకారంలో పడిఉన్నవాళ్ళకు మంచి ఊహ అందించడమే మన విధి. తక్కిన పనిని ఆ ఊహాలే చేస్తాయి. వాళ్లే తమ్ము తాము ఉద్ధరించుకుంటారు. ఈనాడు భారతదేశంలో జరగవలసిన పని ఇది.

మీ ముందు ఈ ఆదర్శాన్ని పెట్టుకోండి. 'మతానికి హానిలేకుండా జనసామాన్యాన్ని ఉద్ధరించచడమే కర్తవ్యం !'

## జనసామాన్యాన్ని విద్యావంతం చెయ్యడమే పరిష్కారమార్గం !

సంఘంలో ఉన్నతస్థితిలో ఉన్నవాళ్ళకే పరిమితంకాక సామాన్య జనానికి గూడా విద్యాసంస్కృతులు అందడం ఆరంభించిన నాటినుంచే పాశ్చాత్యదేశాల ఆధునిక నాగరకతకూ ఈజిప్టు రోము భారతదేశాల ప్రాచీన నాగరికతకూ వైవిధ్యం విస్పష్టమవుతూ వచ్చింది, జాతి జనసామాన్యంలో విద్యావ్యాప్తి ఎక్కువయినకొద్దీ దాని అభివృద్ధి ఎక్కువవుతూ ఉంటుంది.

భారతదేశం అధఃపతనం చెందడానికి ప్రధానకారణం జాతిలో ఉన్నతస్థానంలో ఉన్న కొద్దిమందికే విద్యావకాశాలు ఉండి తక్కినవాళ్ళు అజ్ఞానాంధకారంలో పడిఉండడం కాబట్టి మళ్ళీ మనం అభ్యుదయాన్ని పొందాలంటే జనసామాన్యాన్ని విద్యావంతం చెయ్యడం ద్వారానే పొందాలి.

## విద్య ద్వారానే ఆత్మవిశ్వాసం కలుగుతుంది

మహమ్మదీయులు మనదేశానికి ఎంతమంది సైనికులను తెచ్చారు? ఇంగ్లీషువాళ్ళు ఎంతమంది వచ్చారు? నెలకు ఆరు రూపాయిల జీతానికి కన్నతండ్రినీ, తోబుట్టువునూ వధించడానికి సిద్ధపడే మనుష్యులు లక్షల కొలదిగా భారతదేశంలో తప్ప మరొకచోట ఎక్కడైనా లభ్యమవుతారా? ఏడువందల సంవత్సరాల మహమ్మదీయ పరిపాలనలో ఆరుకోట్లమంది మహమ్మదీయులు కావడమూ, వందయేళ్ళ క్రైస్తవ పాలనలో ఇరవై లక్షలమంది క్రైస్తవులు కావడమూ ఎందుచేత జరిగింది?

దేశంలో మౌలికమైన వ్యక్తిత్వం నామరూపాలు లేకుండా ఎందుచేత పోయింది? ఐరోపీయులతో పోటీ చెయ్యలేక మంచి పనితనం కలిగిన కర్మకుశలు అందరూ ఎందుకు నశించారు? కొన్ని శతాబ్దాల దృఢమైన పునాది ఉన్న ఇంగ్లీషు కార్మికుని కదిలించివేసి జర్మను కార్మికుడు ఏ శక్తిచేత కృతకృత్యుడు కాగలిగాడు?

విద్య, విద్య విద్య — ఇది లేకపోవడమూ, ఉండడమూ - ఇదే అన్నింటికీ కారణం. ఐరోపాలోని వివిధ పట్టణాల్లో సంచరిస్తూ అక్కడ జనసామాన్యం కూడా ఎంత విద్యావంతమై ఉన్నదో, ఎటువంటి సుఖాలు అనుభవిస్తున్నదో కళ్ళారా చూచి మనదేశంలో ప్రజల దీనస్థితి స్మృతికి వచ్చి కన్నీళ్ళు పెట్టుకున్నాను. ఈ భేదానికి కారణ మేమిటి? విద్యావిహీనతే అని నాకు తోచిన సమాధానం. విద్యవల్లనే ఎవ్వరికైనా ఆత్మవిశ్వాసం కలుగుతుంది.

మూడు వందల ముప్ఫయికోట్ల దేవతలలోనూ నమ్మకమున్నా, పరదేశీయుల ఆగమనం వల్ల కొత్తగా జాబితా కెక్కిన దేవత లందరిలోనూ నమ్మకమున్నా నీలో నీకు విశ్వాసం లేకపోతే నీకు ముక్తిలేదు. ఆత్మవిశ్వాసం పెంపొందించుకుని నీకాళ్ళమీద నీవు నిలబడి శక్తిమంతుడవు కా! ఇప్పుడు మనకు కావలసింది ఇదే!

దేశంలోని ప్రజలందరికీ ఆత్మ విశ్వాసమూ, క్రియా శూరత్వమూ రావాలి. ఈ అవసరం నాకు స్పష్టంగా కనిపిస్తోంది. ఈ ప్రయత్నంనుండి తప్పించుకోవడానికి వీలులేదు. ధీమంతులు కొంచెం ముందుచూపు సారిస్తే రాబోయే మూడు యుగాల దృశ్యాన్నీ చూడగలరు. శ్రీ రామకృష్ణ లవతరించడంతో ప్రాగ్దిశాకాశం ప్రాతస్సూర్య తేజస్సుతో వెలుగుతోంది. త్వరలోనే అది మధ్యాహ్న మార్తాండ తేజమై దేశమంతటినీ దేదీప్యమానం చెయ్యగలదు.



# పునరుజ్జీవన కార్యక్రమ రంగంలో దిగేవారికి కొన్ని సూచనలు

భారతదేశం అభ్యుదయాన్ని పొందేది కండబలంతో కాదు, ఆత్మ బలంతో! వినాశసూచకమైన రక్తపతాకంతో కాదు, శాంతి ప్రేమల చిహ్నమైన సన్న్యాసుల కాషాయ పతాకంతో!

ఆకలిదప్పులనూ, శీతోష్ణాలనూ లెక్కచెయ్యని దార్ఢ్యాన్ని ప్రసాదించే నీలోని దివ్యత్వాన్ని మేల్కొలుపు! అన్ని సౌకర్యాలూ ఉన్న ఇళ్ళల్లో సమస్త భోగాలూ అనుభవిస్తూ ఏ కొంచెమో ప్రాథమిక మత నియమాలను పాటిస్తే యితర దేశాలకు సరిపోతుందేమోకాని భారతదేశానికి ఎంతమాత్రమూ చాలదు. ఈ దేశానికి నిజమైన తాత్త్వికచింత ఉన్నది. అది సహజంగానే వేషాన్ని కనిపెట్టివేస్తుంది. దాన్ని విడిచిపెట్టక తప్పదు.

దేశాన్ని ఉద్ధరించదలిస్తే నిజంగా గొప్పవాడివికా! త్యాగానికి సిద్ధపడకపోతే ఏ మహాకార్యమూ సాధ్యంకాదు.

నీ సుఖాలు, నీ భోగాలు, నీ పేరుప్రతిష్ఠలు, నీ పదవీ, నీ అధికారం – కాదు నీ ప్రాణాలు అన్నీ ఒడ్డి కోటాను కోట్ల ప్రజలు జీవన మహా సాగరాన్ని తరించడానికై ఆత్మార్పణ చేసే నీబోటి మానవులతో కూడి, గొలుసుల వంతెన నిర్మించు. జాతికోసం పరితపించే త్యాగబుద్ధుల నందరినీ ఒక చోటికి చేర్చు. ఏ సంఘంపేరిట మనం పని

చేస్తున్నామని ఆలోచించకు. ఎవరిది ఏ రంగన్న సంగతి చూడకు. ఆకుపచ్చ, నీలం, ఎరుపు—అన్ని రంగులూ కలిసి ప్రేమకు చిహ్నమైన ఉజ్జ్వల శ్వేతవర్ణంగా మార్చివెయ్యి. మనవంతు కృషిచెయ్యడమే. ఫలితాలు వాటంతటవే వస్తాయి.

నేను భవిష్యత్తు నూహించడంలేదు. నా కా దృష్టి లేదు. నా కళ్ళముందు ఈ జీవితంతో తుల్యంగా ఒకే ఒక దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది. అనాదియైన మన దేశమాత మళ్ళీ నిద్రలేచింది. సింహాసనస్థయై ఎప్పటికంటె ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. శాంతిసందేశంతోనూ, శుభాకాంక్షలతోనూ ప్రపంచాని కామెను ప్రకటించండి.

నిజమైన సంస్కర్త నియతలక్షణాలు

మొదటిది: హృదయపూర్వకమైన ఆవేదన

నీవు నిజమైన సంస్కర్తవు కాదలిస్తే నీకు మూడు ముఖ్యమైన లక్షణా లుండాలి. వాటిల్లో మొదటిది ఆవేదన.

ముందు నీవు హృదయపూర్వకంగా ఆవేదన పడాలి. తెలివితేటలోనూ, తర్కంలోనూ ఏమున్నది? ఒకటి రెండడుగులు వేసి అక్కడితో ఆగిపోతుంది. అలా కాక హృదయంద్వారా దివ్యభావావేశం కలుగుతుంది. అందుచేత హృదయమే ముఖ్యం. హృదయంతోనే భగవంతుణ్ణి చూడగలం, బుద్ధితోగాదు. బుద్ధి మన మార్గాన్ని పరిశుభ్రంచేసే అప్రధాన సహాయకారి, రక్షకభటుడు. సాంఘిక కార్యకలాపాలు జరగడానికి రక్షక భటుడు ఉండితీరవలసిన అవసరంలేదు. అక్రమాలు జరిగితే నివారించడానికీ, జరగకుండా చెయ్యడానికీ వాడు ఉపయోగిస్తాడు. బుద్ధీ అంతే! పైగా బుద్ధి నిజానికి గ్రుడ్డిది. దానంత టది కదలలేదు, దానికి కాళ్లూ చేతులూలేవు. విద్యుచ్ఛక్తి మొదలైన శక్తులకంటె ఎన్నోరెట్లు వేగంతో

కదిలే ఆవేదనే అసలు పని చేస్తుంది. నీకా ఆవేదన ఉన్నదా? అదీ ప్రశ్న.

బుద్ధి ఆవశ్యకమే — అది లేకపోతే ఘోరమైన దోషాలూ, పెద్ద పెద్ద పొరపాట్లూ జరిగిపోతాయి. బుద్ధి వీటిని అరికట్టుతుంది. అంతే! అంతకుమించి దానిమీద మనమేమీ ఆశ పెట్టుకోగూడదు. అది అచేతనమూ, అప్రధాన సహాయకారీ. నిజంగా సహాయం చేసేది ప్రేమతోడి ఆవేదనే!

## దుర్భేద్య ప్రతిబంధకాలను గూడా ప్రేమ విఘటితం చేస్తుంది.

ఎటువంటి దుర్భేద్యమైన ప్రతిబంధకాలనైనా ప్రేమ విఘటితం చేస్తుంది. సర్వజగద్రహస్యాలకూ ప్రేమయే ప్రవేశద్వారం. కాబోయే సంస్కర్తలారా! దేశభక్తులారా! మీరావేదన చెందుతున్నారా? భగవంతునకూ మహర్షులకూ వారసులయిన కోట్లకొలది ప్రజలు పరమ మూర్ఖులకు సన్నిహితు లయిపోయారే అని మీ కావేదవ కలిగిందా? ఈ రోజున ఇన్ని కోట్లమంది తరతరాల దారిద్ర్యంతో, క్షుద్బాధతో మలమల మాడుతున్నారే అని మీరావేదన పడుతున్నారా? ఈ దేశాన్ని నల్లని మబ్బులా అజ్ఞానం ఆవరించిందని మీరేమైనా బాధ పడుతున్నారా? మీకు విశ్రాంతి లేకుండా చేస్తోందా అది? నిద్రపట్టనివ్వడంలేదు గదా! తీవ్రాతి తీవ్రమై నెత్తురుతో ఏకమై భరింపరాని తపనతో మీ గుండెలు కొట్టుకుంటున్నాయా? మిమ్మల్ని ఇంచుమించు ఉన్మత్తుల్ని చేసిందా? దేశ దౌర్భాగ్యం తప్ప పేరుప్రతిష్ఠల్ని, ఆలుబిడ్డల్ని, భోగభాగ్యాలను చివరకు శరీరాలను కూడా మరిచిపోయేటంత తీవ్రమైందా మీ ఆవేదన?

ముఖ్యావసరం గాఢ సానుభూతి

ఇరవై కోట్ల జనానీకం అజ్ఞానంలో దారిద్ర్యంలో నిమగ్నమై పోయిందని బాధపడేవాళ్లెవరున్నారు? అయ్యో! ఈ జనం తాము మనుష్యుల మనే మరచిపోయారే! అందుచేతనేగదా దాస్యం వచ్చింది? కడచిన కొద్ది సంవత్సరాలుగా కొంతమంది బుద్ధిమంతులు ఈ దుస్థితిని గుర్తించారు గాని దురదృష్టవశాత్తూ వాళ్ళందరూ దోషాన్నంతటినీ మతం నెత్తినపెట్టి ప్రపంచంలో అత్యుత్కృష్టమైన మన మతాన్ని ధ్వంసం చేయడమే జాతి నుద్ధరించే మార్గంగా భావించారు. నేను చెబుతున్నాను వినండి—భగవదనుగ్రహంచేత నా కసలు రహస్యం తెలిసింది. దోషం మన మతానిది కాదు.

మతం మనకు బోధిస్తున్న దేమిటి? నీలో ఉన్న ఆత్మయే బహుత్వాన్ని పొంది భిన్న వ్యక్తులుగా భాసిస్తోందనీ, అందరూ ఆత్మ స్వరూపులే అని గదా చెప్పుతున్నది? సిద్ధాంతం అక్కడ ఉన్నది. అభ్యాసం కరువై పోయింది. అవసరమైన సానుభూతీ, హృదయమూ లేకపోయాయి. భగవంతుడు బుద్ధుడుగా అవతరించి పాపులనూ, దీనులనూ, పేదలనూ, అనాథలనూ, సానుభూతితో ఎలా చూడాలో, వాళ్ళకై ఎలా ఆవేదన పడాలో బోధించాడు గాని ఆయన్ని మీరు వినిపించుకోలేదు.

హిందూమతం వలె మానవ గౌరవం మహోత్తాల మని ధీర గంభీర ధోరణిలో బోధించే మతం ప్రపంచంలో లేదు. అలాగే ప్రపంచంలో ఏ మతానికి చెందిన సంఘంలోనూ నేడు హైందవ సంఘంలో జరుగుతున్నట్లు అల్పులు అణచబడడంలేదు. పారమార్థిక, వ్యావహారిక సిద్ధాంతాల రూపంలో క్రౌర్య ప్రదర్శన మార్గాలు కనిపెట్టే వంచకులూ, ద్రోహులూ కొందరు చేరి ఈ అనర్థాన్ని తెచ్చిపెట్టారేగాని మన మతంలో ఏ దోషమూ లేదని భగవదనుగ్రహంవల్ల నాకు తెలియవచ్చింది.

వైద్యుని హృదయంతో సేవచెయ్యాలి

నైరాశ్య మక్కరలేదు. భగవంతుడు గీతలో చెప్పిన మాటలు జ్ఞాపక ముంచుకోండి.

"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదా చన" —

కృషి చెయ్యడానికే మనకు హక్కున్నది. ఫలంతో మనకు నిమిత్తంలేదు. నడుములు కట్టి ముందుకు దూకండి. భగవంతుడు నన్నీ పని చెయ్యమని ఆదేశించాడు. జీవితంలో నే నెన్నో కష్టాలనూ హింసలనూ పడవలసి వచ్చింది. నా ఆత్మబంధువులు అన్నానికి లేక చనిపోవడం చూచాను. అయినవాళ్ల ఎక్కిరింతలకూ అవిశ్వాసానికీ పాత్రుణ్నయ్యాను. నన్ను తిట్టుతూ ద్వేషించేవాళ్ళ యెడల చూపిన సానుభూతివల్లనే నే నెన్నో బాధలు పడవలసి వచ్చింది. అవును. ఈ జగత్తు దుఃఖమయ మయిన పాఠశాల. అయినా మహాత్ములూ, ప్రవక్తలూ ఈ పాఠశాలలోనే సానుభూతీ, ఓర్పూ, ప్రపంచమంతా కళ్ళముందు చూర్ణమైపోతున్నా చలించని భావదార్ఢ్యమూ మొదలైన సద్గుణాల నెన్నిటినో అభ్యసిస్తారు.

ఎంత బాధపడవలసి వచ్చినా నన్ను బాధపెట్టినవాళ్ళంటే నాకు జాలి తప్ప మరే భావమూ లేదు. నిజానికి వాళ్ళు దోషులుకారు. సంఘం దృష్ట్యా గొప్పవాళ్లూ, ఉన్నతులూ కావచ్చు; అయినా వాళ్ళు శిశువులే! కూపస్థ మండూకాల్లా తమచుట్టు రెండుమూడుగజాలు దాటి అవతలికి చూడడం వాళ్ళకళ్ళకు సాధ్యంకాదు. తినడం, త్రాగడం. సంపాదించడం, పిల్లల్ని కనడం, ఒకదాని తర్వాత ఒకటిగా దినచర్య గ్రుడ్డిగా సాగిపోతూ ఉంటుంది. అంతకంటే తెలియని అల్పజీవులు - వాళ్లేం చేస్తారు పాపం! వాళ్ళ నిద్ర కెన్నడూ భంగం జరగలేదు. అలాగే సాగిపోతోంది.

అనేక శతాబ్దాలుగా సాగిన ఔద్ధత్యంవల్ల పెచ్చుపెరిగిన దారిద్ర్య పీడితులూ, అవమానితులూ, దుఃఖార్తులూ చేసే ఆక్రందనాలతో భారతీయ

వాతావరణమంతా గగ్గోలుగా ఉన్నా దీనివల్ల వాళ్ళేమీ చలించలేదు. మానసికంగా, నైతికంగా, చివరకు దైహికంగా కూడా రాక్షసమైన క్రౌర్యం పెరిగిన కాలాలు గడిచి భగవంతుని ప్రతీకమైన మానవుడు బరువుమోసే జంతువయిపోయినా, జగన్మాత ప్రతినిధి పిల్లల్ని భరించే దాసి అయి పోయినా. జీవితమే ఒక శాపంగా పరిణమించినా వాళ్ళకేమీ తెలియనేలేదు.

ఈ చచ్చిన ముద్దకు - ఏవిధమైన ఆశపడడానికీ అవకాశం లేని దానికి - దాని క్షేమంకోసమే మనం యత్నిస్తున్నామని తెలియక కుళ్ళిన పదార్థంవలె ఏమైనా చెయ్యబోయేవారి మీదికి దూకడానికి సిద్ధంగా ఉండే దానికి - ప్రాణం పొయ్యగలవా నీవు? గొంతులో మందు పోస్తూఉంటే కాళ్ళతో తన్ని, గోళ్ళతో గోకి, పళ్ళతో కొరికే పెనసరపు కుష్ఠువాడికి ఓపికతో చికిత్సచేసే ఉదారహృదయుడైన వైద్యునిస్థానం స్వీకరించగలవా నీవు?

జపానులో ఆడపిల్లలు హృదయపూర్వకంగా ప్రేమిస్తే తమ ఆట బొమ్మలు సజీవమవుతాయని నమ్ముతారట! అందుకనే జపానుబాలిక తన ఆటబొమ్మ నెప్పుడూ పగులగొట్టుకోదు. ఓ అదృష్టవంతులారా! జనము చేతన మయ్యే అవకాశం ఉన్నప్పుడు తమస్సులో పడిఉన్న జాతి ఎందుకు చైతన్యవంతంకాదు? చైతన్య ముడిగి, వైభవంపోయి, విచక్షణ పూర్తిగా నశించి, క్షుత్పీడితులై, త్రస్తులై, అసూయాగ్రస్తులై పరస్పరం కలహించే ఈ దేశప్రజలను ఎవరైనా సర్వాత్మనా ప్రేమించగలిగితే భారతదేశంగూడా మేల్కొంటుందని నేనూ నమ్ముతాను. వందలకొలది ఉదారహృదయులైన స్త్రీలూ, పురుషులూ సర్వ భోగవాంఛలనూ విసర్జించి, అజ్ఞానమయమైన నైరాశ్య గర్తంలో అట్టడుగుకు కూలిపోతున్న కోట్లకొలది దేశీయుల క్షేమాన్ని కాంక్షించి, హృదయపూర్వకంగా సర్వశక్తులూ వినియోగించి కృషి చెయ్యగలిగిననాడే భారతదేశం మేల్కొంటుంది.

## రెండవది :— పరిష్కారమార్గం తెలియాలి

నీ కటువంటి సానుభూతి సంపూర్ణంగా ఉన్నదా ? ఉంటే అది మొదటి మెట్టు మాత్రమే. తర్వాత నీవు పరిష్కారమార్గ మేమిటో ఆలోచించాలి. పాత భావాలన్నీ మూఢవిశ్వాసాలే కావచ్చు గాని వాటిల్లోనే స్వర్ణతుల్యమైన సత్యం సంపిహితమై ఉంటుంది. పేరుకున్న మట్టీ మశానమూ కడిగి అసలైన బంగారాన్ని వెలికి తీసే ఉపాయ మేమిటో నీవు తెలుసుకున్నావా ?

## మూడవది :— నీ లక్ష్యం పరిశుద్ధమూ, సంకల్పం దృఢమూ కావాలి

నీ శక్తి సామర్థ్యాలను ఉబుసుపోక కబుర్లతో వృథా చెయ్యక తీవ్రంగా ఆలోచించి పరిష్కార మార్గ మేమైనా కనిపెట్టావా ? వట్టి నిరసించడం కాక ఏ కొంచెమో సహాయంచేసేది, కష్టస్థితిలో మంచి మాటలతో ఓదార్పు కలిగించేది, ఈ సజీవ సమాధిలోనుండి వాళ్ళను ఉద్ధరించేది ఏ ఉపాయమైనా నీకు తోచిందా ?

అయితే అది రెండవమెట్టు మాత్రమే. ఇంకొక మెట్టుగూడా నీవు ఎక్కవలసి ఉంటుంది. అప్పుడుగాని నీవు పూర్తి సంస్కర్తవు కావు.

నీ లక్ష్య మేమిటి ? దీనివల్ల నీ కేదో ఐశ్వర్యం వస్తుందనీ, పేరు ప్రతిష్ఠలూ, అధికారమూ వస్తాయనీ అంతరాంతరాల్లో నైనా ఆశించడం లేదుగదా ? లేకపోతే సరే, నీ లక్ష్యం పరిశుద్ధ మన్నమాట.

అయినా ఇంతటితో సరిపోదు. మహాపర్వతాలవంటి అవరోధాల నతిక్రమించడానికి తగిన దృఢనిశ్చయ మున్నదా నీకు ? ప్రపంచమంతా నీ కెదురు తిరిగినా సరే నీవు సక్రమ మనుకున్నది సాహసించి చెయ్య గలవా ? నీ పెళ్ళాం బిడ్డలే నీకు వ్యతిరేకు లయినా, నీ ద్రవ్య మంతా

పోయినా, నీ పేరు నశించినా, నీ ఆస్తిపాస్తులు అదృశ్యమయినా నీ సంకల్పం విడిచిపెట్టకుండా ఉండగలవా? అటువంటి పరిస్థితుల్లోకూడా మొదట్లో ఉన్న ఉత్సాహంతోనే నీ కృషి సాగిస్తూ లక్ష్యాని కభిముఖంగా పట్టుదలతో నడవగలవా? భర్తృహరి మహారాజు చెప్పినట్లు:

> నిన్దన్తు నీతి నిపుణా యది వా స్తువన్తు
> లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్
> అద్యైవ వా మరణమస్తు యుగాన్తరే వా
> న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరాః॥

(భర్తృహరి - నీతిశతకం)

> నీతి ప్రౌఢ విహారులైన నిపుణుల్ నిందించనీ మెచ్చనీ
> ఖ్యాంతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
> ఘాతం బప్పుడ పొందనీ నియతిమై కానీ యుగాంతంబునన్
> నీతిశ్లాఘ్యపథంబు తప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్ ॥

( లక్ష్మణకవి అనువాదము )

అటువంటి స్థైర్యం మీకున్నదా?

ఈమూడు విషయాల్లోనూ మీరు పరిపూర్ణులైతే మీలో ప్రతిఒక్కడూ మహత్తరకార్యాలు సాధించగలరు. మీరు పత్రికలకు వ్రాయనక్కరలేదు, ఉపన్యాసాలు చెప్పనక్కరలేదు. మీముఖాలే దివ్యవర్చస్సుతో ప్రకాశిస్తాయి. మీరు మారుమూల గుహల్లో కూర్చున్నా మీ భావాలు దేశకాలాల నతిక్రమించి దిగ్దిగంతాలకూ వ్యాపిస్తాయి. ఏ మనీషిమనస్సుకోపట్టి వానిచేత పని చేయిస్తాయి. తీవ్రభావన, ఆర్జవము, లక్ష్యశుద్ధి - వీనికున్న శక్తి అంత మహత్తరమైనది.

## లక్ష్యంకోసం ప్రాణార్పణ చేస్తామని ప్రతిజ్ఞ చెయ్యండి

ఒక్కరోజులో పూర్తి అయ్యే పని కాదిది. పోవలసినదారి ప్రాణాలు తీసే కంటకాలతో కూడిఉన్నది. కాని పార్థసారథి సారథ్యం వహించడానికి సిద్ధంగా ఉన్నాడు. భగవన్నామస్మరణ చేస్తూ అతనియందలి సంపూర్ణ విశ్వాసంతో భారతదేశంలో ఎన్నాళ్ళనుంచో పోగుపడ్డ కశ్మలానికి నిప్పు ముట్టించండి. అంతా తగలబడి పోతుంది.

పార్థసారథి దేవాలయానికివెళ్ళి ఆయన సమక్షంలో ఆయనకు ప్రియతమమైన ఈ మహాకార్యానికి ప్రాణాలనైనా అర్పిస్తామని ప్రతిజ్ఞ చెయ్యండి. బీదలూ అల్పులూ అయిన గోకులంలోని గొల్లకాపరులకు స్నేహితుడూ; అస్పృశ్యుడైన గుహకుణ్ణికూడా ఆలింగనం చేసుకోవడానికి ఏమాత్రమూ సంకోచించని ఉదారుడూ; మహారాజుల ఆహ్వానాన్ని కాదని ఒకానొక వేశ్య ఆతిథ్యాన్ని అంగీకరించి బుద్ధావతారంలో ఆమెననుగ్రహించిన పతితపావనుడూ; దరిద్రులనూ, పీడితులనూ, అల్పులనూ ప్రేమించి వారికై పదేపదే అవతరించే దయామయుడూ అయిన పార్థసారథి సాన్నిధ్యంలో మీ జీవితాలను దీనజనసేవకై అంకితం చెయ్యండి. రోజురోజుకూ దిగజారిపోతున్న ముప్పైకోట్ల భారతజనానీకాన్ని ఉద్ధరించడానికి మీ జీవితాల నర్పిస్తూ దీక్షవహించండి.

## విశ్వాసం

రండి, సోదరులారా రండి ! ముఖా ముఖి చూడండి ! చెయ్యవలసిన పని చాలా గొప్పది. మన మణుప్రాయులం, అయినా మనం సర్వజ్ఞుడైన భగవంతుని బిడ్డలం. భగవదనుగ్రహంతో కృతకృత్యుల మవుతాము. ఈ కృషిలో వందలకొలది హతమారిపోవచ్చు. మరికొన్నివందలమంది

కొనసాగించడానికి సిద్ధమవుతారు. నేను లక్ష్యం చేరకుండానే చనిపోవచ్చు. నా స్థానాన్ని మరొక రాక్రమించి పురోగమిస్తారు. రోగమూ, దాని చికిత్సా మీరు గ్రహించారు. విశ్వాసంతో కృషి చెయ్యండి. ధనవంతులనీ, గొప్పవాళ్ళనీ పేరుపడ్డవాళ్ల సహాయంకోసం ఎదురు చూడవద్దు. హృదయ శూన్యులై కేవలం బుద్ధిబలంతో ప్రతి పనినీ విమర్శిస్తూ పత్రికలలో వ్రాసేవాళ్ళ వ్రాతలనూ లక్ష్యం చెయ్యవద్దు. తీవ్ర విశ్వాసమూ, గాఢ సానుభూతీ - ఇవే కావలసినవి. విశ్వాసం, విశ్వాసం! మనలో మనకు విశ్వాసం, భగవంతునిలో విశ్వాసం - విజయాని కిదే కీలకం!

## నచికేతసుని శ్రద్ధ మన హృదయాల్లో ప్రవేశించాలి

ఆత్మవిశ్వాసం లేనివాడే నాస్తికుడు. అత్యంత సుందరమైన కఠోపనిషత్తు చదివిన వాళ్ళకు ఈ విషయం స్మృతికి వస్తుంది. రాజు యజ్ఞంచేసి ఎందుకూ పనికిరాని ఆవులనూ గుఱ్ఱాలనూ దానం చేస్తూ ఉంటాడు. అప్పుడా రాజకుమారుడు నచికేతసుని హృదయంలో శ్రద్ధ ప్రవేశించిందట! ఈ శ్రద్ధ అనే మాటను అనువదించకూడదు. అత్యద్భుతమైన ఆ పదాన్ని అలాగే అర్థం చేసుకోవాలి. అందులోనే రహస్యమంతా ఇమిడి ఉన్నది. శ్రద్ధామాహాత్మ్య మేమిటో గమనిద్దాము. అది ప్రవేశించగానే నచికేతసు డనుకున్నాడట—

బహూనా మేమి ప్రథమో బహూనా మేమి మధ్యమః
కిం స్విద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి ॥

(కఠ: 1-1-5)

(నేను చాలామంది కంటె ఉత్తముణ్ణి. నాకంటె ఉత్తములు కొద్దిమందే ఉంటారు. ఏ పరిస్థితిలోనూ అధముణ్ణికాను. నేను చెయ్యగలిగినదీ ఉన్నది).

ఈ ధైర్యం పెరిగిపెరిగి ఆ రాజకుమారుడు తన్ను వేధిస్తున్న సమస్యను పరిష్కరించుకోవాలని నిశ్చయం చేసుకున్నాడు. ఆ సమస్యే మృత్యు రహస్యం. (చనిపోబోయేవాటిని దానమెందుకు చేస్తున్నావు? అయితే నన్నెవరి కిస్తావు? అంటూ తండ్రిని నిలువరించాడు. నిన్ను మృత్యువుకే ఇస్తున్నాను పొమ్మన్నాడు తండ్రి) నచికేతసుడు సరాసరి మృత్యువు గృహానికే వెళ్ళాడు. మూడురోజు లాయింట నిరాహారియై యజమానికై ఎదురు చూచి చివరి కాయననుండే అసలు రహస్యం గ్రహించాడు.

ఈ శ్రద్ధ మనకు కలగాలి. ఈ నాడు పశ్చిమ జాతులు సాధించిన భౌతిక విజయాల కన్నింటికీ ఈ శ్రద్ధే కారణం. శ్రద్ధ ఉండగా కేవలం దేహబలాన్ని విశ్వసించి, వాళ్ళంత సాధిస్తే ఆత్మబలాన్ని విశ్వసించి మన మెంత సాధించగలం ?

నేను కోరేది ఈ శ్రద్ధను. మన మందరమూ ఆత్మవిశ్వాసం పెంపొందించుకోవాలి. విశ్వాసాన్ని తెచ్చుకోవడమే మన ముందున్న మహాకార్యం. దేనియందూ తీవ్రత లేక ప్రతిదాన్నీ ఎక్కిరిస్తూ చులకన చేసే జబ్బొకటి జాతిలో పెరిగి పోతోంది. ముందా జబ్బు వదిలించుకోవాలి. శక్తిమంతులై శ్రద్ధ వహించండి. విజయం కలగక తప్పదు.

## సంగత్యాగం

కార్యదీక్ష వహించు. దుర్భరమైన మహాశక్తి నిన్నావహించడం నీకే తెలుస్తుంది. ఇతరులకై చేసే కృషి ఎంత అల్పమైనా ఆంతరమైన శక్తిని ప్రబోధిస్తుంది. పరశ్రేయో భావన ఏ కొంచెం చేసినా నీ హృదయం శక్తివంతమై సింహం వలె పరాక్రమించ గలవు.

ముఖ్యమైంది సంగత్యాగం. సర్వసంగ పరిత్యాగం లేకపోతే ఎవరూ తమ హృదయాన్ని ఇతరులకై ధారపొయ్యలేరు. సంగత్యాగి

అయినవాడు అందరినీ సమంగా చూచి వారిసేవకై ఆత్మార్పణ చేస్తాడు.

## సేవతో అర్చన

వైరాగ్యం వహించండి. మన పూర్వులు మహాకార్యాలు చెయ్యడానికి ప్రపంచాన్ని పరిత్యజించారు. ఈ రోజుల్లో కొందరు స్వీయ ముక్తికై ప్రపంచాన్ని పరిత్యజిస్తున్నారు. అన్నిటితోపాటు ముక్తినిగూడా త్యాగం చేసి ఇతరులకు సహాయం చెయ్యాలి.

కొన్నాళ్ళపాటు మనమనస్సుల్లో ఇతర దేవతల నందరినీ తొలగించి మన జాతినే దేవతగా ప్రతిష్ఠిద్దాము. ఇప్పుడా దేవతే ప్రబుద్ధమై ఉన్నది. ఏ వైపు చూచినా, ఎక్కడ చూచినా, ఆ దేవత కాళ్ళే, ఆ దేవత చేతులే, ఆ దేవత చెవులే, ఆ దేవత అవయవాలే. అంతటా ఆ దేవతే ఆవరించి ఉన్నది. తక్కిన దేవతలందరూ నిద్రపోతున్నారు. ప్రబుద్దమై సమక్షంలో ఉన్న ఈ విరాడ్రూపాన్ని అర్చించలేక ఎక్కడో ఉన్న దేవతలకై ఎందుకు పోవాలి? ఈ విరాడ్ దేవతార్చనలోనే సర్వ దేవతలూ అర్చింపబడతారు.

ఇతరులకోసం సర్వమూ పరిత్యజించే వారికే ముక్తి లభిస్తుంది. నా ముక్తి, నా ముక్తి అంటూ మూలకూర్చుని మధనపడేవారికి వర్తమానమూ, భవిష్యత్తూ రెండూ లేకుండా పోతాయి.

అవసరమైంది చిత్తశుద్ధి - స్వచ్ఛమైన హృదయం. అది ఎలా లభిస్తుంది? మనచుట్టూ ఉన్న దీనజన సమూహాన్ని, భగవంతుని విరాట్ స్వరూపాన్ని అర్చించడ మొక్కటే మార్గం! మనుష్యులు, జంతువులు, సకలజీవులూ దేవతలే! మన దేశీయులే ముందు మనం అర్చించవలసిన దేవతలు !

## త్యాగబుద్ధీ, సేవాదీక్షా ఉన్న మనుష్యులు కావాలి

మన జాతీయాదర్శాలు సంగత్యాగమూ, సేవా, మనలో అవి గాఢమయితే శ్రేయస్సు దానంతటదే కలుగుతుంది. ఈ దేశంలో ఆధ్యాత్మికత్వాన్ని దూరం చెయ్యడానికి వీలులేదు. అందులోనే మోక్ష మున్నది.

లక్ష్యసాధన దృష్ట్యా ఇనుపకండలతో, ఉక్కునరాలతో, వజ్రకఠినమైన మనోనిశ్చయంతో కృషిచేసే వ్యక్తులు కావాలి. క్షాత్రవీర్యమూ, బ్రహ్మతేజమూ రెండూ విజృంభించాలి. వివాహమన్న పేరుతో పెద్దల మౌర్ఖ్యం వల్ల లక్షలకొలది నిహతమై పోతున్నారుగాని అలాకాని పక్షంలో మన యువకు లన్నింటికీ సమర్థులు. వాళ్ళకు కావలసినవన్నీ ఉన్నాయి. ఓయి భగవంతుడా! నా మొర లాలకించు,

కొద్దిమంది ఇవతలికి వచ్చి భగవంతునికొరకే బ్రదికి ప్రపంచ క్షేమానికై మతాన్ని రక్షించండి. గార్హస్థ్యం స్వీకరించి కేవల భ్రాంతి జనకు లవుతూ మేము 'జనకుల' మని నటించకండి. (జనకమహారాజు ప్రజాక్షేమానికై రాజ్యం చేస్తూ గార్హస్త్యంలో ఉన్నా మానసికంగా సర్వసంగ పరిత్యాగియే) 'లక్ష్యం తెలుస్తోంది కాని చేరడం చేతకావడంలేదు' అని నిజాన్ని అంగీకరించండి. అంతేకాని త్యాగం చెయ్యడం చేతకానప్పుడు త్యాగులమన్నట్లు నటిస్తా రెందుకు? పరిత్యాగం చేస్తారా, చేసి నిలబడండి. అజ్ఞానంతోడి పోరాటంలో వందమంది పడిపోయినా పతాకాన్ని పడనివ్వక పట్టుకుని ముందుకు సాగండి, ఎంతమంది పడిపోయినా భగవంతు డుండనే ఉన్నాడు. పడేవాడు తర్వాతవాడి కందిస్తూ ఉంటే పతాకం ఎన్నడూ పడదు!

పవిత్ర హృదయాలతో పట్టుదలవహించి, అచంచల భగవద్విశ్వాస కవచధారులై, దీనజనసానుభూతితో సముత్తేజితులై ఒక లక్షమంది యువతీ యువకులు ఆసేతు శీతాచలం పర్యటిస్తూ ముక్తి మార్గాన్నీ.

అన్యోన్య సహాయ విధానాన్నీ, సాంఘికాభ్యుదయ పద్ధతులనూ, సర్వసమానత్వాన్నీ ఒక్కొక్కరికీ బోధించి మేల్కొల్పాలి!

భగవత్సేవకులుగా కార్యరంగాన్ని ప్రవేశించండి.

తిరిగి తిరిగి మనదేశం మూర్ఛితమవుతూనే ఉన్నది. భగవంతుడవతరించి ఉద్ధరిస్తూనే ఉన్నాడు.

పోయినవాళ్లు తిరిగి రారు. గతం గతమే; మళ్ళీ కనిపించదు. పడిపోయిన కెరటం మళ్ళీ లేవదు; మానవుడు తాను విడిచిన శరీరాన్ని మళ్ళీ ధరించడు. అందుచేత పోయిన గతాన్ని పూజించడం మాని జీవిస్తున్న వర్తమానాన్ని పూజించమని మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము. జరిగిపోయిన వాటిని గూర్చి విచారిస్తూ కూర్చోక ఇప్పుడు చెయ్యవలసినవి చేద్దాం రమ్మని పిలుస్తున్నాము. ఉపయోగంలో లేనందువల్ల చెట్టూ చేమా పెరిగి మరుగుపడిపోయిన పాతదారులను కనుక్కొనే వ్యర్థప్రయత్నం మాని కొత్తగా వేసిన విశాలమైన రహదారులగుండా పోదాం రమ్మని ఆహ్వానిస్తున్నాము. ధీమంతు లర్థం చేసుకుని మా ఆహ్వానాన్ని అంగీకరిస్తారు.

ప్రథమావిర్భూతిలోనే సర్వదిక్కుహరాల్లోనూ జాతీయ సందేశాన్ని ప్రతిధ్వనింపజేసిన భారతజాతి మహత్తర శక్తిని సంపూర్ణంగా మీ మనస్సులకు పట్టించుకోండి. స్వమతానుష్ఠాన లోపంచేత నిస్తేజస్కమై నీరవమై స్తబ్ధమై పడిఉన్న ఈ జాతిని పునశ్చైతన్యవంతం చెయ్యడానికి పరతంత్రులైన జనుల్లో అవశ్యంగా ఉండే అసూయా ద్వేషాలనూ, దురభిప్రాయాలనూ, బలహీనతలనూ దూరంగా త్రోసివేసి ముందుకు వచ్చి సహాయం చెయ్యండి.

భగవంతుని సేవకులమని హృదయపూర్వకంగా విశ్వసిస్తూ ఆయన కార్యాన్ని నిర్వహించడానికి తోడ్పడే బాలభటులుగా కార్యరంగంలోకి ప్రవేశించండి.

# పునరుజ్జీవన మహాకార్యం — 1

## పూ ర్వ రం గం

మన జాతిని సృష్టించి, సంరక్షిస్తూ, నిలబెట్టుతున్న భగవంతుడు; మన పూర్వులు నమ్మిన దైవం; ఆయన పేరు విష్ణువో, శివుడో, శక్తియో, గణపతియో. గుణసహితుడో, నిర్గుణుడో, సాకారుడో, నిరాకారుడో, ఎవరైనా, ఎట్టివాడైనా మనపూర్వులు స్పష్టంగా అంతర్దృష్టితో చూచి తెలుసుకుని 'ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి', 'ఉన్న దొక్కటే. దానినే మహర్షులు వేరు వేరు నామములతో పిలుస్తారు' అని ఎవరిని ప్రకటించి ఉన్నారో ఆ భగవంతుడు తన అనంతమైన ప్రేమతో మన హృదయాల్లో ప్రవేశించును గాక! మనలను ఆశీర్వాద పరంపరలో ముంచెత్తును గాక! మనం పరస్పరం అర్థం చేసుకునేటట్లు చేయును గాక! మన మందరమూ నిజమైన ప్రేమతో, సత్య పరాకాష్ఠతో సమిష్టి క్షేమానికై కృషి చేసేటట్లు చేయును గాక! భారత జాతీయ ఆధ్యాత్మిక పునరుజ్జీవన మహాకార్యంలో నిమగ్నులమైన మనమందు వ్యక్తిగత కీర్తి ప్రతిష్ఠలకూ, వ్యక్తిగత ప్రయోజనాలకూ లేశ మాత్రపు వాంఛ అయినా పొడచూపకుండును గాక!

### దేశాంతరాల్లో ఏం జరుగుతోందో తెలుసుకోవాలి

అతి ప్రాచీనకాలంలో మనదేశం ఆధ్యాత్మిక భావాల్లో మహత్తర మైన ఔన్నత్యాన్ని సాధించింది. ఈ రోజున ఆ ప్రాచీన చరిత్ర

నొక్కమాటు మన స్మృతిపథంలోకి తెచ్చుకుందాము. అయితే పాత గొప్పతనాన్ని తలపోయడంలో ఒక ప్రమాదం ఉన్నది. మన ప్రాచీను లింత గొప్పవాళ్ళు కదా అని మనం గర్వితులం కావడమూ, ఆ గొప్ప తనాన్ని భావించడంతోనే తృప్తిపడి నూతన విషయాలకు కృషిచెయ్యక పోవడమూ తటస్థించవచ్చు. ఆ ప్రమాదంలో పడకుండా మనం జాగ్రత్త పడాలి.

భారతదేశాన్ని నే నెంతో ప్రేమిస్తున్నాను. నా దేశభక్తి ఇతరుల దేశభక్తి కెంతమాత్రమూ తీసిపోదు. ప్రాచీను లంటే నా కెంతో గౌరవ మున్నది. అయినా ఇతర జాతులనుండి మనం నేర్చుకోవలసింది ఎంతో ఉన్నదని నే ననుకోక తప్పడంలేదు. ప్రతివ్యక్తి మన కేదో ఒకటి నేర్పగలడు కాబట్టి అందరి చరణసన్నిధిలోనూ కూర్చోడానికి మనం సిద్ధపడాలి. అదే సమయంలో ప్రపంచానికి మనం బోధించవలసింది కూడా ఎంతో ఉన్న దన్న సంగతి మరిచిపోగూడదు.

భారతదేశానికి అవతలఉన్న ప్రపంచాన్ని నిర్లక్ష్యం చెయ్యడం మన క్షేమానికే మంచిదిగాదు. తెలివితక్కువగా ఇదివర కలా చేశాము. ఫలితంగా వేయి సంవత్సరాల పారతంత్ర్యాన్ని అనుభవించాము. మన్ని మనం ఇతర జాతులతో పోల్చి చూచుకోలేదు. మన చుట్టూఉన్న దేశాల్లో ఏం జరుగు తోందో గమనించలేదు. అందుచేతనే మన గూట్లోనే మనం ఉండి దిగజారి పోయాము. ఫలిత మనుభవించాము కాబట్టి మళ్ళీ ఆ పొరపాటు జరగనివ్వ కూడదు.

భారతీయులు దేశపు సరిహద్దులు దాటి పోగూడదు, సముద్రయానం పనికిరాదు మొదలైన అభిప్రాయాలూ అర్థంలేనివి. వాటిని పూర్తిగా మార్చుకోవాలి. బైటికివెళ్ళి ఇతరదేశాల్లో సంచరించినకొద్దీ వ్యక్తులకూ, దేశానికీ శ్రేయస్సు కలుగుతుంది. కడచిన శతాబ్దాల్లో అలాచేసి ఉన్న

ట్లయితే ఇప్పు డీ స్థితిలో ఉండేవాళ్ళం కాము. పాలించదలచిన ప్రతిజాతికీ పాదాక్రాంతులం కావలసిన దుర్గతి పట్టేదికాదు.

### బ్రతకదలిస్తే విస్తృతి పొందాలి

జీవనానికి మొదటి లక్షణం విస్తరణం. బ్రతకదలిస్తే విస్తరించి తీరాలి. విస్తరించడం మానినప్పుడు మృత్యువాసన్న మయిందన్నమాటే : నేను అమెరికా ఐరోపాలకు వెళ్ళాను. వెళ్ళక తప్పలేదు. జాతి ప్రాణశక్తి మళ్ళీ మేల్కొన్నదనడానికి అదే మొదటి చిహ్నంకాబట్టి వెళ్లాను. జాతిలో ప్రబుద్ధమై విస్తరిస్తున్న ప్రాణశక్తి నన్ను విదేశాలకు పంపింది. ఇలా వేలమందిని పంపిస్తుంది. నా మాటలు జ్ఞాపకం పెట్టుకోండి. మనజాతి బ్రతికిఉండేటట్లయితే ఈ పని జరిగితీరుతుంది. ఈ విస్తరణ మూలంగానే మానవజాతి విజ్ఞాన భాండారానికి మనవంతు మనం సమర్పించడమూ, ప్రపంచాభ్యుదయంలో మనపాత్ర మనం నిర్వహించడమూ జరుగుతుంది.

ఇదేమీ కొత్తవిషయంకాదు. పూర్వమూ జరిగింది, ఇప్పుడూ జరుగుతోంది. హిందువు లేకాలంలోనూ ఈ దేశాన్నిదాటి అవతలికి వెళ్ళలే దనుకోవడం వట్టి పొరపాటు. అలా నీవు భావిస్తుంటే మన ప్రాచీన గ్రంథాలను నీవు చదవలేదన్నమాట. చరిత్రను సరిగా అర్థం చేసుకో లేదన్నమాట ;

### ఇతరులకు ప్రాణమిస్తేనే మనకు ప్రాణ ముంటుంది

బ్రతకదలచిన ప్రతి జాతీ ఇతరుల కిస్తూ ఉండాలి. ప్రాణమిస్తేనే ప్రాణ ముంటుంది. ఒకరినుండి మనం స్వీకరించేటప్పుడు దానికి ప్రతిఫల మివ్వక తప్పదు అజ్ఞు లేవిధంగా అనుకున్నప్పటికీ ఇన్ని వేల సంవత్సరా లుగా మనజాతి సజీవమై ఉన్నదన్న యథార్థమే ఇతరులకు మన మిస్తున్నా

మనడానికి నిదర్శనం. అయితే బాహ్య ప్రపంచానికి భారతదేశం ఇచ్చింది విజ్ఞానమూ, మతమూ, వేదాంతమూ, ఆధ్యాత్మికతత్వమూ!

అందుచేత మనం బైటికి వెళ్ళితీరాలి. ఆధ్యాత్మికత్వాన్ని ఇచ్చి ఇతరులు ఇవ్వగలిగినవి తీసుకోవాలి? ఆత్మజగత్తుకు చెందిన అద్భుత విషయాలు ఇచ్చి భౌతిక జగత్తుకు చెందిన మహత్తర విషయాలు గ్రహిద్దాము. మనం విద్యార్థులమేకాము, గురువులమూ అవుతాము. సమానత లేకుండా స్నేహం ఉండదు. ఒక పక్షమే ఎల్లప్పుడూ బోధించేదయి రెండవపక్షం శుశ్రూష చేసేదే అయితే రెంటికీ సమానత ఉండదు. ఆంగ్లేయులతోనూ అమెరికనులతోనూ సమానత పొందాలంటే వాళ్ళకు మనం బోధించడమూ, వాళ్ళనుండి నేర్చుకోవడమూ రెండూ జరగాలి. ఎన్ని శతాబ్దాలు గడచినా తరగని విజ్ఞానం, ప్రపంచానికి మనం బోధించ వలసింది, మన దగ్గర ఎంతో ఉన్నది.

## పశ్చిమదేశాల నుండి నేర్చుకోవలసిన వెన్నో ఉన్నాయి

మన మభ్యుదయం పొందాలంటే పశ్చిమదేశాలనుండి మనం నేర్చుకోవలసిన వెన్నో ఉన్నాయని విస్మరించకూడదు. వాళ్ళ భౌతిక శాస్త్రాలనూ, క్రియాకౌశలాన్నీ మనం నేర్చుకోవాలి.

మనకు సమృద్ధంగా ఉన్న ఆధ్యాత్మిక పరిజ్ఞానాన్ని ప్రపంచానికి బోధించాలి.

వాళ్ళనుండి మనం నేర్చుకునేవి కొంచెం భౌతిక విజ్ఞానం, కూడ గట్టుకుని పనిచేసే శక్తి, ప్రకృతి శక్తులను వినియోగించుకునే నైపుణ్యమూ, అత్యల్ప సాధనాలలో అతి విస్తృత ఫలితాలను సాధించే క్రియా కౌశలమూ ఇలాంటివే మరికొన్ని కావచ్చు.

### అనుకరణం నాగరకత కాదు.

అనుకరణం నాగరకత కాదు. ఈ సంగతి కూడా మనం మరిచి పోగూడదు. రాజవేషం వేసుకున్నంత మాత్రాన నేను రాజు నౌతానా? పులితోలు కప్పుకోవచ్చు, గాడిద గాడిదే గాని పులి అవుతుందా? కేవలానుకరణం, స్థైర్యంలేని అనుకరణం – అభ్యుదయాన్ని ఎన్నడూ కలిగించదు. ఆ చిహ్నం కనిపిస్తే మానవు డధఃపతనం చెందుతున్నా డన్నమాటే. అనుకరణ మెవరు చేస్తారు? తన్ను తా నసహ్యించుకునేవాడు. అంటే ఆత్మవిశ్వాసం పూర్తిగా కోల్పోయినవాడు. వాడు వినాశం పొందక తప్పదు.

### హైందవుడు కావడం గర్వహేతువు

తన పూర్వులనుగురించి సిగ్గుపడడం మొదలుపెట్టినవాడు వినాశం పొంది తీరుతాడు. హైందవజాతిలో కనిష్ఠుడనైనా నా జాతిని గూర్చి, నా పూర్వులను గూర్చి నేను గర్విస్తున్నాను. నన్ను నేను హిందువని చెప్పుకోవడానికి, హైందవజాతికి చెందిన మీ కందరకూ అధమసేవకుడనని చెప్పుకోవడానికి నాకెంతో గర్వం! ప్రపంచ మెన్నడూ ఎరగని మహర్షుల సంతతికి చెందిన మీ దేశమే నా దేశమని చెప్పుకోవడానికి నే నెంతో గర్విస్తున్నాను.

### దేన్ని స్వీకరించినా నీ వ్యక్తిత్వంతో మార్చివెయ్యి

అందుచేత ఆత్మవిశ్వాసం పెంపొందించుకుని పూర్వులనుగూర్చి గర్వపడు! ఏపరిస్థితిలోనూ సిగ్గుపడవలసిన అవసరంలేదు. ఇతరుల నెందులోనూ అనుకరించవద్దు. ఇతరుల చెప్పుచేతల్లో ఉండవలసి వచ్చి నప్పుడు స్వాతంత్ర్యం నశిస్తుంది. ఆధ్యాత్మిక సాధనలోనైనా పరులు చెప్పినట్లే చేస్తూఉంటే స్వతంత్రాలోచన లుప్తమై పోతుంది. స్వీయకృషి

చేత నిన్ను నీవు ఆవిష్కరించుకోవాలిగాని అనుకరించి ప్రయోజనంలేదు. ఇతరులనుండి మనం నేర్చుకోవాలి. అనుకరణకూ నేర్చుకోవడానికీ ఎంతో భేదం ఉన్నది.

బీజాన్ని భూమిలోపెట్టి, గాలి సమృద్ధిగా లభించేటందుకు చుట్టూ నేల గుల్లచేసి, కావలసిన నీళ్ళు పోస్తాము. ఆ బీజం మొలకెత్తి చెట్టై మహావృక్ష మవుతుంది. గాలీ, భూమీ, నీరూ, వెలుతురూ – వీటి నుపయోగించుకునే కదా అదంత వృక్షమైంది? అయినా దాన్ని గాలి అంటామా, భూమి అంటామా, నీరు అంటామా, వెలుతురంటామా? వాటిల్లో ఏదీకాదు. అన్నింటినీ ఉపయోగించుకుని తన వ్యక్తిత్వంతో మార్చివేసి మహ వృక్షంగా పెరిగిం దది. మనం చెయ్యవలసిందీ అదే :

## మంచి విషయాలు ఎక్కడినుంచైనా నేర్చుకో

ఇతరులనుండి మనం నిజంగా నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయి. నేను నేర్చుకోవలసినది ఏమీ లే దనుకునేవాడు మరణించినవాడితో సమానం. మను వీ విషయంలో ఎంత విస్పష్టంగా చెప్పాడో చూడండి.

> ఆదదీత పరాం విద్యాం ప్రయత్నా దవరాదపి
> అన్త్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి॥
>
> (మను. 11-238)

తక్కువవారి నుండైనా గొప్ప విద్యను ప్రయత్నించి నేర్చుకోవాలి. గొప్ప ధర్మాన్ని అంత్యజుని నుండైనా స్వీకరించాలి. స్త్రీ రత్నాన్ని దుష్కులములో నుండైనా స్వీకరించవచ్చు.

అందుచేత ఇతరులనుండి వాళ్ళ దగ్గర ఉన్న మంచి విషయాలన్నీ నేర్చుకో : వాటిని నీలో ఇముడ్చుకుని నీ ప్రకృతి ననుసరించి అభివృద్ధి పొందు. అంతేగాని ఇతరులుగా మారిపోకు. వ్యామోహంతో హైందవ

జీవితం నుండి బహిష్కృతుడవై పోకు. భారతీయు లందరూ ఇతర జాతుల వేషాలు వేసి వాళ్ళవలె మారిపోతే దేశం బాగుపడుతుందని ఎన్నడూ అనుకోకు.

జీవన స్రవంతిని నిర్నిరోధంగా ప్రవహించనీ!

ఒకటి రెండు సంవత్సరాలు అలవాటయిన అభ్యాసాన్ని విడిచి పెట్టడ మెంత కష్టమో నీకు తెలుసు. మనరక్తం ఎన్నివేల సంవత్సరాల వయస్సు కలిగినదో, మన జాతీయ జీవనస్రవంతి ఒకానొక విశిష్ట మార్గంలో ఎన్నివేల సంవత్సరాలుగా ప్రవహిస్తూ ఉన్నదో ఆ భగవంతునికే తెలియాలి. అటువం టప్పుడు సముద్రాన్ని సమీపించిన ఈ మహానది వెనక్కి మళ్ళి తన జన్మస్థానమైన హిమాలయపర్వతాలు చేరుకోగలదా? ఎన్నటికీ సాధ్యం కాదు. కాగా మళ్ళించాలని మనం ప్రయత్నించడం దాన్నే విచ్ఛిన్నం చేస్తుంది.

అందుచేత జాతీయ జీవనస్రవంతిని సహజ మార్గంలో ప్రవహించ నివ్వాలి. దారి నటకాయించిన అవరోధాలు తొలగించు; పేరుకున్న ఇసుక మేటలు తీసివెయ్యి; అవసరమైనచోట్ల మరమ్మతులు చేసి గట్లు దృఢంగా ఉండేటట్లు చూడు; దాంతో అది వేగం పుంజుకుని తన సహజ మార్గాన ప్రవహిస్తుంది. జాతి నవ్య చైతన్యంతో అభ్యుదయాన్ని పొందుతుంది.

మనమీది కెన్నో విజాతీయ భావాలు దండెత్తి వచ్చాయి. అవి మన మతాన్ని లోలోపల తొలిచివేస్తున్నాయి. ఈ రోజున మన మింత హీన స్థితిలో ఎందు కుంటున్నాము? మనలో నూటికి తొంభై మంది పేరుకు భారతీయు లయినా తత్త్వంలో విజాతీయు లెందు కయిపోయారు? ఇతర జాతులతోపాటుగా మన మభ్యుదయం పొందాలంటే ఈ విజాతీయ భావ దాస్యం తొలగి పోవాలి.

## ఎవరినీ నిందించవద్దు - మన కర్మనే మనం నిందించుకుందాం

మీకు కష్టంతోచినా కొన్ని కఠిన సత్యాలు చెప్పవలసి ఉన్నది. ఎవడో ఇంగ్లీషువాడు మన దేశీయు ణ్ణొకణ్ణి అవమానించినా, చంపినా పత్రికల నిండా హాహాకారాలు చెలరేగుతూ ఉండడం చూస్తూ ఉంటాను. వాటిని చదివి, కన్నీళ్ళు పెట్టుకుని అందరివలెనే నేనూ బాధపడతాను. కాని మరుక్షణంలోనే ఈ దుస్థితికి బాధ్యు లెవరన్న ప్రశ్న నన్ను వేధిస్తుంది. వేదాంతిగా ఈ ప్రశ్నకు నాకు నేనే సమాధానం చెప్పుకోవాలి. హైందవుడు సహజంగా అంతర్ముఖుడు. సర్వ విషయాలనూ తనలోనే సమన్వయించుకుని ఆత్మద్వారానే అర్థంచేసుకోవాలని చూస్తాడు. అందు కని నన్ను నేనే పదే పదే ప్రశ్నించుకుంటాను. ఈ దుస్థితికి బాధ్యు లెవరు? ప్రతిసారీ సమాధానం-'ఇంగ్లీషువాళ్ళు కాదు. వాళ్ళ దెంతమాత్రమూ బాధ్యత లేదు; మన దుస్థితికి, మన అధఃపతనానికి అన్నింటికీ మనమే బాధ్యులం' అనే వస్తుంది.

మనకు మనం హాని చేసుకోకపోతే ప్రపంచంలో ఏ శక్తీ మనకు హాని చెయ్యలేదని వేదాంతులంగా మనకు తెలుసు. దేశ జనాభాలో ఐదవ వంతు మహమ్మదీయులయ్యారు. క్రైస్తవు లప్పుడే ఇరవై లక్షలు దాటారు.

దీనికి కారకు లెవరు? అసలు ప్రశ్న ఏమిటంటే స్వమతాన్ని విడిచి వెళ్లిపోతున్న వాళ్లకు మన మేమిచేశాము? మనవాళ్ళు మహమ్మదీయులూ, క్రైస్తవులూ ఎందుకు కావలసి వచ్చింది?

అన్యమతాలకు వెళ్ళినవాళ్లను గూర్చి ఇప్పుడు దుఃఖిస్తున్నాం గాని వెళ్ళకముందు వాళ్ళకేం చేశాము? మనలో ప్రతి ఒక్కరూ ఈ ప్రశ్న వేసుకోవాలి. మన మతాన్ని గూర్చి మన మేం తెలుసుకున్నాము?

మన కందిన విజ్ఞానజ్యోతిని ఎంతదూరం తీసుకువెళ్ళాము? ఎంతమంది కందించాము? అవసరమైనప్పుడు మన మీ సహాయం చెయ్యలేదు. చెయ్యకపోవడం మన దోషం, మన కర్మ. దాని ఫలం అనుభవించ వలసిందే! ఎవరినీ నిందించవద్దు, మన కర్మనే మనం నిందించు కుందాము.

## వ్యాధి దుర్బలమైన శరీరాన్నే పీడిస్తుంది

భౌతికవాదమో, మహమ్మదీయమో, క్రైస్తవమో - ఏదైనా గాని మనలో ఇంత వ్యాపించడానికి మన మవకాశ మివ్వడమే హేతువు. మానవ శరీరం వ్యసనాలూ, చెడ్డతిండీ, నిర్లక్ష్యం, యథేచ్ఛావిహారం మొదలయిన వాటిచేత దుర్బలమయితేనేతప్ప ఏ రోగక్రిములూ దాన్ని బాధించవు, దృఢమయిన శరీరం కలవాడు విషతుల్యమయిన రోగక్రిముల వాతావర ణంలో నుండి కూడా నిర్భయంగా పోగలడు.

శరీరం రోగగ్రస్తం కావడానికి రెండు పరిస్థితు లుండాలి. బయటి నుండి రోగక్రిమీ, లోనుండి శరీరదుస్థితీ ఒకదానికొకటి తోడ్పడితేనేగాని రోగంరాదు. సత్తువనూ సహిష్ణుతనూ కోల్పోయి, రోగక్రిములు ప్రవేశించి లోన నివాసం చేసుకుని పెరిగి వ్యాపించడానికి అవకాశం ఇస్తేనేగాని ప్రపంచంలో ఏ రోగక్రిములూ శరీరానికి వ్యాధిని కలిగించలేవు. నిజానికి ప్రతివ్యక్తి శరీరంలోనూ కోట్లకొలది క్రిములు ప్రవేశిస్తూనే ఉన్నాయి. జీవశక్తి సమృద్ధిగా ఉన్నప్పుడు వాటినెవరూ పట్టించుకోవడంలేదు. అది తగ్గి శరీరం దుర్బలమైనప్పుడే రోగక్రిములు స్వాధీనంచేసుకుని వ్యాధులను కలిగిస్తున్నాయి. జాతీయ జీవితం విషయంలోనూ ఇలాగే జరుగుతుంది.

రాజకీయ రంగంలోగాని, సాంఘికరంగంలోగాని, విద్యాబుద్ధుల విషయంలోగాని జాతి శరీరం దుర్బలమైనప్పుడే సర్వవిధరోగక్రిములూ ప్రవేశించి వ్యాధులను కలిగిస్తాయి. వాటికి చికిత్స చెయ్యడానికి మూల

హేతువుల నన్వేషించి కలుషితమైన రక్తాన్ని పరిశుద్ధం చెయ్యాలి. రక్తం పరిశుద్ధమై, శరీరం దృఢపడి, మనిషి శక్తిమంతుడైతే బయటనుంచి వచ్చే విషక్రిముల నెన్నింటినైనా ఎదుర్కొని నిలబడగలడు.

సోదరులారా! మనలో ఉన్నాయనిచెప్పి విజాతీయులు మన హైందవజాతిని నిందించే దోషాల కన్నింటికీ మనమే కారణ మని మనకు తెలుసు. సిగ్గుచేటైన ఈ విషయాన్ని మన మంగీకరించాలి. తోడి భారతీయులనే ఎన్నో అపవాదాలు మోపి ఎన్నోవిధాల హింసించింది మనమేగదా!

## అసహ్యించుకోదగిన అసందర్భ పరిస్థితులు

మన మెంత అసహ్యించుకోదగిన అసందర్భపరిస్థితులలో పడి పోయాము! ఒక పాకీవాడు పాకీవాడుగా వస్తే ప్లేగునుచూచినట్లు అందరూ దూరంగా పోతారు. కాని వాడే ఏ ఫాదిరీ దగ్గరనో కాసినినీళ్ళు నెత్తిన చల్లించుకుని వేషంమార్చివేసి వస్తే ఎంతసాంప్రదాయికహిందువైనా కుర్చీ ఇచ్చి, మర్యాదచేసి కరచాలనం చెయ్యకుండా ఉండడానికి సాహసించగలడా? ఇలా చెయ్యని మహానుభావుణ్ని నేనింతవరకూ చూడలేదు. ఇంతకంటే వైపరీత్యం మరేముంటుంది!

కడచిన ఐదారువందల సంవత్సరాల్లో మన మెంత దిగజారి పోయామో ఆలోచించండి. మన పెద్దలు వందలకొలది మంచినీళ్ళు ఎడంచేత్తో పుచ్చుకోవాలా, కుడిచేత్తో పుచ్చుకోవాలా? చెయ్యి ఎన్నిమాట్లు కడుక్కోవాలి, మూడుసార్లా, నాలుగుసార్లా? ఇలాంటి మహావిషయాలను గూర్చి తీవ్రంగా చర్చిస్తూ కాలక్షేపం చేశారు.

## మానసిక దౌర్బల్యం

గంట కుడిప్రక్క మ్రోగించాలా, ఎడంప్రక్క మ్రోగించాలా? గంధపు బొట్టు ఎక్కడ పెట్టుకోవాలి? తలమీదనా, మరోచోటనా? ఇలాంటి

అల్పవిషయాలనుగూర్చి దివారాత్రాలు హోరాహోరీగా చర్చించే మనుష్యులను ఏమన్నా తప్పులేదు. ఇటువంటి చిల్లర విషయాలకు ప్రాముఖ్యమిచ్చే వాళ్ళు మానసికంగా దుర్బలులయిపోయారన్నమాట. ఈ దౌర్బల్యం చేతనే భాగ్యదేవత మన్ని అసహ్యించుకొని తన్ని తరిమివేసింది. పాశ్చాత్యులు ప్రపంచ విజేతలై కూర్చున్నారు.

## వ్యక్తిత్వము, జీవశక్తి, చైతన్యము — అన్నీపోయాయి

అల్పవిషయాలకు అధిక ప్రాముఖ్యమిచ్చి అవే జీవన్మరణ సమస్యలుగా చర్చిస్తూ వాటినిగూర్చి పెద్దపెద్ద గ్రంథాలు కూడా వ్రాస్తూ జీవితాలు వ్యయంచేసిన వాళ్ళనుండి ఎవరైనా ఏమాశించగలరు?

ఒక బంగాళదుంప వంకాయను తాకితే విశ్వప్రళయం ఎన్నాళ్ళలో వస్తుంది? హస్త పారిశుద్ధ్యానికి మృత్తుతో మార్జనము ద్వాదశవారములు చెయ్యకపోతే నరకానికి వెళ్ళేది పదునాలుగు తరముల పితరులా, ఇరువది నాలుగు తరములవాళ్ళా? కడచిన రెండువేల సంవత్సరాల్లోనూ మనవాళ్ళు ఇటువంటి క్లిష్టసమస్యలకు శాస్త్రీయ పరిష్కారమార్గాలు అన్వేషిస్తూ కాలక్షేపంచేశారు. దేశంలో నాలుగోవంతు జనులు ఆకలితో మలమల మాడిపోతున్నా సరే!

ఎనిమిదేళ్ళ పిల్లని ముప్ఫైయేళ్ళవాడి కిచ్చి పెళ్ళిచేసి తల్లిదండ్రులు కృతకృత్యులమైనామని సంతోషిస్తారు. ఎవరైనా దీన్ని వ్యతిరేకించి మాట్లాడితే మా మతాన్ని తలక్రిందులు చేస్తున్నారని గోలపెడ్తారు. రజస్వలలు కాకుండానే కుమార్తెలు తల్లులయి పోవడానికి అంగీకరిస్తూ ఈ ఘోరానికి శాస్త్రాధారాలు చూపిస్తామనే వాళ్ళకు ఉన్న మతమేమిటో అర్థం కావడంలేదు. ఈ దోషం యావత్తూ మహమ్మదీయుల కంటకట్టేవాళ్ళనేకులు! వాళ్ళేనా నిందింపబడవలసింది?

మన మతం క్రమేణా ముడుచుకుపోయి పాకశాలలో పర్యవసించే ప్రమాదం వచ్చిపడింది. ఈ పూట మనలో చాలామంది వేదాంతులూకారు, పౌరాణికులూ కారు, తాంత్రికులూ కారు. మనం కేవలం 'నన్ను ముట్టుకోకు' సిద్ధాంతంవాళ్ళం. మన మతం ప్రస్తుతం పాకశాలలో ఉన్నది. వంటపాత్రే దేవుడు. 'నన్ను ముట్టుకోకు, నేను పవిత్రుణ్ణి' అన్నదే మతం. మరొక శతాబ్దం ఇలాగే గడిస్తే దేశం పిచ్చివాళ్ళ నిలయం కాక తప్పదు.

జీవితంలో ప్రధాన సమస్యలను గ్రహించలేకపోవడం మనస్సు నిశ్శక్తిక మవుతున్నదనడానికి స్పష్టమైన చిహ్నం. మౌలికమైన వ్యక్తిత్వం పోయి, చైతన్యం నశించి, సారముడిగిన మనస్సు ఆలోచన చెయ్యలేక పడ్డ గాడిలోనే తిరిగి తిరిగి సంచరిస్తూ ఉంటుంది.

## ప్రాచీన మౌఢ్యమూ, నవ్యతామోహమూ రెంటినీ తొలగించుకుని ముందుకు పోవాలి

ఇప్పుడు మనజాతిని రెండువైపులా రెండు పిశాచాలు పీడిస్తున్నాయి. రెండూ బలమైనవే! వాటి పట్లు తప్పించుకుని ముందుకు పోగలిగితేనే మన కభ్యుదయం!

ఒక వంక మన్ని అజ్ఞానంవల్ల పాతుకుపోయిన పాతపద్ధతులు కదలనివ్వడంలేదు. వేరొకవంక నవ్యతామోహంతో తెచ్చిపెట్టుకున్న భౌతికవాదం మన వ్యక్తిత్వాన్ని చంపి నిర్వీర్యులను చేసేస్తోంది. ఈ రెంటినీ తొలగించుకుని ముందుకు పోవాలి.

అటు చూడండి. ఆ పెద్దమనిషి పాశ్చాత్య విజ్ఞాన మధువును గొంతుదాకా త్రాగి అంతా తనకే తెలుసునని విఱ్ఱవీగిపోతున్నాడు. ప్రాచీన మహర్షుల నాయన ఎక్కిరిస్తాడు. హైందవజాతికి చెందినవన్నీ ఎందుకూ

పనికిరానివని ఆయన ఉద్దేశ్యం. ఆయన దృష్టిలో మన వేదాంతం చిన్న పిల్లల అర్థంలేని గోల, మన మతం బుద్ధిహీనుల మూఢవిశ్వాసం.

ఇటు చూడండి. ఈయనా చదువుకున్నవాడే! అయినా ఈయన కింకో తిక్కపట్టింది. ఆయన దక్షిణ ధ్రువమయితే ఈయన ఉత్తరధ్రువం, ఈయన దృష్టిలో తనకు చెందిన సమస్తమూ సత్యమే. దేన్నీ ఎవరూ కాదనడానికి వీల్లేదు. ప్రతి చిన్న విషయాన్నీ ఏవేవో హేతువులు చెప్పి సమర్థించడానికి ప్రయత్నిస్తారు. అవివేకులైన గ్రామీణులు నమ్మే మూఢ విశ్వాసాలకు గూడా వేదంతో సమానమైన ప్రామాణ్య మిచ్చి వాటిని పాటించడం వల్లనే జాతి జీవిస్తుం దంటారు.

వీళ్ళిద్దరి ప్రభావంలోనూ మనం పడగూడదు.

మౌలికమైన వ్యక్తిత్వాన్ని కోల్పోయి జీవనశక్తి నశించి, మతం పేరిట చెలామణీ అయ్యే అల్పాల్ప విషయాలతో కలుషితమైన మనస్సు మహావిషయాలను గురించి ఆలోచించలేదు. విచక్షణలేక మోహితమైన మనస్సు ఆలోచించలేదు. అటుగాని ఇటుగాని తూలిపోకుండా నడుమనుంచి దారి చేసుకుని ముందుకు పోవాలి.

## రహస్య వర్తనమూ, మూఢ విశ్వాసాలూ బలహీనతా చిహ్నాలు

రహస్య వర్తనమూ, మూఢ విశ్వాసాలూ ఎల్లప్పుడూ బలహీనతనే సూచిస్తాయి. ఇవి పెరిగిపోతే మృత్యు వాసన్న మైందన్న మాటే! అందుచేత జాగరూకులమై వాటిని పరిహరించాలి. శక్తిమంతుడవై నీ కాళ్ళ మీద నీవు నిలబడు. నీ మీద నీకు నమ్మక ముంటే రహస్యవర్తన మెందుకు? పరమాద్భుతమైన మహత్తర విషయాలు ఎన్నో ఉన్నాయి. ప్రకృతిని గురించి మనకున్న పరిజ్ఞానాన్ని బట్టి వాటిని ప్రకృతి కతీతమైన విషయాలంటే అనవచ్చునుగాని వాటిల్లో ఏ ఒక్కటీ రహస్యం కాదు.

ఈ భూమిలో ఎన్నడూ మతవిషయిక సత్యాలు రహస్యాలుగా బోధింపబడలేదు. అవి కేవలం హిమవత్పర్వత శిఖరాల్లో నివసించే రహస్య సంఘాలకే చెందిన ఆస్తే కాదు.

## మూఢవిశ్వాసాల కలుపు తీసి స్వచ్ఛమైన మతాన్ని అనుసరించండి

ఇటువంటి రహస్య సంఘాలు ఎక్కడా లేవు. ఉన్నాయన్న మూఢ విశ్వాసంతో తిరిగి చెడవద్దు. మూఢ విశ్వాసాలతో దిగజారిపోవడం కంటె మీరు నాస్తికులైనా మీకూ మీ జాతికీ శ్రేయస్సు కలుగుతుంది. ఎందుచేతనంటే నాస్తికుడు తప్పకుండా బలవంతు డవుతాడు. తనమీదే తాను ఆధారపడతాడు కాబట్టి! తర్కబుద్ధి కేమాత్రమూ నిలవక అసహ్యాకరమైన పరమ మూఢ విశ్వాసాలను సమర్థించుకుంటూ శక్తిమంతులై ఉండీకూడా కష్టపడకుండా జీవితాలను వ్యయం చేసే వ్యక్తు లుండడం నిజంగా మానవ జాతికే సిగ్గుచేటు. ధైర్యంతో నిలబడు! ప్రతి దాన్నీ ఏదో ఒక విధంగా సమర్థించాలని ప్రయత్నించకు.

ఉన్న యథార్థ మిది. మన కెన్నో మూఢ విశ్వాసా లున్నాయి. శరీరం మీద పొడలూ, కురుపులూ, కంతులూ లేచినట్టు లేచాయి. ఇవి మన మతానికి, జాతీయ జీవనానికి, ఆధ్యాత్మికత్వానికి భంగకరాలు కావు. అయినా వీటిని పోగొట్టుకోవాలి. మన మతానికి చెందిన మూల సిద్ధాంతాలు ఎంత సురక్షితంగా ఉన్నా ఇవి పోతే మరింత ప్రకాశిస్తాయి. కాబట్టి తగిన చికిత్సలు చేసి వీటిని పోగొట్టాలి, మూల సిద్ధాంతాలనే అంటిపట్టుకుని ఉండాలి.

## దైహిక దౌర్బల్యం

ఉపనిషత్తు లెంత గొప్పవైనా, మన మహర్షు లెంత ప్రాచీనులైనా ఇతర జాతులతో పోల్చి చూస్తే ఈ పూట మనం అనేక విధాల దుర్బలుల

మని ఒప్పుకుని తీరాలి. ప్రథమంలో దైహికంగానే మనం దుర్బలులం. మన కష్టాల్లో మూడవ వంతుకు దైహిక దౌర్బల్యమే హేతువు. మనం సోమరులం. ఏపనీ చెయ్యలేము.

ముందు మన యువకు లందరూ దృఢశరీరులు కావాలి. తర్వాతనే మతాన్ని గూర్చి ఆలోచించాలి. యువకులారా! బలవంతులు కండి! ఇదే నా సలహా. గీతాపఠనంతోకంటె వ్యాయామంతో మీరు పరమార్థానికి సన్నిహితు లవుతారు. ఇవి సాహసవాక్యాలే. అయినా మిమ్మల్ని ప్రేమిస్తున్నాను కాబట్టి మీకు చెప్పక తప్పదు.

## భుజబల మున్నప్పుడు గీత బాగా అర్థమవుతుంది

మీ రెక్కడ కష్టపడుతున్నారో నా కర్థమవుతోంది. నేనూ కొంచెం అనుభవం సంపాదించాను. మీ భుజబలం పెరిగితే, మీరు మరింత దృఢ శరీరు లయితే గీతను మీరు బాగా అర్థం చేసుకోగలరు. శ్రీకృష్ణుని అద్భుత ప్రతిభా, అనంతవీర్యమూ మీలో మరింత శక్తి గల రక్త మున్నప్పుడు మీ కర్థమవుతాయి. దృఢ శరీరులై, మీ కాళ్ళమీద మీరు సుస్థిరంగా నిలబడి, మేమూ వీరులమే అని భావించగలిగిననాడు ఉపనిషత్తులు మీకు బాగా తెలుస్తాయి, ఆత్మ మహాత్మ్యమూ అర్థమవుతుంది.

మన మెన్నిటిని గురించో చిలకపలుకులు పలుకుతూ ఉంటాం గాని ఒక్కటీ ఆచరణలో పెట్టము. వాక్శూరతా, క్రియాభీరుతా మన కలవాటయి పోయాయి. మాటలు కోటలు దాటుతాయి గాని కాళ్ళు గడపలు దాటవు. ఏమిటి దీనికి కారణం? దైహిక దౌర్బల్యమే! దాంతో మనస్సూ దుర్బల మవుతోంది. ఇటువంటి దౌర్బల్యంతో మన మేమీ చెయ్యలేము. దార్ఢ్యాన్ని సంపాదించాలి.

మనకు కావలసింది రక్తంలో శక్తీ, నరాల్లో బలమూ, ఇనుప కండలూ, ఉక్కు నరాలూ - అంతేగాని నీరసపరిచే భావాలు కావు.

సోదరులతో కలహించడం, విజాతీయులకు మోకరిల్లడం

మనలో మరొక లోపంకూడా ఉన్నది. శతాబ్దాల దాస్యంవల్ల మన జాతి పౌరుషాన్ని కోల్పోయి ఇంచుమించు స్త్రీత్వాన్ని పొందింది. ఈ దేశంలోకాని మరొక దేశంలోకాని ముగ్గురు స్త్రీలు అయిదు నిమిషాలసేపు తమలో తాము కలహించకుండా ఒకచోట కూర్చోలేరు. ఐరోపియదేశాలలో స్త్రీలు పెద్దపెద్ద సమాజాలు స్థాపించి స్త్రీల అధికారాలు మొదలైనవాటిని గూర్చి బ్రహ్మాండమయిన ప్రకటనలు చేస్తారు. అంతలోనే కలహిస్తారు. ఎవడో పురుషుడువచ్చి వాళ్ళందరినీ అదుపాజ్ఞలలో పెడ్తాడు. సర్వ ప్రపంచంలోనూ స్త్రీలను పాలించడానికి పురుషుడుంటూనే ఉండాలి.

సరిగ్గా మన మలాంటివాళ్ళ మయ్యాము. మనము స్త్రీలమే. స్త్రీలకు మార్గదర్శకురాలుగా ఏ స్త్రీఅయినా వస్తే వెంటనే వాళ్ళామెను విమర్శిస్తారు, చించి చెండాడి కూర్చోపెడ్తారు. ఒక పురుషుడువచ్చి అప్పుడప్పుడు చీవాట్లు పెడ్తూ కొంచెం కఠినంగా ఉంటే వాళ్ళు బాగానే ఉంటారు. ఇటువంటి వశీకరణ విధానానికి వాళ్ళు అలవాటుపడిపోయారు.

ఇదేవిధంగా మనంకూడా ప్రవర్తిస్తున్నాము. మనదేశీయు డెవడైనా లేచి నిలబడి గొప్పవాడు కావడానికి ప్రయత్నిస్తే వాణ్ని అణిచివెయ్యడానికి మనమందరమూ పూనుకుంటాము. విదేశీయుడు వచ్చి తన్నడానికి ప్రయత్నిస్తే మనమేమీ చెయ్యం, బాగానేఉంటుంది. దీనికలవాటుపడిపోయాము. అవునా, కాదా?

పరస్పరాసూయ – మన మహాదోషం

మనం కలిసిమెలిసి ఉండలేం, ఒకరి నొకరం ప్రేమించుకోము. అందరం స్వార్థపరులమే. పరస్పర ద్వేషాసూయలు లేకుండా ముగ్గుర మొకచోట వ్యవహరించలేము.

తరతరాలుగా మనలో అసూయ పేరుకుపోయింది. ఒకరిని చూచి ఒకరం అసూయ పడుతుతూనే ఉంటాము. వీడికి ఈ ప్రాముఖ్యా మేమిటి ? నాకు లేకపోవడ మేమిటి? దేవపూజలో కూడా ప్రాముఖ్యంకోసం ప్రాకులాటే! ఇటువంటి దాస్యంలో పడిపోయాం మనం.

ఈ దుర్లక్షణాన్ని విడిచిపెట్టి, కుక్కల్లా కాట్లాడుకోవడం మానివేసి, సత్ప్రయోజనానికై సక్రమ మార్గంలో ధార్మికవీరంతో ధైర్యంగా నిలబడాలి.

దాసుల ముఖాన స్పష్టంగా కనిపించే మచ్చ ఈ అసూయ! దాన్ని ముందు మనం తుడిచివేద్దాము. ఎవరిని చూచీ అసూయపడవద్దు. మంచి చేసేవారి కెవరికైనా సహాయం చెయ్యడానికి సిద్ధంగా ఉండు. మూడులోకాల్లోని ఒక్కొక్క వ్యక్తికీ ఏదైనా సద్భావ మందించు.

## సంఘటిత కార్యనిర్వహణకు అసూయ ప్రధాన ప్రతిబంధకం

వ్యక్తి అయినా జాతి అయినా గొప్పతనాన్ని పొందడానికి మూడు ముఖ్య లక్షణాలు అత్యవసరం.

1. మంచితనాని కున్న మహత్తర శక్తులయందు దృఢమైన విశ్వాసం.
2. అసూయ, అనుమానం బొత్తిగా లేకపోవడం.
3. మంచి చెయ్యడానికీ, మంచిగా ఉండడానికీ యత్నించే వాళ్ళందరకూ సహాయం చెయ్యడం.

అద్భుతమైన తెలివితేటలూ మొదలైన వెన్నో ఉండి హిందూజాతి ఎందు కిలా ముక్కలు ముక్కలైపోయింది ? అసూయ వల్లనే! ఒకరిని చూచి ఒకరు అసూయపడడం, ఇతరుల కీర్తి ప్రతిష్ఠలకు ఈర్ష్య వహించడం ఈ దౌర్భాగ్య హిందూజాతిలో ఉన్నంత మరే జాతిలోనూ

ఉండదు. పశ్చిమ దేశాల్లో ఎక్కడికి వెళ్ళినా ఆ జాతుల్లో ఇది లేకపోవడమే మొదట కనిపించేది.

ముగ్గురు కలిసి అయిదు నిమిషాలపాటు భారతదేశంలో ఒక్కపని చెయ్యలేరు. ప్రతివాడూ అధికారానికి తాపత్రయపడతాడు. దాంతో సంఘటిత సంస్థే విచ్ఛిన్న మవుతుంది.

## ఐకమత్యమూ, సంఘటనా – వీనివల్లనే శక్తి కలుగుతుంది

అథర్వవేద సంహితలోని అద్భుత మంత్రాలలో ఒకటి స్మృతికి వస్తోంది.

సంగచ్ఛధ్వం సంవదధ్వం సం వో మనాంసి జానతామ్
దేవా భాగం యథా పూర్వే సంజానానాముపాసతే॥
(అథర్వ – కాండ – 1)

'ఏక మనస్కులు కండి. ఒకే భావంతో ఉండండి. పూర్వం దేవత లందరూ ఏకమనస్కులై నందువల్లనే హవిర్భాగాలు స్వీకరించగలిగారు. వాళ్ళకున్న ఐకమత్యంచేతనే మనుజులచేత అర్చింపబడుతున్నారు.' ఐకమత్యమే సంఘజీవన రహస్యం.

ఇంతెందుకు? ఒక్క ఉదాహరణ చూద్దాము. నాలుగు కోట్ల ఆంగ్లేయులు ముప్పై కోట్ల ప్రజలను ఎలా పాలించగలిగారు? మనస్తత్వ రీత్యా దీనికి సమాధానం ఏమిటి? ఆ నాలుగు కోట్లమంది ఏకమైన మనో నిశ్చయం కలిగి ఉన్నారు. అంటే మహత్తరమైన శక్తి ఏర్పడిందన్నమాట. ఇటు ముప్పైకోట్ల మందీ తలకొక ఊహతో చెల్లాచెదరై ఉన్నారు. అందుచేత భవిష్యత్తులో ఉజ్జ్వలమైన భారత జాతిని నిర్మించాలంటే ఐకమత్యమూ, సంఘటనా, సర్వశక్తి సమీకరణమూ ఉంటేనే సాధ్య మవుతుంది.

ఆర్య ద్రావిడ, బ్రాహ్మణ బ్రాహ్మణేత్యాది అల్పభేదాలు పురస్క-రించుకుని మనలో మనం కలహించుకుంటూ ఉంటే భవిష్యద్భారత నిర్మాణానికి అవసరమైన శక్తిసామర్థ్యాలు ఇంకా ఇంకా కొరవడి పోతూనే ఉంటాయి. భవిష్యత్ భారతం మన ఏకీభావంమీదనే ఆధారపడి ఉన్నది. ఏకమనస్కత, సర్వశక్తి సమీకరణము, అన్నిటినీ ఒకే లక్ష్యానికి ఉపయోగించడం — ఇదే విజయానికి కీలకం

## మతభూమికపైనే జాతీయ నిర్మాణం జరగాలి

ఇతర దేశాల్లోకంటె భారతదేశంలో సమస్యలు బహుముఖంగానూ, క్లిష్టంగానూ ఉన్నాయి. జాతి, మతం, భాష, ప్రభుత్వం - అన్నీ కలిసే దేశమవుతాయి.

భారతీయుల కందరకూ సమాన భూమికగా ఉన్నది పవిత్ర సంప్రదాయం, అదే మన మతం. అందరికీ సమానమైన ఆ భూమికమీదనే మనం నిర్మాణం చెయ్యాలి. ఐరోపాలో రాజకీయభావాలే జాతీయైకమత్యాన్ని సాధిస్తాయి.

అందుచేత భవిష్యద్భారతానికి మత విషయిక సమైక్యం అవశ్యంగా ఉండితీరాలి. అంటే దేశమంతా ఆసేతు శీతాచలం అందరూ అంగీకరించే మత మొకటి ఉండాలన్నమాట. ఒకే మతమంటే నాతాత్పర్యం క్రైస్తవులూ, మహమ్మదీయులూ, బౌద్ధులూ అనుకునేటటువంటి మతమనికాదు.

## జీవశక్తినిచ్చే సమాన సిద్ధాంతాలను సమీకరించాలి

అంత్య నిర్ణయాల్లో ఎంతవైవిధ్యం ఉన్నా, ప్రాముఖ్యం విషయంలో ఎవరిదృష్టి ఎలా ఉన్నా మన మతంలో ఉన్న వివిధశాఖలవారికీ సమానమైన అంశాలు కొన్ని ఉన్నాయని మనకు తెలుసు. ఆ సమానాంశా

పరిమితిలోనే మనమతం అద్భుతమైన వైవిధ్యానికీ, అనంతమైన స్వాతంత్ర్యంతోడి ఆలోచనతో మన జీవితాలు మనం సమర్థంగా జీవించ డానికీ ఎంతో అవకాశ మిస్తుంది.

అందుచేత మన మతంలోని ఈ జీవశక్తి నిచ్చే సమానసిద్ధాంతాల నన్నింటినీ సమీకరించడమే మనకు కావలసింది. భారతీయు లెల్లరూ స్త్రీ పురుష వివక్ష లేకుండా ఆబాల గోపాలం ఆ సిద్ధాంతాలను తెలుసుకుని, బాగా అర్థంచేసుకుని, జీవితంలో అనుభవానికి తెచ్చుకోవాలి. ఇది మొట్ట మొదటి మెట్టు. అందుచేత దీనికి పూనుకోవాలి.

## మతానికున్న ఏకీకరణ శక్తి

ఆసియాలో, అందులోనూ మన భారతదేశంలో. మతానికున్న ఏకీకరణశక్తిచేత జాతిభేదాలు, భాషా భేదాలు, సాంఘిక సమస్యలు, ప్రాంతీయ సమస్యలు అన్నీ కరిగిపోవడం మనం చూస్తూ ఉంటాము. భారతీయ మనస్సుకు మతంకంటె గొప్ప విషయం మరొకటి ఉండదు. భారతీయ జీవితాని కిదే మూలసూత్రం. దీన్ని అనుసరించే మనం నిరాటంకంగా కృషి చెయ్యగలం.

భారతజాతి విషయంలో మత మన్నింటి కంటె గొప్ప ఆదర్శం కావడమే కాక మతమే సమస్తానికీ సాధనం. మతాన్ని పటిష్ఠం చెయ్యకుండా మరొక మార్గంలో అభ్యుదయానికి కృషిచేస్తే వైఫల్యమే ఎదురవుతుంది. అందుచేత భవిష్యద్భారత నిర్మాణానికి చెయ్యవలసిన మొదటి పని సర్వ జనాచరణీయమైన సమాన సిద్ధాంతాలతో మతైక్యాన్ని సాధించడమే.

## చెదరి ఉన్న ఆధ్యాత్మిక శక్తులను సమీకరించాలి

ద్వైతులలో, అద్వైతులలో, శైవులలో, వైష్ణవులలో, పాశుపతులలో ఏ విభాగానికి చెందిన వారైనా అందరూ హిందువులే. ఈ విషయం మనకు

మనమే బోధించుకోవాలి. మనలో మనకు ఎన్ని విభేదాలు ఉన్నా అందరికీ సమానమైన అంశాలు కొన్ని ఉన్నాయనీ, మన క్షేమానికీ, దేశ క్షేమానికీ అల్ప భేదాలను పురస్కరించుకుని మనలో మనం కలహించడం మాని వెయ్యాలనీ ఇప్పటికైనా గ్రహించాలి.

పైగా ఈ కలహాలు నిరాధారమైనవి. మన శాస్త్రాలు కంఠోక్తిగా ఖండిస్తున్నాయి. మన పూర్వులు తీవ్రంగా నిషేధించారు. వాళ్ళ నెత్తురు మన శరీరాల్లో ప్రవహిస్తూ ఉండగా వాళ్ళ సంతతివారమని చెప్పుకుంటూ వాళ్ళ ఉపదేశాలను మనం నిర్లక్ష్యం చేసి పరస్పరం కలహిస్తూ ఉంటే వాళ్ళు మనలను హేయంగా చూడరా ?

భారతదేశంలో జాతీయైక్య మంటే చెదరి ఉన్న ఆధ్యాత్మిక శక్తులను సమీకరించడమే అవుతుంది. ఒకే ఒక ఆధ్యాత్మిక లక్ష్యానికి స్పందించే హృదయాల సమైక్యంలోనే భారతదేశ జాతీయత ఉన్నది.



# పునరుజ్జీవన మహాకార్యం-2

## ఆచరణ ప్రణాళిక

'కలియుగంలో మానవు లాచరింపదగిన కర్మ దాన మొక్కటే. ఆత్మ విద్యాదానం అన్ని దానాల్లోకి శ్రేష్ఠమైనది. లౌకిక విద్యాదానం రెండవది. ప్రాణదానం అంటే ప్రాణాపాయస్థితిలో ఉన్నవారిని సంరక్షించడం మూడ వది. ఆకలి గొన్నవారికి అన్నదానం చెయ్యడం నాల్గవది' అని వ్యాసుల వారు బోధిస్తున్నారు.

అన్నదానం మనం సమృద్ధిగానే చేశాము, చేస్తున్నాము. ఈ విష యంలో మనకంటె ఉదారమైన జాతి మరొకటి లేదు. తనకు తినడానికి ఉంటె ఉన్నదాంట్లో ఇతరులకు పెట్టడం భారతీయుని స్వభావం. ఈ విశిష్ట మైన సత్కార్యం భారతదేశంలోనే పాటింపబడగలదు. ఇది చాలినంత జరుగు తోంది కాబట్టి ఆత్మవిద్యా, లౌకికవిద్యా దానాల నాచరించడానికి పూనుకుందాము.

మన మందరమూ ధైర్యవంతులమై గుండె నిబ్బరంతో హృదయ పూర్వకంగా ఏకమై కృషిచేసినట్లయితే పాతిక సంవత్సరాల్లో జాతి నావరిం చిన అజ్ఞానం పూర్తిగా తొలగిపోతుంది. తిరిగి భారతజాతి యావత్తూ ఆర్యజాతి అవుతుంది.

## దాన చతుష్టయం

మహాభారత స్మృతికర్త అయిన వ్యాసమహర్షికి నమస్కారము. ఈ కలియుగంలో ఐహికాముష్మిక శ్రేయస్సుకై మానవు లాచరింపదగిన కర్మ ఒక్కటే ఉన్నది. ఇతర యుగాల్లో ఆచరణ యోగ్యాలయిన తపస్సు మొదలైనవి, ఈ యుగంలో కుదరవు. ఇందులో చెయ్యదగింది దాన మొక్కటే !

దాన మంటే ఏమిటి ? దానాల్లో శ్రేష్ఠమైనది ఆత్మవిద్యాదానము. తరువాత లౌకికవిద్యా దానము. తరువాత ప్రాణదానము. చివరకు అన్నదానము.

ఆత్మవిద్యాదానం చేసినవాడు పొందిన జీవుణ్ని జన్మ పరంపరనుండి ఉద్ధరించినవాడవుతాడు, లౌకికవిద్యాదానం చేస్తే ఆత్మవిద్య కభిముఖంగా ప్రయాణం చేయగలిగేటందుకు మానవుల కళ్లు తెరిచినవా డవుతాడు. ప్రాణదానంతోపాటు తక్కిన దానాలన్నీ వీటికంటె తక్కువవే. అందుచేత తక్కిన పనులు చెయ్యడంకంటె ఆత్మవిద్యాదానం సర్వశ్రేష్ఠమని గ్రహించి దానికై కృషి చెయ్యాలి.

జీవితంలో మన చేష్టల కన్నింటికీ ఆధ్యాత్మికత్వమే మూలహేతువు కాబట్టి ఆధ్యాత్మిక విషయాల్లో మానవునకు సహాయపడేవాళ్ళే లోకోత్తర శక్తిమంతులుగా గణింపబడుతూ ఉంటారు నిజానికి ఆత్మ విద్యాదానం చేసేవారే మానవజాతికి మహోపకారులు. ఆధ్యాత్మిక శక్తి సామర్థ్యాలు సాధించిన వ్యక్తి తాను కోరితే ఏ విషయంలోనైనా శక్తిమంతుడుగానే ఉండగలడు. ఆధ్యాత్మిక శక్తి లేకపోతే దైహిక ప్రయోజనాలను గూడా సమృద్ధిగా పొందలేడు.

—oo—

# ఆధ్యాత్మిక విజ్ఞానవ్యాప్తి

## శ్రేష్ఠదానం

దానశీలమైన ఈ దేశంలో శ్రేష్ఠదానం చెయ్యడానికి అంటే ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సర్వేసర్వత్రా వెదజల్లడానికి మనం ఉత్సాహంతో పూనుకుందాము. అయితే ఈ విజ్ఞానవ్యాప్తి భారతదేశపు సరిహద్దులకే పరిమితం కాకూడదు. సర్వ ప్రపంచానికీ అందించాలి ఇది మన సంప్రదాయం.

భారతదేశం దాటి మన జాతీయ భావాలు పోలేదనీ, విదేశాలకు వెళ్ళిన మొదటి సన్న్యాసిని నేనే ననీ చెప్పేవాళ్ళకు వాళ్ళజాతి చరిత్రే తెలియదు. అన్య దేశాలకు మన విజ్ఞానాన్ని అందించడం ఎన్నో పర్యాయాలు జరిగింది ప్రపంచాని కవసరమైనప్పుడల్లా ఈ దేశంలో నిత్యమైన ఆధ్యాత్మిక విజ్ఞాన స్రవంతి పొంగిపొరలి ప్రపంచాన్ని ముంచెత్తి వేసింది.

## ఇంటింటికీ మతాన్ని ఉచితంగా అందించాలి

భారతదేశంలో మతం చాలాకాలంబట్టీ జడమై పడి ఉన్నది. మన కిప్పుడు కావలసింది దాన్ని చైతన్యవంతం చెయ్యడమే. ప్రతి వ్యక్తి జీవితంలోనూ అది ప్రాముఖ్యం వహించడమే నేను కోరేది. రాజుల దివ్య

భవనాల్లోకీ పేదవాళ్ల గుడిసెలలోకీ తేడా లేకుండా పూర్వం ప్రవేశించినట్లే ఇప్పుడూ మతం ప్రవేశించాలి.

సమాన పిత్రార్జితమై జాతి కంతకూ జన్మహక్కైన మతాన్ని ఇంటింటికీ ఉచితంగా అందించాలి. దైవదత్తమైన గాలివలె ఈ దేశంలో మతం అందరికీ అందుబాటులోకి రావాలి. ఇప్పుడు మనం చెయ్యాయవలసింది ఇటువంటిదిగాని చిన్న చిన్న సంఘాలు పెట్టి భిన్నాభిప్రాయాలతో కలహించడం కాదు. అందరూ అంగీకరించేవాటినే మనం బోధిద్దాము.

## సత్యాన్ని ప్రకటించు – మౌర్ఖ్యం తొలగిపోతుంది

ఎన్నో శతాబ్దాలుగా ఒక గదిలో చీకటి ఉన్నదనుకోండి. ఆ గదిలోకి వెళ్లి 'అంతా చీకటిగా ఉన్నది. కారుచీకటి. ఛీ! ఛీ!' అని ఎంత అరిచినా చీకటి పోతుందా? దీపాన్ని తీసుకువెళ్తే చీకటి పోక తప్పదు. అజ్ఞులైన మానవులను సంస్కరించడం కూడా ఈ పద్ధతిలోనే జరగాలి.

ఒక వ్యక్తిలో అనేక లోపాలు ఉండవచ్చు. అతడెన్నో తప్పులు చేస్తూఉండవచ్చు అతనిలో పరమ మూర్ఖమైన విశ్వాసాలు పాతుకుని ఉండవచ్చు. అయినా అతను మానవుడు. సర్వజ్ఞమైన ఆత్మ అతనిలోనూ ఉన్నది. అందుచేత ఇవన్నీ అతని సహజ ప్రకృతిలో ఉన్న లక్షణాలు కావు. ఉత్తమాదర్శాలు లేకపోవడం చేతనే అతనిలా తయారయ్యాడు. ఈ నమ్మకం మనకుండి మానవత్వంలో అచంచల విశ్వాసం ఉంచగలిగితే ఎవరినైనా సంస్కరించవచ్చు.

అతనికి సత్యాన్ని ప్రకటించు. అంతే నీవు చేయవలసింది. తానిదివరకు ఉంటున్న పరిస్థితికీ ఇప్పుడు నీవు తెలిపిన సత్యానికీ ఉన్న భేదం పోల్చి చూచుకుని అతనంతట అతనే మారిపోతాడు. ఇందులో సందేహం లేదు. నీవు నిజంగానే సత్యాన్ని తెలిపి ఉంటే అజ్ఞానం అదృశ్యమై

తీరాలి. వెలుతురువల్ల చీకటి పోక తప్పదుగదా! సత్యం మంచి నావిష్క-రించి తీరుతుంది.

ఆధ్యాత్మికంగా దేశాన్ని సంస్కరింపదలిస్తే ఈ మార్గమే అనుసరణీయం. వాదోపవాదాలతో కలహించడమూ కాదు, ప్రజ లాచరిస్తున్నది తప్పని నిందించడమూ కాదు. చక్కని ఆదర్శం వాళ్ళ ముందు ఉంచితే వాళ్ళే ఎంత ఆతురతతో స్వీకరిస్తారో చూడండి. మానవునిలో ఎల్లప్పుడూ ఉండే దివ్యత్వం ప్రబుద్ధమై ముందుకు వచ్చి ఉజ్జ్వలమైన మంచిని అవశ్యంగా స్వీకరిస్తుంది.

దాగిఉన్న తత్త్వ చింతామణులను
వెలికితీసి పంచిపెట్టాలి.

మన గ్రంథాల్లో సమృద్ధిగా ఉన్న తాత్త్విక భావమణు లన్నిటినీ పైకి తీసి అందరికీ అందుబాటులోకి తేవాలని నా ఉద్దేశ్యం. అవన్నీ అడవుల్లోనూ, ఏకాంత మత సంస్థలలోనూ దాచిపెట్టబడ్డట్లుగా ఏ కొందరు వ్యక్తుల స్వాధీనంలోనో ఉండి ప్రజలకు దూరంగా ఉన్నాయి. అవి అలా ఉండడానికి ఆ వ్యక్తులే కాదు, కొన్ని శతాబ్దాలుగా ఘనీభవించిన సంస్కృత భాషకూడా హేతువు. వ్యక్తులనుండీ భాషనుండీ వాటి నావిష్క-రించి సర్వజన సులభం చెయ్యాలి.

ఈపని చెయ్యడంలో మనకెక్కువ కష్టాన్ని కలిగించేది ఆసంస్కృత భాషే. ఆ భాష మనకున్న భాషలలో మహోజ్జ్వలమైనది, దివ్యమైనది. భారతజాతీయు లందరూ సంస్కృతపండితు లైతేనేగాని ఈ కష్టం తొలగదు.

సంస్కృత భాషా ప్రచారం అవసరం

నే నీ భాషను జీవితమంతా అభ్యసిస్తూనే ఉన్నా ఎప్పటికప్పుడు ప్రతి పుస్తకమూ కొత్తగానే ఉంటూ ఉంటుంది. దీన్నిబట్టి ఇందులో ఉన్న

కష్టం మీరు గ్రహించగలరు. నాకే ఇలా ఉన్నప్పుడు మన జనసామాన్యం యావత్తూ ఈ భాషను పూర్తిగా అభ్యసించాలంటే ఎంత కష్టమవుతుందో చెప్పలేము. అందుచేత సంస్కృత గ్రంథాలలో ఉన్న అమూల్య భావాల నన్నింటినీ ప్రాంతీయభాషల్లో ప్రజల కందించాలి. దాంతోపాటే ప్రజలకు సంస్కృతమూ నేర్పుతూ ఉండాలి. సంస్కృత శబ్దోచ్చారణే జాతికి శక్తి సామర్థ్యాలనూ ప్రతిష్ఠనూ కలిగిస్తుంది.

రామానుజులూ, చైతన్యులూ, కబీరు మొదలైన మహానుభావులు జనసామాన్యాన్ని ఉద్ధరించడానికి చేసిన ప్రయత్నాలవల్ల వారివారి జీవిత కాలాల్లో అత్యద్భుతమైన ఫలితాలే కలిగాయి. అయినా వారి ఉపదేశాల ఫలితం జాతిలో ఆట్టేకాలం నిలవలేదు. వారు గతించిన తర్వాత వంద సంవత్సరాలు జరగకుండానే జనసామాన్యం యథా పూర్వస్థితికి వచ్చేసింది. దీనికి కారణమేమిటో అన్వేషించాలి.

## సాధించిన అభివృద్ధి సంస్కృతంవల్ల స్థిరపడుతుంది

అసలు రహస్యం ఇక్కడ ఉన్నది. వారు సామాన్యజనుల నుద్ధరించారు. వీరు పైకిరావాలని వారెంత కాంక్షించినా జనసామాన్యంలో సంస్కృతభాషా వ్యాప్తికి వారేమీ కృషిచెయ్యలేదు. జనసామాన్యంచేత సంస్కృత భాషాభ్యాసం మానివేయించడంలో అంత గొప్పవాడైన బుద్ధుడు కూడా పొరపాటే చేశాడు.

ఆయన ప్రజల భాషలో మాట్లాడాడు. ప్రజలు ఆయనను అర్థం చేసుకున్నారు. ఇది చాలా గొప్పవిషయమే. ఈ పని చేసినందువల్ల భావ వ్యాప్తి తేలికగా జరిగింది. ఎక్కువమందికి అందించడానికి వీలయింది. దీంతోపాటు సంస్కృతభాషా బోధకూడా జరిగి ఉండవలసింది. అది జరగనందువల్ల జ్ఞానం కలిగినా ప్రతిష్ఠ ఏర్పడలేదు, సంస్కృతి కలగలేదు. వ్యతిరేకశక్తులను సంస్కృతి తట్టుకోగలదుకాని వట్టి జ్ఞానంకాదు.

జనసామాన్యానికి వాళ్ళభాషలో బోధించి భావాలు అందిస్తే వాళ్ళకు విషయ పరిజ్ఞానం కలుగుతుంది. అంతమాత్రంతో సరిపోదు. తెలిసిన జ్ఞానం సంస్కృతంగా పరిణమించాలి. అది జరిగేవరకూ జనసామాన్యం పొందే అభివృద్ధి నాలుగు కాలాలపాటు నిలబడదు. దానికి మన మిచ్చే జ్ఞానానికి మూలమైనసంస్కృత భాష బోధింపబడాలి.

### మన జ్ఞానానికి తరగని పెన్నిధి

ఉపనిషత్తులే మనకు ప్రమాణ గ్రథాలు.

ఎవరు ఏ తత్త్వానికి చెందిన వారైనా భారతీయు లందరూ తమ తమ విశ్వాసాలకు ఉపనిషత్తులనే ప్రమాణంగా భావిస్తారు. ఎవరి విశ్వాసానికైనా వాటిల్లో ఆధారం లభించకపోతే వాళ్ళు సనాతనులు కారన్నమాటే. అందుచేత హిందూమతంలోని వివిధ శాఖలవారినీకూడా వేదాంతులనీ, వైదికులనీ పిలువవచ్చు. నేను ఈ దృష్టితోనే వేదాంతము, వేదాంత మతము అన్న మాటలు వాడుతూ ఉంటాను.

బౌద్ధులూ, జైనులూ వ్రాసిన తాత్త్విక రచనల్లో కూడా శ్రుతి సహాయం ఎన్నడూ తిరస్కరింప బడలేదు. బ్రాహ్మణులచేత కల్పింపబడిన వని వాళ్ళనుకునే హింసక శ్రుతులు మినహాయించి తక్కిన శ్రుతుల నన్నిటినీ బౌద్ధులలో కొందరూ, జైనులలో అధిక సంఖ్యాకులూ ప్రమాణాలుగా పూర్తిగా అంగీకరించారు.

### జాతికి బలాన్నిచ్చేవి ఉపనిషత్తులే

ఉపనిషత్తులలో ప్రతి పంక్తి బలాన్ని పెంచుకోమని ఉద్బోధిస్తుంది. ఈ మహావిషయాన్ని ఎన్నడూ విస్మరించకూడదు. నా జీవితంలో నేను గ్రహించిన పరమ సత్యమిదే: ఓయి మానవా! బలవంతుడవు కా! దుర్బలుడవు కాకు!

కడచిన వేయి సంవత్సరాలుగా మన జాతిని నిర్వీర్యం చెయ్యడానికి ఎన్నెన్ని కావాలో అన్నీ తటస్థపడ్డాయి. జాతీయ జీవితానికి దౌర్బల్యం పొందడమే లక్ష్యమా అన్నట్టు ప్రవర్తించి చివరకు మన నెత్తిన కాలు పెట్టడానికి సాహసించిన ప్రతివ్యక్తికాళ్లూ పట్టుకుని ప్రాకులాడే వాన పాములకంటే కనాకష్ట మయ్యాము.

అందుచేత, స్నేహితులారా! మీలో ఒకణ్నై, మీతోపాటుగానే బ్రతికి మరణించే నేను మీ అందరికీ ఈ హెచ్చరిక చేస్తున్నాను. మనకు కావలసింది బలం, బలం, మున్మాటికీ బలం! జాతికి బలాన్నిచ్చేవి ఉపనిషత్తులే! అవి బలానికి తరగని పెన్నిధులు. సర్వ ప్రపంచాన్నీ చైతన్యవంతం చెయ్యగల బలం వాటిల్లో ఉన్నది. వాటిద్వారా ప్రపంచం సజీవమై శక్తి తెగ్గని ఉత్సాహంతో ప్రవర్తించగలదు.

జాతి మత వివక్ష లేకుండా సర్వ ప్రపంచానికి చెందిన పీడులనూ, పతితులనూ, దుర్బలులనూ అందరినీ అవి 'మీ కాళ్ళ మీద మీరు నిలబడి స్వతంత్రులు కండి. మీ దుస్థితికి మీరే కారణం. మిమ్మల్ని మీరే ఉద్ధరించుకోవాలి' అని శంఖాన్ని పూరించి హెచ్చరిక చేస్తున్నాయి.

## ఉపనిషత్తులు - ఏకాంతజీవనుల కొక్కరికే కాదు

'ఉపనిషత్తులు సన్న్యాసులకే; అవి రహస్యం' అన్న అభిప్రాయం సరియైనది కాదు. సన్న్యాసుల స్వాధీనంలోనే ఉపనిషత్తులు ఉంటున్నాయి. వారు ఏకాంతజీవనులై అరణ్యాల్లో నివసిస్తున్నారు. ఆది శంకరులు కొంచెం దయదలచి 'గృహస్థులు కూడా ఉపనిషత్తులు చదువవచ్చు. దాని వల్ల మంచే జరుగుతుందిగాని హాని జరగదు' అని అనుగ్రహించారు. అయినా మనకు అవి అరణ్యాల్లో నివసించే ఏకాంతజీవనులకొరకే అన్న అభిప్రాయం వదలలేదు.

వేదాలకు ప్రమాణభూతమైన వ్యాఖ్యానం ఒక్కటే ఒకటి ఉన్నది. అది ఆ వేదాలనే స్ఫురింపజేసిన భగవంతుడైన శ్రీకృష్ణుడే చెప్పిన భగవద్గీత. అందులో వివిధవృత్తులలో జీవిస్తున్న వ్యక్తులందరికీ ఉపదేశం ఉన్నది. ఇక ఈ వేదాంత సత్యాలు అడవుల్లోనూ, గుహల్లోనూ, దాగి ఉండగూడదు. అవి బైట పడి గుడిలో, మడిలో, పొలాల్లో, గుడిసెల్లో, పడవలలో, నడవలలో ఏ వృత్తిలో ఉన్నా, ఎక్కడ ఉన్నా, వారూ వీరూ అన్న విచక్షణ లేకుండా అందరికీ అందాలి. అందరూ వేదాంతమార్గాన్ని అనుష్ఠించేవాళ్ళు కావాలి

## ఉపనిషత్తు లుద్ధరిస్తాయి ఏ స్థితిలో ఉన్న వ్యక్తినైనా

చేపలు పట్టేవాడికీ, చెప్పులు కుట్టేవాడికీ, వేదాంతం చెప్పితే వాళ్లు దాన్ని ఎలా అనుష్ఠిస్తారు ?

ఈ ప్రశ్న పుటవలసిన అవసరం లేదు. మార్గం చూపబడేఉన్నది.

చేపలు పట్టేవాడు తాను ఆత్మ నని తెలుసుకుంటే ఆ వృత్తిలోనే వాడు మరింత సమర్థు డవుతాడు. విద్యార్థి తెలుసుకుంటే ఉత్తమ విద్యార్థి అవుతాడు. న్యాయవాది తెలుసుకుంటే ఉత్తమ న్యాయవాది అవుతాడు. ఇలాగే సర్వులూనూ.

## ఆత్మ సర్వజ్ఞమూ, పరిపూర్ణమూ అని చెప్పే సిద్ధాంతం పరమాద్భుత మైనది

అనంతమై దివ్యమైన పరమాత్మ జ్యోతిస్సునుండి వెలువడిన కిరణాలము మనము. మనము వ్యర్థుల మెలా అవుతాము ? సమస్తమూ మనలోనే ఉన్నది, మనమే సమస్తమూ, మన మేమైనా చెయ్యగలం. మానవు డేమైనా చెయ్యాలి.

అందుచేత, సోదరులారా! జీవశక్తినిచ్చి ఉత్తేజపరిచే ఈ మహత్తర సత్యాన్ని మీ బిడ్డలకు పుట్టినప్పటి నుండి బోధించండి. వాళ్ళకు అద్వైతమే చెప్పనక్కరలేదు. ద్వైతమో మరొకటో ఏది ఇష్టమయితే అది చెప్పండి. కాని అందరికీ సమానమైన ఈ అంశం ఉన్నది గదా: 'ఆత్మ ఉన్నది; అది సర్వజ్ఞము, పరిపూర్ణము. ఆత్మ స్వరూపులమే మనము.' అన్న ఈ మహత్తర సత్యాన్ని దేశంలో ఏ విభాగానికి చెందిన వారైనా అంగీకరిస్తూనే ఉన్నారు.

మన పూర్వుల హృదయాల్లో ఈ ఆత్మవిశ్వాసం దృఢంగాఉండేది. ఈ ఆత్మవిశ్వాసమే నాగరకతా ప్రస్థానంలో వాళ్ళచేత ముందడుగు వేయించి మహోన్నత శిఖరాల నందుకునేటట్లు చేసింది. మన ప్రజలు ఈ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన నాటినుంచే పతనం చెందారు. ఇదే మనలో ఉన్న ప్రధానమైన లోపం. ఆత్మవిశ్వాసం లేకపోవడ మంటే భగవంతునిలో నమ్మకం లేకపోవడమే.

## మానవ విశ్వాస మహత్తర శక్తి

పశ్చిమ దేశాల్లో నేను నేర్చుకున్న దేమిటి? మానవుడు పతితుడనీ, అధఃపతనం చెందిన మహాపాపి అనీ క్రైస్తవ మతగ్రంథాలు పదే పదే చెప్తూ ఉండగా ఆ ప్రజలు వాటి నెలా స్వీకరించారు? ఐరోపా అమెరికాల్లోని జనుల హృదయాలలో ఆత్మవిశ్వాస మహత్తర శక్తి స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది.

ఆంగ్లేయ బాలుణ్ని ఎవరిని కదిలించినా 'నేను ఇంగ్లీవాణ్నే: నే నేమైనా చెయ్యగలను' అని ధైర్యంగా చెప్తాడు. అమెరికన్ బాలుడూ అలాగే అంటాడు. ఐరోపాలో ఏ జాతికి చెందిన బాలుడైనా అలాగే అంటాడు. మనదేశంలో పిల్లలు అలా చెప్పగలరా? వాళ్ళు చెప్పలేరు

సరిగదా ఆ పిల్లల తండ్రులు గూడా చెప్పలేరు. మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయాము.

భగవంతుడు మనలోనే ఉన్నాడనీ, అంతటా అంతర్యామియై ఉన్నాడని చెప్పని మతసంస్థ భారతదేశంలో లేదు. వేదాంత తత్త్వవేత్త లందరూ ఆత్మ సర్వజ్ఞమనీ, పరిపూర్ణమనీ, సమస్తశక్తులూ అందులోనే ఉన్నాయనీ అంగీకరిస్తారు. అయినా ఎందుచేతనో మనం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోవడం తటస్థించింది.

అందుచేత మనయందు మనం విశ్వాసాన్ని పెంపొందించుకునే ఆదర్శం మనకిప్పు డెంతో సహాయం చేస్తుంది. ఆత్మవిశ్వాసం అత్యుత్త మాదర్శమని అందరికీ బోధించి, దాన్నే ప్రజలచేత అభ్యసింపజేసినట్లయితే ఇప్పుడు మనకున్న అనర్థాలూ, కష్టాలూ ముప్పాతిక మూతువంతులు అదృశ్య మయిపోయేవి. మానవజాతి చరిత్రలో గొప్పవాళ్ళ జీవితాలను పరిశీలిస్తే వాళ్ళనంత గొప్పవాళ్ళను చేసిన మహత్తరశక్తి ఆత్మవిశ్వాసమే అన్నది స్పష్టమవుతుంది. తాము గొప్పవాళ్ళం కావాలన్న పరిజ్ఞానంతో పుట్టారు, గొప్పవాళ్ళయ్యారు.

## మామూలు గుమాస్తా సామ్రాజ్య నిర్మాత అయ్యాడు

మానవు డెంత అధఃపతనమైనా చెందనీ; ఒకానొకప్పుడు వాని జీవితంలో కేవలం నిస్పృహవల్లనే పరిణామం కలిగితీరుతుంది. అప్పు డతను ఆత్మవిశ్వాసం నేర్చుకుంటాడు. అంతవరకూ ఆగకుండా మొదటి నుంచీ దాన్ని అభ్యసించడం ఎంతో మంచిది. ఆత్మవిశ్వాస మాహాత్మ్యం తెలిసి అది లభించేటందుకు దుర్లభమైన అనుభవాలన్నీ ఎందుకు పొందాలి? ఒక మనిషికీ మరొక మనిషికీ ఉన్నభేదం ఆత్మవిశ్వాసం ఉండడమూ, లేకపోవడమూ అన్నదాన్నిబట్టే కలుగుతోందని స్పష్టంగా తెలుస్తూనే ఉన్నదికదా!

ఈ మన భారతదేశానికి ఒకానొక ఇంగ్లీషువాడు మామూలు గుమా స్తాగా వచ్చాడు. డబ్బుబాలకా, ఇతర కారణాలచేతా? ఒకటి రెండుమాట్లు ఆత్మహత్యా ప్రయత్నాని కుద్యుక్తుడయ్యాడు. వైఫల్యం పొందడంతో అతనిలో అతనికి విశ్వాసం కలిగింది. మనం గొప్పవాళ్ళ మయ్యేందుకే జన్మించామని గట్టిగా నమ్మాడు. ఆ మనిషే సామ్రాజ్యనిర్మాత అయిన క్లైవు ప్రభువు!

## ఆచరణలో అద్వైతం

అందుచేత నిన్ను నీవు నమ్ముకో. నీకు భౌతి కైశ్వర్యం కావాలా; దానికై కృషిచెయ్యి, అది నీకు లభిస్తుంది. ధీమంతుడవు కాదలిస్తే ఆ మార్గంలో కృషిచెయ్యి. త్వరలోనే మహా ధీమంతుడ వవుతావు. స్వాతంత్ర్యం పొందగోరి ఆధ్యాత్మికంగా కృషిచేస్తే ఇక్కడనే ఈ జీవితం లోనే సర్వ బంధవిముక్తుడవై జీవన్ముక్తుడ వవుతావు. నిత్య నిరతిశయా నంద నిర్వాదపదవి నీకు లభిస్తుంది;

ఇన్నాళ్ళుగా అద్వైతం ఆధ్యాత్మిక పథంలో తప్ప ఇతరత్రా అభ్యసింపబడకపోవడమే పెద్ద లోపంగా కనిపిస్తోంది. అద్వైతాన్ని నిత్య జీవితంలో అందరూ అనుష్ఠింపవలసిన తరుణ మిప్పుడు వచ్చింది. అడవు ల్లోనూ, హిమాలయాల్లోనూ నివసించే సన్న్యాసులకు మాత్రమే పరిమిత మైన రహస్యంగా ఇకమీద అది ఉండకూడదు. అది ప్రజల దైనందిన జీవితంలోకి ప్రవేశించాలి. రాజసౌధాల్లో, ఏకాంతవాసుల గుహల్లో, పేద వాళ్ళ గుడిసెలలో, సర్వే సర్వత్రా వారూ వీరూ అన్న భేదం లేక అందరి చేతా అనుష్ఠింపబడాలి,

# లౌకిక విద్యావ్యాప్తి

## పశ్చిమజాతుల అభివృద్ధికీ, సమైక్యానికీ విస్తృత విద్యా వ్యాప్తియే హేతువు

ప్రాక్పశ్చిమాల కున్న భేదమంతా ఇందులోనే ఉన్నది. వాళ్ళవన్నీ జాతులు. మనకు జాతీయ భావనమే లేదు. అంటే నాగరకతా, విద్యా పశ్చిమజాతుల్లో అందరికీ లభ్యమవుతాయి, జనసామాన్యంలోకి గూడా వ్యాపిస్తాయి. భారతదేశంలోనూ, అమెరికాలోనూ సంఘంలో ఉత్తమ స్థితితో ఉన్నవాళ్ల సమానంగానే ఉంటారు. కాని తక్కువ స్థితిలో ఉన్న ఉన్నవాళ్ల విషయంలోనే ఉభయదేశాలకూ ఎంతో తేడా ఉంటుంది. భారత దేశాన్ని జయించడం ఇంగ్లీషువాళ్ల కంత తేలిక ఎందుకయింది? వా ళ్ళొక జాతిగా ఉన్నారు. మనం కాము. ఇదే హేతువు.

మనలో ఒక గొప్పవాడు చచ్చిపోతే మళ్లీ అటువంటివాడు రావ డానికి శతాబ్దాలు పట్టుతాయి. వాళ్ళ దేశాల్లో పోయినవాడి స్థానాన్ని మరొకరు వెంటనే ఆక్రమించగలరు. మన కీ గొప్పవాళ్ళ కరు వెందుకు వచ్చింది? వాళ్ళ కెందుకు లేదు. గొప్పవాళ్లు బయలుదేరే విద్యావంతమైన జాతి వాళ్ళ కున్నంత విస్తృతంగా మనకు లేదు. ముప్పై నలభై లక్షల జనసంఖ్య గల ఆయా జాతులలో ఉన్న విద్యావంతులు ముప్పైకోట్ల జన మున్న మన జాతిలో లేరు. ఈ మాట అంటున్నందుకు నన్ను దురర్థం చేసుకోకండి. మనజాతి కున్న పెద్ద లోపమిది. దీన్ని వెంటనే తొలగిం

చాలి. జనసామాన్యం విద్యావంతమై ఉద్ధరింపబడ్డప్పుడే జాతీయ భావాని కవకాశం ఉంటుంది.

'మాతృదేవో భవ! పితృదేవో భవ!' అన్న ఉపనిష దుపదేశం మీకు తెలిసే ఉంటుంది. నేను వాటికి మరిరెండు కలుపుతాను. దరిద్రదేవో భవ! మూర్ఖదేవో భవ! పేదలూ, విద్యావిహీనులూ, అజ్ఞులూ, ఆర్తులూ మొదలైన వాళ్ళందరినీ దేవతలుగా భావించండి. వాళ్ళకు సేవ చెయ్యడమే అత్యుత్తమ మతానుష్ఠాన మని గ్రహించండి.

## ప్రస్తుత విద్యావిధానం – నీరసమూ, నిర్జీవమూ

ప్రస్తుత విద్యావిధానంలో కొన్ని మంచి విషయాలు ఉన్నా ఉన్న మంచి నెందుకూ పనికిరాకుండా చేసే మహాదోషం ఒకటి ఉన్నది. మొట్ట మొదట ఇది మనిషిని సంస్కరించి సమర్థుణ్ని చేసే విద్యకాదు. పైగా ఉన్న సామర్థ్యాన్ని పోగొట్టి నిర్వీర్యుణ్ని చేసే విద్య, వ్యతిరేక విద్యగాని, వ్యతిరేకతనే ఆధారం చేసుకున్న శిక్షణగాని మృత్యువుతో సమానం. బడికి వెళ్ళిన ప్రతివాడూ మొదట నేర్చుకునేది వాడి తండ్రి మూర్ఖుడనీ, తరువాత వాడి తాత పిచ్చివాడనీ, తరువాత వాడి గురువు అందరూ ద్రోహులనీ, చివరకు వాడి పవిత్ర గ్రంథాలన్నీ అబద్ధాల పుట్టలనీ! వాడికి పదహారేళ్ళు వచ్చేసరికి తన జాతికి పరాఙ్ముఖుడై, తనయందు తనకు విశ్వాసం లేక, నీరసం పట్టి నిర్జీవుడై పోతున్నాడు.

మన దేశంలో గొప్పవాళ్ళు పుట్టారన్న పరిజ్ఞానమే మనకు కలిగించడం లేదు. మన జాతీయ భావానికి అనుకూలమైనది ఏదీ బోధింప బడడం లేదు. మన చేతులూ, కాళ్లూ ఎలా ఉపయోగించుకోవాలో మనకు తెలియదు. ఇంగ్లీషువాళ్ళ పూర్వులను గూర్చిన తబిసీళ్ళన్నీ వల్లెవేస్తాము, మనవాళ్ళను గూర్చి బొత్తిగా నిర్లక్ష్యం చేస్తాము. దీంతో మనం దౌర్బల్యమే నేర్చుకున్నాము. పరాధీనజాతి అయినందువల్ల మనం బలహీనుల మనీ

మన కెందులోనూ స్వాతంత్ర్యం లేదనీ నమ్మే పరిస్థితికి వచ్చేసేశాము. ఇక మనలో శ్రద్ధ నశించ కేం చేస్తుంది.

## ఆదర్శాల నందించి శీలాన్ని నిర్మించేదే విద్య

వట్టి విషయ పరిజ్ఞానాన్ని బుఱ్ఱల్లోకి కుక్కి స్వాస్థ్యం చెడగొట్టి జీవితాన్ని గందరగోళం చేసేది విద్యకాదు. మనిషిని సంస్కరించి శీలవంతుణ్ని చేసి చైతన్యంతో జీవితంలో నిలబడగలిగేటట్లు చేసే ఉత్తమ భావాలు ఒంటబట్టించే విద్యకావాలి. నాలుగైదు ఉత్తమ భావాలు ఒంటబట్టి శీలవంతుడైన వాడు ఒక పెద్ద గ్రంథాలయం యావత్తూ వల్లెవేసిన వాడికంటె ఉత్తమ విద్యావంతుడనడంలో సందేహం లేదు.

అందుచేత మనదేశంలో విద్య యావత్తూ ఆధ్యాత్మిక విద్యగాని, లౌకిక విద్యగాని మనచేతుల్లో ఉండాలి. ఆచరణసాధ్య మైనంతవరకు జాతీయపద్ధతులనే అనుసరిస్తూ జాతి యౌన్నత్యాన్ని ప్రబోధించాలి. ఇదే మన ఆదర్శం.

## పేదలను విద్యావంతులను చెయ్యడంలో ఉన్నకష్టం

పేదలను విద్యావంతులను చెయ్యడంలో ఒక పెద్ద కష్టమే ఎదుర్కోవలసి ఉంటుంది.

ప్రతి గ్రామంలోనూ ఉచితంగా విద్యచెప్పే పాఠశాలలు పెట్టామన్నా పేదవాళ్ళ బిడ్డలు తమతమ పనులలోకి వెళ్తారుగాని పాఠశాలలకు రారు. వాళ్ళను పాఠశాలలకు రప్పించడమూ కష్టమే, అన్ని పాఠశాలలను స్థాపించడానికి కావలసిన ధనమూ మనదగ్గర లేదు. సమస్యకు పరిష్కారమార్గం లేనట్లే కనిపిస్తోంది. కాని ఒక మార్గం ఉన్నది. అది ఇది.

# పరిష్కారమార్గం

## సన్న్యాసు లింటింటికీ వెళ్ళి విద్య బోధించాలి

వాళ్ళు మనదగ్గరకు రాకపోతే మనమే వాళ్ళ దగ్గరకు వెళ్ళాలి. బీదవాళ్ళు ఎక్కడఉంటే అక్కడకు - పొలాలకూ, కర్మాగారాలకూ, ఇతర చోట్లకూ విద్యాబోధకులే వెళ్ళి బోధించాలి.

మనదేశంలో ఒంటరివాళ్ళయి ఆత్మార్పణ చెయ్యగల సన్న్యాసులు వేలకొలది ఉన్నారు. వాళ్ళు సహజంగానే ఊరూరూ తిరుగుతూ ప్రజలకు మతబోధ చేస్తూ ఉంటారు. వాళ్ళల్లో కొందరుచేరి ఒక సంస్థగా ఏర్పడి లౌకికవిద్యాబోధకులైతే వాళ్ళు ఇంటింటికీవెళ్ళి బీదప్రజలకు బోధ చెయ్యడమే కాక సక్రమమైన శిక్షణగూడా ఇవ్వగలుగుతారు.

ఈ సన్న్యాసులు గ్రామగ్రామానికీవెళ్ళి ప్రతివ్యక్తికీ మతంతోపాటు విద్యను గూడా అందించాలి.

పగలల్లా పనులుచేసి సాయంత్రం విశ్రాంతిగా ఏ చెట్టుకిందో గ్రామీణులు సమావేశమై చుట్ట కాల్చుకుంటూనో కబుర్లు చెప్పుకుంటూనో కాలక్షేపంచేస్తూ ఉంటారనుకోండి, అటువంటి సమయాల్లో లౌకికవిద్య నేర్చుకున్న ఇద్దరు సన్న్యాసులువెళ్ళి ఆధునిక పరికరాలతో బొమ్మలూ, మ్యాపులూ వగైరాలు చూపుతూ ఖగోళవిషయాలూ, భిన్నదేశాల చరిత్రలూ మొద

లైనవి చెప్పితే ఎంతతేలికగా విద్యావ్యాప్తి జరుగుతుంది. ఇదంతా మౌఖికం గానే చెయ్యవచ్చు.

జ్ఞాన సాధనాల్లో కంటి కెంత ప్రాముఖ్య మున్నదో చెవికీ అంత ఉన్నది. అందుచేత ఇటువంటి విద్యాబోధవల్ల గ్రామీణుల కనేక విషయాలు తెలుస్తాయి. నైతికంగా అభివృద్ధి పొందడానికి ఆశించడం జరుగుతుంది. మనం చెయ్యవలసింది అంతవరకే :

ప్రజలకు భావాలు అందించాలి. తమ చుట్టూ ప్రపంచంలో ఏం జరుగుతూ ఉన్నదో తెలుసుకునే అవకాశం వాళ్ళకు కలిగించాలి. ఇంత మాత్రం జరిగితే వాళ్ళ అభ్యుదయానికి వాళ్ళే కృషి చేస్తారు.

రసాయన పదార్థాలను కలపడంవరకే మన కర్తవ్యం. స్ఫటికీ కరణం దానంతటదే భగవన్నియమా న్ననుసరించి జరుగుతుంది. ప్రజల మనస్సులకు మనం భావాలు అందిస్తే అవే తక్కిన పనిని చేస్తాయి. ప్రజా సామాన్యాన్ని విద్యావంతం చెయ్యడమంటే ఇదే :

## గొప్ప ధార్మికోత్సాహమే ఈ పని చేయిస్తుంది

త్యాగపూర్వకమైన ఈ మహాకార్యదీక్షను మన సన్న్యాసు లెందుకు స్వీకరిస్తారు? ధార్మికోత్సాహంవల్లనే పూనుకోవాలి. ప్రతి నూతన ధార్మిక తరంగానికీ నూతన కేంద్రం ఒకటి ఉండాలి. ప్రాచీన ధర్మం ఈ నూతన కేంద్రంవల్లనే పునరుజ్జీవిత మవుతుంది. సిద్ధాంతాలవల్లా, తత్వాల వల్లా ప్రయోజన ముండదు. ఒకానొక శీలవంతుడు ఒక మహత్తర జీవి, ఒక దైవమూత సమస్తాన్నీ పరివర్తింపజేసే కేంద్రమై మార్గదర్శకుడు కావాలి. అతని చుట్టూ తక్కిన శక్తులన్నీ చేరి బలీయమైన సముద్ర తరంగంవలె జాతిని ముంచెత్తి అన్ని కళంకాలనూ కడిగివేస్తూ పరిశుభ్రం చెయ్యడమే కాక నూతన చైతన్యంతో పురోగమింప చేస్తాయి.

ఒక కొయ్యను కొయ్యాలంటే దాని చారనుబట్టే కొయ్యాలి. అలాగే హిందూ మతాన్ని హిందూమత ధోరణిలోనే సంస్కరించాలిగాని నవ్యతా మోహంవల్ల వచ్చిన కొత్త పద్ధతుల ద్వారా సాధ్యంకాదు.

సంస్కరణకు పూనుకునే వాళ్ళందరూ ప్రస్తుతావసరాన్నిబట్టి ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతులు రెంటినీ సమన్వయం చేసుకున్నవాళ్ళు కావాలి.

జాతి కవసరమైన ఆధ్యాత్మిక లౌకిక విద్యలు రెంటిమీదా మన కధికార ముండాలి. కలలుగన్నా, మాట్లాడినా, ఆలోచించినా ఒకే లక్ష్యంతో ప్రవర్తించి దాన్ని సాధించాలి. అంతవరకూ జాతికి మోక్షంలేదు. ఈ మహా కార్య సాధనకు సువ్యవస్థితమైన సంఘటన అవసరము.

## అన్నిచోట్లా కార్యప్రవర్తక కేంద్రాలు నెలకొనాలి

ఇది చాలా పెద్ద పథకం. జాతి కంతకూ సంబంధించిన బృహత్ప్రణాళిక. ఇది కార్యరూపంలోకి ఎలావస్తుందో ఏమో నాకు తెలియదు. అయినా మనం దీన్ని ప్రారంభించి తీరాలి. ఎలా ప్రారంభించడం? ఉదాహరణకు మదరాసును తీసుకోండి. హైందవులకు మతం ముఖ్యం కాబట్టి ఒక దేవాలయం ఉండాలి. అయితే భిన్నశాఖలకు చెందినవాళ్ళు కలహించరా అని మీరు అడగవచ్చు. అందుకనే మనము దాన్ని అన్ని శాఖలకూ అంగీకారమయ్యే దేవాలయంగానే ఏర్పాటు చేస్తాము. అందులో శివకేశవాదిక మూర్తులుండవు. అన్నిశాఖల వాళ్ళకూ ఉత్తమ ప్రతీకమైన ఓంకార మొక్కటే ప్రతీకగా ఉంటుంది.

ఓంకారాన్ని ప్రతీకగా అంగీకరించని శాఖ ఉంటే అది హైందవ మతశాఖ అనిపించుకోడానికి వీలేలేదు. హైందవమతానికి ఎవరెట్టి వ్యాఖ్యానం చేసుకున్నా, తమలోతాము విభిన్నాభిప్రాయాలు ఎన్ని కలిగి ఉన్నా, అందరికీ సమానమైన దేవాలయం ఒకటి ఉండాలి. ఇతర ప్రదేశాల్లో

ఎవరికిష్టమైన మూర్తులనూ, ప్రతీకలనూ వాళ్ళు పెట్టుకోవచ్చు. ఇక్కడ మాత్రం ఏపేచీ లేకుండా అందరూ ఒక ప్రతీకను సర్వోత్తమమైన ఓంకారాన్ని అంగీకరించాలి.

ఇక్కడ మన మతశాఖ లన్నింటికీ సమానమైన అంశాలు యువకులకు బోధింపబడాలి. అయితే భిన్నశాఖలవాళ్ళు వాళ్లవాళ్ళ సిద్ధాంతాలనూ, అభిప్రాయాలనూ భోధించడానికి సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉండాలి. ఇతరులతో కలహించగూడదన్న షరతుకుమాత్రం అందరూ విధేయులు కావాలి. నీవు చెప్పదలచినదేదో చెప్పు. అది ప్రపంచానికి కావాలి. అంతే గాని నీవు ఇతరులనుగూర్చి ఏమనుకుంటున్నావో వినడానికి ప్రపంచానికవసరమూలేదు, అవకాశమూలేదు. అది నీ దగ్గరే ఉంచుకో, ఎన్నడూ బైటపెట్టకు.

## ఉపదేశకులకూ, ఉపాధ్యాయులకూ శిక్షణ

ఈ దేవాలయంలో మన ప్రజలకు మతోపదేశమూ, విద్యాబోధనా చెయ్యడానికి ఉద్దిష్టులయిన ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చే సంస్థ ఒకటి ఏర్పడాలి. మతబోధా, విద్యాబోధా ఒకరే చెయ్యాలి. మన దేశంలో మతబోధ ఇంటింటికీ వెళ్ళి చెయ్యడం ఎలాగూ జరుగుతోంది కాబట్టి దాంతోపాటే లౌకిక విద్యాబోధా జరగాలి. అలా చెయ్యడం తేలికవుతుంది. దీనికి పూనుకున్న ఉపాధ్యాయ బృందాలవల్ల క్రమక్రమంగా ఇతర ప్రదేశాలలో కూడా ఇటువంటి దేవాలయాలు బయలుదేరి దేశమంతటా వ్యాపిస్తాయి. ఇదే నా పథకం!

అబ్బో ఇంత పెద్దపని ఎట్లా సాగుతుం దనిపించవచ్చు. కాని దీని అవసర మెంతో ఉన్నది. మరి దీనికి ధన మెట్లా వస్తుందని మీరు అడగవచ్చు. ధనంతో నిమిత్తమే లేదు. ఒకపని జరగడానికి ధనం ముఖ్యం గాదు. కడచిన పంద్రెండేళ్ళలో నా జీవిత మెలా గడుస్తూందో చూస్తే

నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఈ పూట భోజన మిక్కడచేస్తే మరుపూట భోజనం ఎక్కడో ఎలాగో తెలియనే తెలియదు. అయినా అది జరగనే జరిగింది. ధనమూ వగైరాలు నా సేవకులుగాని నేను వాటి సేవకుణ్ని గాదు. కాబట్టి అవసరమైనప్పుడు వాటంతటవే వస్తాయి, వచ్చి తీరాలి. వచ్చి తీరాలి — అదేమాట !

## మనుష్యులు - నిజాయితీ గల మనుష్యులు కావాలి

మనుష్యు లెక్కడ ఉన్నారు? అసలు ప్రశ్న ఇదీ !

సర్వాత్మనా పూనుకునే మనుష్యులే కావాలి. వాళ్ళే ఉంటే తక్కినవన్నీ వాటంతటవే సిద్ధమవుతాయి. ధైర్యమూ ఉత్సాహమూ కలిగి ఆత్మ విశ్వాసంతో సర్వాత్మనా కృషిచేసే మనుష్యులే కావాలి

ఆధునిక తరంలో యువకులమీద నా కెంతో విశ్వాసం ఉన్నది. వాళ్ళల్లోనుంచి కార్యశూరులు ముందుకు వస్తారని నా ఆశ. ఈ సమస్య నంతటినీ వాళ్ళు సింహాలవలె పరిష్కరిస్తారు. ఈ మహత్తర భావాని కొక రూపమిచ్చి దానికి ప్రాణం ధారపోశాను. నేను విజయం పొందకపోతే నాకంటె సమర్థుడు మరొకడు వచ్చి సాధిస్తాడు. నే చేసిన కృషితోనే నేను తృప్తిపడతాను.

ఆత్మ సర్వజ్ఞ మనీ, పరిపూర్ణమనీ, సమస్త శక్తులూ అందులోనే ఉన్నాయనీ మీలో ప్రతిఒక్కరూ పూర్తిగా నమ్మండి. మీలో మీరు విశ్వాసం కలిగి ఉండండి. అప్పుడు మీరు భారతదేశా న్నంతటినీ పునరుజ్జీవితం చెయ్యగలరు. ఆ పని జరిగిన తర్వాత మనం ఈ భూమండలంలో ఉన్న అన్ని దేశాలకూ వెళ్తాము. మన భావాలు త్వరలోనే ఆ యా జాతులను నిర్మించే శక్తుల్లో ప్రాముఖ్యాన్ని వహిస్తాయి ఈ దేశంలోనే కాక ప్రపంచ మంతటిలోనూ ఉన్న వివిధ మానవజాతుల జీవితాల్లోకి మనం ప్రవేశించాలి. ఆ లక్ష్యం సిద్ధించేటందుకు మనం కృషి

చెయ్యాలి. ఇందుకోసమే నాకు యువకులు కావాలి. 'యువకులు, శక్తిమంతులు, ఆరోగ్యవంతులు, బుద్ధిమంతులు అయి శ్రద్ధా తాత్పర్యములతో కృషిచేసే వాళ్ళే భగవంతు ణ్ణందుకోగల' రని వేదాలు చెప్పుతున్నాయి.

నీ భవిష్యత్తును నీవు నిర్ణయించుకునే సమయ మిదే! యౌవన ప్రాంగణంలో ఉండి శక్త్యుత్సాహాలు పొంగి పొరలుతున్నప్పుడే నిర్ణయం జరగాలి గాని అన్నీ ఉడిగి వార్ధక్యం సమీపించినప్పు డేమీ చెయ్యలేవు. నీ వేమైనా చెయ్యదలిస్తే ఇంతకంటె మంచితరుణం లేదు. భగవంతున కనాఘ్రాత పుష్పాలే సమర్పింపబడాలి అట్టివాటినే ఆయన స్వీకరిస్తాడు.

అందుచేత ఉత్తమాదర్శం పెట్టుకుని మన జీవితాలను దాని కర్పిద్దాము. ఇది మన నిశ్చయము. ఆ భగవంతుడు, స్వజాతీయుల నుద్ధరించేటందుకు పదే పదే అవతరించే కరుణా సముద్రుడు.

> యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
> అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

అని మనకు వాగ్దానం చేస్తూ అభయహస్త మిస్తున్న శ్రీకృష్ణపరమాత్మ మన్ని ఆశీర్వదించి మన లక్ష్యాలు సిద్ధించేటందుకు మార్గదర్శకుడై మనలను నడిపించును గాక!

> ఉత్తిష్ఠత. జాగ్రత. ప్రాప్యవరాన్నిబోధత!
> లెండి! మేల్కొనండి! లక్ష్యం సిద్ధించే వరకూ ఆగబోకండి!



# హిందూ మతమూ - దాని పరిమితులూ

ప్రబుద్ధ భారత్ - ఏప్రియల్ 1899

మతాంతరులైనవాళ్ళను మళ్ళీ హిందూమతంలోకి చేర్చుకోవడాన్ని గూర్చి వివేకానంద స్వామివారి అభిప్రాయా లేమిటో తెలుసుకుందామని మా సంపాదకుల సూచన ననుసరించి నే నొక రోజున స్వామివారిని సందర్శించడానికి వెళ్ళాను. మా పడవ రామకృష్ణ మఠం ఒడ్డున ఆగింది. నే నీ పనిమీద వస్తున్నా నని తెలిసి నాతో మాట్లాడడానికి స్వామివారే మఠంలో నుంచి ఇవతలికి వచ్చారు. మా సమావేశం గంగలో నౌకా గృహం పైభాగాన తటస్థపడింది.

అది సంధ్యావేళ. మా సంభాషణ జరిగిన సమయమూ, స్థలమూ ఎంతో రమ్యంగా ఉన్నాయి. పైన నక్షత్రాలు మిలమిల లాడుతున్నాయి. చుట్టూ ప్రవహిస్తున్న గంగాతరంగిణి ఒక ప్రక్క రామకృష్ణ మఠ భవనమూ దానికి వెనుక ఎత్తైన తాళ్ళూ, ఛాయా వృక్షాలూ.

ప్రసన్న గంభీరమైన ఈ వాతావరణంలో నేను మెల్లగా వచ్చిన పని కుపక్రమించాను.

'స్వామీ! మతాంతరులైనవాళ్లను మళ్ళీ మన మతంలోకి చేర్చుకోవడాన్నిగూర్చి మీతో మాట్లాడాలని వచ్చాను. వాళ్ళను చేర్చుకోవలె ననేనా మీ అభిప్రాయం?'

'తప్పక చేర్చుకోవచ్చు-చేర్చుకుని తీరాలి గూడాను' అన్నారు స్వామి.

కొంచెంసేపు మౌనంగా ఆలోచిస్తూ కూర్చుని తిరిగి ఇలా అన్నారు "లేకపోతే మనం క్రమ క్రమంగా సంఖ్యలో సన్నగిల్లి

పోతాము. మొదట్లో మహమ్మదీయులు మన దేశానికి వచ్చినప్పుడు, అతి ప్రాచీన మహమ్మదీయ చరిత్రకారుడయిన ఫెరిష్టా అంచనా ప్రకారం అరవై కోట్ల హిందువు లుండేవారట. ఇప్పుడు ఇరవై కోట్లున్నాము. అదీ గాక హిందూ సంఘంలో నుంచి బైటికి వెళ్ళిన ప్రతివానివల్లా మన కొక మనిషి తగ్గడమే కాదు, ఒక శత్రు వెక్కువవుతున్నాడు.

పైగా మహమ్మదీయులుగానూ క్రైస్తవులుగానూ మారిన హిందువుల్లో చాలా భాగం నిర్బంధంగా మార్చబడినవాళ్లో, వాళ్ల సంతతివాళ్లో అయి ఉంటారు. అటువంటివాళ్ళ విషయంలో మనం సానుభూతి చూపాలే గాని కాఠిన్యం వహించడం పూర్తిగా అన్యాయం. జన్మతః పరమతస్థుల విషయం ఏమంటారా? సందేహ మెందుకు? వాళ్ళనూ చేర్చుకోవలసిందే! హిందూ సంఘం పూర్వ మెంతమందినో చేర్చుకున్నది; అది యిప్పటికీ జరుగుతూనే ఉన్నది.

ఆదివాసుల తెగలూ, పరిసర జాతులవాళ్లూ మహమ్మదీయులకు పూర్వం మన దేశాన్ని జయించిన విభిన్న జాతులవాళ్లూ మాత్రమేకాక పురాణాల్లో ప్రత్యేక చరిత్రలు కనిపించే కులాలవాళ్ళందరూ కూడా ఈ విధంగా మన మతంలో చేరినవాళ్ళేనని నా అభిప్రాయం. ఈ ఉద్దేశం తోనే నేనీ ప్రకటన చేస్తున్నాను.

తమంతటతాము ఇష్టపూర్వకంగా మన మతంలో చేరదలచిన వాళ్ళకు దీని నియమనిష్ఠల ననుసరించి ప్రాయశ్చిత్తాలు విధించి చేర్చుకో వచ్చు. కాని కాశ్మీరు నేపాలు ప్రాంతాల్లోవలె నిర్బంధంగా మతాంతరులైన వాళ్ళుకాని తదితరులుగాని చేరదలిస్తే వాళ్ళకు ఏవిధమైన ప్రాయశ్చిత్తాలూ విధించకూడదు.''

'మరయితే ఇలా చేరేవాళ్ళ వర్ణ మేమౌతుంది స్వామీజీ' అని నేను సాహసించి అడిగాను.

'ఏదో ఒక వర్ణముండాలి. లేకపోతే హిందూ సంఘంలో సమ్మిళితం కావడం ఎన్నటికీ తటస్థించదు. వాళ్ళకు తగిన వర్ణ మేమౌతుంది? ఆం! మతాంతరులై తిరిగివచ్చే వాళ్ళకు మతాంతరులు కాకముందున్న వర్ణాలే ఉంటాయి. కొత్తవాళ్లు వాళ్ళవాళ్ళ వర్ణాలు ఏర్పరచుకుంటారు. వైష్ణవం ప్రబలినప్పుడు ఈ విధంగానే జరిగిందన్న సంగతి మీకు జ్ఞాపక ముందను కుంటాను. వివిధ వార్ణాలవాళ్ళూ కొత్తవాళ్ళూ అందులోచేరి వారంతా ఒక గౌరవనీయమైన అవాంతర హిందూసంఘ మయ్యారు గదా! వైష్ణవానికి ఆది గురువులైన రామానుజులు మొదలు, వంగీయ చైతన్యులవరకు అందరూ ఈ పనే చేశారు.'

'ఈ కొత్తవాళ్ళ పెళ్ళిళ్ళు ఎలా చేసుకుంటారు?' అని నేను అడిగాను

'ఇప్పుడు చేసుకుంటున్నట్లు తమలో తామే చేసుకుంటారు' అన్నారు స్వామి నిశ్చలంగా.

'పేర్లమాటకువస్తే హైందవేతర నామాలు కలవాళ్ళకు కొత్తపేర్లు పెట్టవలసి ఉంటుందనుకుంటాను. వాళ్ళకు స్వస్వ వర్ణోచిత నామాలు ఇవ్వాలా మరే వైనానా?'

'అవును; పేర్లు తగినవే పెట్టవలసినదే. పేరులో ఎంతైనా ఉన్నది' అన్నారు స్వామి సాలోచనగా. ఆపై దీన్నిగూర్చి వారేమీ అనలేదు.

తరువాత నేను వేసిన ప్రశ్న స్వామివారిని బాగా ఆలోచింపజేసింది.

'స్వామీజీ! ఈకొత్తవాళ్ళకు నానా విశ్వాసములతో కూడిన హైందవంలో వాళ్ళకు నచ్చిన పద్ధతిలో ఉండే స్వాతంత్ర్యముంటుందా లేక వాళ్ళకు ప్రత్యేకమైన ఏర్పాటు చేస్తారా?'

'ఈ ప్రశ్న గూడా వేస్తున్నారా ? మీరు వాళ్ళంతటవాళ్లే నిర్ణయించు కోవాలి. నిర్ణయించుకునే స్వాతంత్ర్యం లేకపోతే హైందవమత ప్రధా

నాశయమే విఫలమవుతుంది. స్వేచ్ఛ ననుసరించిన ఇష్ట దేవతారాధనలోనే మన విశ్వాసం ప్రతిష్ఠితమై ఉన్నది.'

హైందవమత మూల సిద్ధాంతాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించిన వాళ్ళల్లో స్వామీజీ కంటె ఎక్కువ కాలం కృషి చేసినవాళ్ళు సజీవులై ఉన్నవాళ్ళల్లో మరెవ్వరూ లేరు. అందుచేత ఈ సమాధానం చాలా బరువైనదే అనిపించింది. హైందవ మతానికి విశిష్టమైన ఇష్టదేవతా నిర్ణయ స్వాతంత్ర్య సిద్ధాంతం సర్వ ప్రపంచాన్నీ ఇముడ్చుకో గలిగినంత విశాలమైంది.

ఆ తర్వాత ప్రసంగం ఇతర విషయాలవైపుకు మళ్ళింది. చివరకు హృదయ పూర్వకమైన వీడ్కోలు ఇస్తూ స్వామివారు దీపం పుచ్చుకుని మఠం వైపుకు వెళ్ళారు. నేను పడవమీద గంగలో ప్రయాణం చేసి కలకత్తా చేరుకున్నాను.

# స్వమత రక్షణకై నడుము బిగించండి!

'ఏమి సింహా! నీ తల్లి నెవరైనా అవమానిస్తే నువ్వేం చేస్తావు?'

'వాడిమీదికి మాకి తగిన బుద్ధి చెప్తాను'

'మాజాగా అన్నావు. మనదేశానికి నిజంగా తల్లివంటిదైన మన మతాన్ని గూర్చి నీ కిటువంటి గౌరవమే ఉంటే హిందూ సోదరుడు క్రైస్తవుడుగా మార్చబడడం చూచి సహించడం ఎన్నటికీ సాధ్యంకాదు. అయినా ఈ దేశంలో ఈపని రోజూ జరుగుతూనే ఉన్నది. హైందవులు తమ కేమీ పట్టనట్లు ఊరుకుంటున్నారు. ఏమైంది మీ విశ్వాసం? ఏమైంది మీ దేశభక్తి? క్రైస్తవమత ప్రచారకులు మీ ఎదుటనే హిందూమతాన్ని రోజూ నిందిస్తూనే ఉన్నారు. జరుగుతున్న ఈ అన్యాయాన్ని చూస్తూ ధార్మికమైన ఉద్వేగంతో నెత్తురుపొంగే స్వమత సంరక్షకులు మీలో ఎంతమంది ఉన్నారో అర్థం కావడం లేదు.'



# భారతీయ స్త్రీలు -
# పూర్వమూ, ఇప్పుడూ, ఇకముందూ

ప్రబుద్ధ భారత్ - డిసెంబరు 1898

సంపాదకుల ఆదేశా న్ననుసరించి భారతీయ స్త్రీల ప్రస్తుత పరిస్థితి, వారి భవిష్యత్తూ అన్న విషయాన్ని గూర్చి వివేకానంద స్వామివారి అభిప్రాయాలు తెలుసుకోవాలని ఎంతో ప్రయత్నించి చిట్టచివరకు ఒకానొక ఆదివారం ఉదయం పరమ సుందరమైన హిమవత్పర్వత సాను ప్రదేశంలో ఒకచోట శ్రీవారిని దర్శించగలిగాను.

నన్ను చూచి నేను వచ్చిన పని తెలుసుకున్నాక స్వామివారు 'అయితే రండి. అలా వాహ్యాళికి పోయి వద్దాము' అంటూ బయలుదేరారు. మే మా పూట చూచిన దృశ్యం ప్రపంచంలో అత్యంత మనోహరమైనది.

మేము వెళ్ళిన దారి వెలుగు నీడలతో, ప్రశాంతమైన గ్రామాలతో, ఆటలాడుకునే పిల్లలతో, పరిచిన బంగారంలా పండిన పొలాలతో రమ్యాతి రమ్యంగా ఉన్నది. ఒకచోట ఆకాశాన్ని మూసుకుపోయే అత్యున్నత వృక్షాలూ, మరొకచోట కొడవళ్ళు చేత్తో పుచ్చుకుని జొన్న పంట కోసే పల్లె పడుచులూ. పోగా పోగా ఒక ఆపిల్ పళ్ళ తోటవచ్చింది. ఆ తోటలో దింపిన పళ్ళు కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ కుప్పలు కుప్పలు పోసి ఉన్నాయి. వాటిని చూస్తూ ఆ తోటలోనుంచి మళ్ళీ బయలు ప్రదేశంలోకి

చేరుకున్నాము. అభిముఖంగా తెల్లని మేఘాలతో కూడిన ఆకాశాన్నంటు తున్న హిమవత్పర్వత సుందర శిఖరాలు గోచరిస్తున్నాయి.

ఉండి ఉండి స్వామివారు మౌనం విడిచి 'స్త్రీల ఆదర్శాల విష విషయంలో ఆర్యజాతీ, సెమిటిక్ జాతులూ పరస్పర విరుద్ధాలు. సెమిటిక్ జాతుల్లో భక్తికి భంగకరమన్న దృష్టితో స్త్రీ సాహచర్యమే నిషిద్ధమైంది. ఆహారానికి పక్షిని చంపడం మొదలు ఏ మతకార్యానికీ వాళ్ళల్లో స్త్రీ పనికి రాదు. ఆర్యుల్లో ధర్మపత్ని సహితుడు కాకపోతే మతకార్యం నిర్వర్తించ డానికే వీలులేదు.'

ఉభయుల దృక్పథాలనూ పర్యవేక్షణ చేస్తూ దేని ఆంతర్య మేదో ప్రస్ఫుటం చేస్తూ ఎన్నడూ అనుకోని విధంగా స్వామివారు గాఢ నిశ్చ యంతో అన్న ఈ మాటలు విని నేను చకితుణ్ణయి 'మరయితే స్వామీజీ ! హిందూమతం ఆర్య జాతీయ విశ్వాసానికి భిన్నమైందా ?' అని అడిగాను.

స్వామివారు ప్రశాంతంగా 'ఆధునిక హైందవం ముప్పాతిక మూడు వంతులు పౌరాణిక మైనది, అంటే బౌద్ధం తన ప్రభావాన్ని చూపించిన తర్వాత ప్రారంభమైనది. వైదిక కర్మ అయిన గార్హపత్యాగ్ని విషయంలో ధర్మపత్ని ఉండి తీరవలెనని ఉన్నా దేవతార్చనలో సాలగ్రామశిలను స్త్రీలు స్పృశించకూడదన్న నియమం దేవతార్చన పౌరాణిక మవడం చేతనే వచ్చిందని దయానంద సరస్వతీస్వామివారు సూచిస్తున్నారు' అన్నారు.

'అందుచేత మనలో స్త్రీలను పురుషుల కంటె తక్కువగా భావించడం బౌద్ధమత ప్రభావం వల్లనే అని మీ అభిప్రాయ మనమాట.'

'ఆ భావం ఉన్నచోట అంతే! అంతమాత్రాన మనం పాశ్చాత్యుల్లో వలె స్త్రీ పురుష సమానభావం మనలో లేదని వాళ్ళు చేసే విమర్శల

నంగీకరించి వాళ్ళతో పోల్చుకుని కించపడగూడదు. కొన్ని శతాబ్దాలుగా మన కేర్పడిన పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఇక్కడ స్త్రీలకు రక్షణ అవసరమైంది. మన ఆచారాలకు తాత్పర్యం ఇది కాని వాళ్ళ తక్కువతనం ఎంతమాత్రమూ కాదు.'

'అయితే స్వామీజీ! మన స్త్రీలు ఇప్పుడున్న పరిస్థితులు మీకు తృప్తికరంగానే ఉన్నాయా?'

'ఎంతమాత్రమూ కాదు. కాని మనం వాళ్ళ పరిస్థితులను బాగు చెయ్యడం పేరుతో వాళ్ళకు చదువు చెప్పడం తప్ప మరేమీ చెయ్యకూడదు. స్త్రీలు వాళ్ళ సమస్యలను వాళ్ళ కనుకూలమైన పద్ధతిలో వాళ్ళే పరిష్కరించుకోవాలి. వాళ్ళకోసం ఇతరు లెవ్వరూ చెయ్యలేరు, చెయ్యగూడదు. భారతదేశ స్త్రీలు ఈ విషయంలో ప్రపంచంలో ఇతర దేశాల స్త్రీలవలెనే కావలసిన సామర్థ్యం ఉన్నవాళ్ళే!'

'మరి బౌద్ధం తన దుష్ప్రభావాన్ని ఎలా చూపగలిగిందంటారు?'

'విశ్వాసం క్షీణించడం వల్లనే ఆ దుస్థితి వచ్చింది. ప్రతి ఉద్యమమూ ఏదో ఒక వైశిష్ట్యం యొక్క బలంతోనే విజయాన్ని పొందుతుంది. పొంగు చల్లారాక మొదట్లో గర్వహేతువైన ఆ వైశిష్ట్యమే బలహీనతకు ముఖ్యహేతు వవుతుంది. మానవోత్తముడైన బుద్ధ భగవానుడు మహత్తర సంఘటనా దక్షుడు. అందుచేతనే ఆయన లోకాన్నంతటినీ తనవెంట నడిపించ గలిగాడు. కాని ఆయన మతం కేవలం సన్న్యాసులకు చెందినదైంది. అందువల్ల తర్వాత తర్వాత కాషాయవస్త్రం కనిపిస్తే చాలు గౌరవించి తీరాలన్న దౌర్బల్యానికి దారితీసింది. పైగా సన్న్యాసులు గుంపులు గుంపులుగా చేరి సంఘజీవితం గడిపే పద్ధతిని ప్రారంభించిన మహానుభావుడు కూడా ఆయనే. ఆ సంఘాల్లో ఎంత గొప్ప సన్న్యాసిని అయినా ఎవరో ఒక సన్న్యాసి సలహా లేందే ముఖ్య నిర్ణయాలు చెయ్యలేక పోవడంవల్ల పురుషుల కంటె స్త్రీలు తక్కువగా చూడబడక తప్పలేదు.

బౌద్ధ సంఘాలన్నీ ఒకే ఒక విశ్వాసంతో దృఢత్వం సాధించడానికి అప్పటి కా పద్ధతి అవసరమే అయినా తరువాత తరువాత దానివల్ల వచ్చిన పరిణామాలే శోచనీయమైనవి.'

'సన్న్యాసాన్ని వేదాలు గూడా అంగీకరిస్తున్నాయి కదా!'

'అవునుగాని ఇక్కడ స్త్రీ పురుష తారతమ్యానికి ప్రసక్తి లేదు. జనకమహారాజు ఆస్థానంలో యాజ్ఞవల్క్యుని విద్వత్తు ఎలా పరీక్షింప బడిందో మీకు గుర్తున్నదా? ఆమహారాజు ఆస్థానంలో ప్రధానపరీక్షాధికారిణి బ్రహ్మవాదిని వాచక్నవి! పరమార్థ వేత్తలయిన స్త్రీలను ఆరోజుల్లో బ్రహ్మ వాదినులని పిలిచేవారు. మహాధానుష్కుని చేతిలో మెరుస్తున్న వాడి బాణాల వంటివి నా ప్రశ్నలంటూ ఆమె ఉపక్రమించింది. పరీక్షాధికారి స్త్రీయా, పురుషుడా అన్న ప్రశ్నే అక్కడ పుట్టలేదు. ఇంతెందుకు? పూర్వం మన దేశంలోని మున్యాశ్రమాలలో కులపతులవద్ద బాలబాలికలు విచక్షణ లేకుం డానే విద్యాభ్యాసం చెయ్యడంకంటె స్త్రీ పురుష సమానతా విశ్వాసానికి సంపూర్ణ నిదర్శన మేంకావాలి? మన సంస్కృతనాటకాలు చదివి చూడండి. శకుంతల కథ చదవండి. టెన్నిసనుకవి 'రాజకుమారి' మనకు బోధించే దేమైనా ఉందా?'

'మన ప్రాచీన వైభవాలను ఆవిష్కరించడంలో మీ పద్ధతి చాలా విలక్షణమైంది స్వామీజీ!'

'బహుశః నేను రెండువైపులా జగత్తును చూచిన వాణ్ణవడంవల్ల కావచ్చు' అని నెమ్మదిగా సమాధాన ముపక్రమిస్తూ 'సీతవంటి లోకోత్తర స్త్రీని కన్నజాతి – ఆమె వట్టి భావనాలోకానికి చెందినదే అయినా – ప్రపం చంలో మరెచ్చటా లేనంత గౌరవం స్త్రీల యెడల కలిగిఉన్నదని నాకు తెలుసు, పాశ్చాత్యదేశాల్లో స్త్రీలు మనవాళ్ళు ఎన్నడూ ఎరగని చట్టబద్ధమైన దుర్భర భారాలతో క్రుంగిపోతున్నారు. మనకున్న దోషాలూ, అపవాదాలూ

మనకున్నాయి. వాళ్ళకూ అలాగే ఉన్నాయి. సర్వ ప్రపంచంలోనూ సర్వ జాతులూ సామాన్యంగా స్త్రీలయెడల తమకున్న ప్రేమనూ, ఆర్ద్రితనూ, ఋజుత్వాన్నీ వ్యక్తం చెయ్యడానికే ప్రయత్నిస్తున్నాయి. ఆయా జాతుల ఆచారాలు వాటి నభివ్యక్తంచేసే మార్గాలు మాత్రమే. గార్హస్థ్యజీవిత క్షేమ స్థైర్యాది సద్విషయాల్లో భారతీయపద్ధతులు తక్కిన దేశాలన్నింటి పద్ధతుల కంటె ఎన్నోవిధాల ప్రయోజనకర మైనవని చెప్పడానికి నేనెంతమాత్రమూ సంకోచించను.' అన్నారు స్వామివారు.

'అయితే స్వామీజీ! మన స్త్రీలకు సమస్యలే లేవంటారా?'

'ఉన్నాయి. చాలా ఉన్నాయి. తీవ్రమైన సమస్యలే ఉన్నాయి. అయితే అవన్నీ 'విద్య' అనే సాధనంతో పూర్తిగా పరిష్కారమయ్యేవే. కాని ఉత్తమ విద్యనుగూర్చి మనకింకా సరియైన అభిప్రాయ మేర్పడలేదు.'

'దానికి మీ నిర్వచన మేమిటి?'

'నేను దేన్నీ నిర్వచించను' అన్నారు స్వామి నవ్వుతూ. 'అయినా ఉత్తమవిద్యను మానవుని సహజ శక్తులను పెంపొందించేదనిగాని, సమర్థంగానూ సముచితంగానూ సంకల్పించేటట్లు వ్యక్తులకు శిక్షణ ఇచ్చే దని గానీ వర్ణించవచ్చు. అటువంటి విద్యచేత ఈనాటి భారతదేశపు అవసరానికి అనుగుణంగా ధీరవనితలను; సంఘమిత్ర, లీలాబాయి, అహల్యాబాయి, మీరాబాయి మొదలైన ఆదర్శ భారతనారీమణుల సంప్రదాయాలను నిలబెట్టే ఉత్తమ స్త్రీలను; భగవత్పాదారవింద సంస్మృతి చేత లభించే సాత్త్విక శక్తి సామర్థ్యాల వల్ల స్వార్థరహితలూ, స్వచ్ఛ హృదయాలూ అవుతారు కాబట్టి అటువంటి ధీరపురుషులకు తల్లులు కాగలిగే వీరమాతలనూ అసంఖ్యాకంగా మనం సిద్ధం చెయ్యవచ్చు.'

'అంటే మీఉద్దేశం విద్యలో మతానికి కొంతస్థానం ఉండాలనేగదా?'

'విద్యకు మతమే ఆత్మవంటి దని నా ఉద్దేశం. నా మతం, ఇతరుల మతం అన్న దృష్టితో నే నీ మాటను వాడడంలేదు. తక్కిన విషయాల్లో మాదిరిగానే ఇందులోనూ సర్వాంతరమైన ఆత్మ ఆవిష్కృత మయ్యేటట్లు ఉపాధ్యాయుడు విద్యార్థులకు బోధించాలి. ప్రతి వ్యక్తి తన ధోరణిలో తాను సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సాధించేటట్లు చెయ్యాలి.'

'అయితే మతదృష్ట్యా బ్రహ్మచర్యాని కున్న ప్రాముఖ్యం, మాతృత్వమూ భార్యాత్వమూ వీటికంటె అధికమై, ఆ సంబంధాలు లేని వాళ్ళకే బ్రహ్మచర్యం దక్కేదవడం స్త్రీకి పెద్ద అఘాత మవుతోందే?'

'బ్రహ్మచర్యానికి మతమిచ్చే ప్రాముఖ్యం స్త్రీల విషయంలో ఎంతో పురుషుల విషయంలోనూ అంతే! ఈ సంగతి మీరు మరిచిపో గూడదు. పైగా మీ ప్రశ్న మీ మనస్సులో కొంత అవ్యవస్థ ఉన్నట్లు సూచిస్తోంది. హిందూమతం స్త్రీకైనా పురుషునికైనా ఒకే ఒక లక్ష్యాన్ని నిర్దేశిస్తోంది. క్షణ క్షణం మారిపోయే జీవితంలో నిత్యమైన పరమార్థాన్ని అందుకోవడమే ఆ లక్ష్యం. దాన్ని సాధించడానికి సాధనమే అయ్యే పక్షంలో వివాహం, బ్రహ్మచర్యం; మంచీ, చెడూ; జ్ఞానం, అజ్ఞానం ఏదైనా ఉపాదేయమే! ఇక్కడే హిందూమతానికీ బౌద్ధానికీ ఎంతో వ్యత్యాసం ఉన్నది. బౌద్ధం బాహ్యజగత్తు యొక్క అశాశ్వతత్వాన్ని గుర్తించడానికి ఒకే ఒక మార్గాన్ని ఉపదేశిస్తోంది. మహాభారతంలో తాను సాధించిన తపశ్శక్తికి గర్వించి ఒక కాకినీ, ఒక కొంగనూ కోపంతో భస్మం చేసిన మహర్షి కథ మీకు జ్ఞాపక ముందా? ఆ మహర్షి మొదట్లో ఒక ఊళ్ళోకి వెళ్ళి రోగగ్రస్తుడైన భర్తకు ఉపచారం చేసే ఇల్లాలినీ, తర్వాత మాంస విక్రయంచేసే ధర్మవ్యాధుణ్ని చూస్తాడు. వాళ్ళిద్దరూ సంపూర్ణ విశ్వాసంతో నిర్ణీత విధిని నిర్వహించడంవల్ల పూర్వమే పరమార్థాన్ని అందుకున్న మహానుభావులని గ్రహిస్తా డా మహర్షి!'

'ఇంతకూ ఈ దేశ స్త్రీలకు మీ ఉపదేశ మేమిటి స్వామీజీ ?'

'పురుషుల కేమి చెప్తానో స్త్రీలకూ అదే చెప్తాను. భారత దేశాన్నీ, భారతీయ విధానాన్నీ విశ్వసించండి. శక్తిమంతులై ఉత్సాహంగా ఉండండి. దేనికీ మీరు సిగ్గుపడవలసిన అవసరం లేదు. ఇతరులనుండి తీసుకోవలసింది కొంత ఉన్నా హిందువులు ప్రపంచ ప్రజల కివ్వవలసింది అనంతంగా ఉన్నది.'



# భారతీయ పాశ్చాత్య స్త్రీల తారతమ్యం

(న్యూయార్కు ప్రసంగంనుండి)

'న్యూయార్కు'లో ఒకచోట వివేకానంద స్వామి ఉపన్యసిస్తూ ఇలా అన్నారు:

"మా దేశ స్త్రీలకు మీ తెలివితేటలు రావడం నా కిష్టమే కాని పావిత్ర్యం పోయేటట్లయితే ఎంతమాత్రమూ అక్కరలేదు. మీ విజ్ఞానానికి నేను అభినందిస్తున్నాను. కాని మీరు చెడ్డను పూలతో కప్పిపుచ్చి దాన్నే మంచి అని వ్యవహరించడం మాత్రం నా కసహ్యాన్ని కలిగిస్తోంది. కేవలం ధీ నైశిత్యమే సర్వ శ్రేష్ఠం కాదు. నైతికత్వమూ, ఆధ్యాత్మికత్వమూ మన లక్ష్యాలు కావాలి. వాటికోసమే మనం ప్రయత్నిస్తాము. మా స్త్రీలు మీ అంత చదువుకున్నవాళ్ళు కాదుగాని మీకంటె పవిత్రలు. స్త్రీల కందరకూ భర్త తప్ప ఇతర పురుషులు బిడ్డలవంటివాళ్ళు కావాలి.

పురుషుల కందరకూ భార్య తప్ప ఇతర స్త్రీలు తల్లులవంటివాళ్ళు కావాలి. నన్ను నేను చూచుకుని పురుషోచితమని మీరు భావించే మీ సాహసాన్ని చూస్తూ ఉంటే సర్వాత్మనా నా కసహ్యమువేస్తోంది. లైంగిక భావాన్ని ఉపేక్షించి సామాన్య మానవతా భూమికపై సంచరించడం నేర్చుకుంటేనే గాని మీ స్త్రీలు నిజంగా అభివృద్ధి పొందరు. అంతవరకూ వాళ్లు మీకు కేవలం ఆటవస్తువులు; అంతకు మించి ఏమీ కాదు. మీలో విడాకు లింత విపరీతం కావడానికి ఇదే హేతువు. స్త్రీ కనిపించిందంటే మీ పురు

షులు వంగి వంగి వినయం చూపిస్తారు, కూర్చునేందుకు కుర్చీ ఇస్తారు, మరు క్షణంలోనే సౌందర్యాభినందన కుపక్రమిస్తారు. 'ఓ! నీ కళ్ళు ఎంత అందంగా ఉన్నాయి' అంటూ పొగుడుతారు. ఈ పని చెయ్యడానికి వాళ్ళకు హక్కు ఎక్కడుందంటాను? అంత దూరం పురుషుడు సాహసించడమా? స్త్రీలు దానిని అనుమతించటమా? ఇటువంటివాటితో మానవుల్లో నైచ్యమే ప్రబలుతుంది. ఉదాత్త భావాలు కలగనే కలగవు.

మన కెంతసేపూ స్త్రీ పురుష భావమే ప్రముఖమై ఉండడం మంచిది కాదు. పరస్పర సహాయంతో అభివృద్ధి పొందగోరే మానవుల మన్న భావం ఉండాలి. యువతీ యువకు లెక్కడ కలిసి ఏకాంతం లభించినా యువకు డామె నభినందించడమా? ఒక యువతిని భార్యగా స్వీకరించే లోపల రెండువందలమంది యువతులనైనా మోహించి వదలిపెట్టడమా? అబ్బ! ఎంత దుర్భరం? నేను వివాహమాడే వర్గానికి చెందినవాణ్ణయితే ఈ వెట్టి వేషాలేమీ లేకుండా ప్రేమించడానికి పిల్లను నిర్ణయించుకోగలను.

నేను భారతదేశంలో ఉండగా ఇక్కడి సంగతులను దూరంనుండి చూస్తూ ఇవన్నీ బాగున్నాయని వాళ్లూవీళ్లూ చెప్తే కాబోలునని నేనూ నమ్మాను. తర్వాత పర్యటనచేసి ప్రత్యక్షంగా చూస్తే ఇదెంతమాత్రమూ మంచిదికాదని పూర్తిగా గ్రహించాను. మీ పద్ధతి దుష్టమని మీకూ తెలుసు. అయినా మీరు కళ్ళు మూసుకుని మంచిదంటున్నారు. మీ పశ్చిమ దేశీయ జాతులతో వచ్చిన ఇబ్బందే యిది. అల్పప్రాయం, చలచిత్తం, ఐశ్వర్యం, మూర్ఖతా ఇవన్నీ మీకు దాపురించాయి. వీటిల్లో ఏ ఒక్క లక్షణమైనా ఎంతో అనర్థాన్ని కలిగిస్తుంది. నాలుగూ చేరినప్పుడు చెప్పేదేమిటి? జాగరూకులై ఉండండి!''

# 'సాయనాచార్యులవారే మాక్సుముల్లరుగా పునర్జన్మ ఎత్తారు' - నిజమేనా?

(వి. సం. గ్రంథావళి 6వ సం.)

"వేదాలకు తాము చేసిన భాష్యాన్ని పునరుజ్జీవింప చెయ్యడంకోసం సాయనాచార్యులవారే మాక్సుముల్లరుగా పునర్జన్మ ఎత్తారని నా కనిపిస్తుంది. ఈ అభిప్రాయం నా కెంతోకాలంగా ఉన్నది. మాక్సుముల్లరును ప్రత్యక్షంగా చూచినప్పుడు బాగా దృఢపడింది. వేదాలకు పుట్టినిల్లైన ఈ దేశంలోకూడా దృఢమైన వేదవేదాంత పరిజ్ఞానం కలిగి అంత నిర్విరామంగా కృషిచేసే పండితుడు మరొకడు కనిపించడు. వీటన్నింటినీ మించి శ్రీరామకృష్ణు లంటే ఆయనకున్న గౌరవం అపారమూ, అనంతమూ. వీరు భగవదవతార మని ఆయన నమ్ముతారు తెలుసునా నీకు? వారింటికి అతిథిగా వెళ్ళినప్పుడు నాకు వారిచ్చిన అతిథిమర్యాద ఏమని చెప్పను? గార్హస్థ్య జీవితాన్ని గడుపు తున్న ఆ వృద్ధదంపతులను చూస్తే వశిష్ఠారుంధతు లనిపించారు. నేను బయలుదేరి వచ్చేటప్పుడు ఆ ముసలాయన కళ్లు బాష్పాలతో నిండి పోయాయి."

శిష్యుడు :- అయితే స్వామీ! సాయనులవారే మాక్సుముల్లరయి నప్పుడు పవిత్రమైన భారతదేశంలో పుట్టక అక్కడెక్కడో మ్లేచ్ఛదేశంలో ఎందుకుపుట్టా రంటారు?

స్వామీజీ :– నేను ఆర్యుణ్ని. వాడు మ్లేచ్ఛుడు – అన్న భావమూ, భేదదృష్టి అజ్ఞానంవల్లనే కలుగుతాయి. వేదాలకు భాష్యంచెప్పే మహావిజ్ఞాన ఖనికి వర్ణాశ్రమాలతో నిమిత్త మేముంటుంది. ఆ మహానుభావున కివన్నీ అర్థంలేనివి. మానవజాతి శ్రేయస్సునుకోరి వారెక్కడ ఇష్టమయితే అక్కడ జన్మించగలరు. పైగా విజ్ఞానైశ్వర్యాలు రెంటిలోనూ పరమ ప్రమాణా న్నందుకున్న దేశంలో పుట్టకపోతే అంతంత పెద్దపెద్ద సంపుటాలు ప్రచు రించేందుకు సొమ్మెక్కడనుంచి వచ్చేది? ఋగ్వేదాన్ని ప్రచురించడానికి భారతదేశాన్ని పాలిస్తున్న తూర్పుఇండియా కంపెనీవారు తొమ్మిదిలక్షల రూపాయిలు ఇచ్చారన్నమాట నీవు వినలేదా? అంత ద్రవ్యమూ దానికి చాలలేదు. నెలజీతాలిచ్చి వందలకొలది వేదపండితులను ఈ దేశంలో ఈ పనికై నియోగించవలసి వచ్చింది. ఈ కాలంలో ఈ దేశంలో అంత గాఢమైన జిజ్ఞాస ఉండడంగాని, విజ్ఞాన వ్యాప్తికై అంత కష్టపడి అంతంత పెద్ద మొత్తాలు వ్యయం చెయ్యడంగాని మరెక్కడైనా చూచామా, విన్నామా? వ్రాతప్రతులు తయారు చెయ్యడానికే ఇరవై అయిదు సంవత్స రాలు పట్టిందని మాక్సుముల్లరు పీఠికలో స్వయంగా పేర్కొన్నారు. అచ్చు వెయ్యడానికి మరో ఇరవై సంవత్సరాలు పట్టింది! ఒకానొక ప్రచు రణకోసం తదేక దీక్షతో జీవితంలో నలభై అయిదు సంవత్సరాలు కృషి చెయ్యడం సామాన్య మానవునకు సాధ్యమయ్యే విషయం కాదు. ఈ దృష్టితో కొంచె మాలోచించు. ఆయన సాయనులే అని నే ననడం వట్టి ఊహాగానం కాదని నీకే తెలుస్తుంది.



# ఆర్య - ఐరోపీయ నాగరకతలు

(ప్రాక్పశ్చిమాలు - వి. సం. గ్రంథావళి 5వ సం.)

ఐరోపీయ నాగరకతను ఒక వస్త్ర విశేషంగా భావన చేస్తే అందులో ఉపయోగపడే పదార్థాలు ఇలా ఉంటాయి. సముద్రపు టొడ్డున ఉండే పర్వతమయదేశమే దాని మగ్గం. వివిధ జాతుల సాంకర్యంతో ఏర్పడిన బలిష్ఠమైన యుద్ధ ప్రియజాతి దాని ప్రత్తి. తమ్మా, తమ మతాన్నీ రక్షించుకోవడానికి యుద్ధం చెయ్యడమే దానికి పడుగు. కత్తి తిప్పగలవాడే ఘనుడు, వాడే స్వతంత్రుడు. తిప్పలేనివాడు స్వాతంత్ర్యాన్ని కోల్పోయి మరొక యోధుని సంరక్షణలో బ్రతకవలసిందే. ఇక వ్యాపారమే ఈ వస్త్రానికి పేక. ఈ నాగరతకు ప్రధాన సాధనం ఆయుధం, దానికి సహాయక సాధనం బలసాహసాలు. భోగమే పరమ లక్ష్యం. ఈ నాగరకత స్వరూప స్వభావాలు ఇవి.

మన నాగరకత స్వరూప స్వభావాలు ఎలాంటివి ? ఆర్యులు శాంతి కాముకులు. భూమిని దున్ని పంటలు పండించుకుని బ్రతికేవాళ్ళు. తమ తమ కుటుంబాలను ఏ ఆటంకమూ లేకుండా పోషించుకోగలిగితే చాలు, తృప్తిపడి సుఖంగా కాలక్షేపం చేస్తారు. ఇటువంటి జీవితంలో వాళ్ళకెంతో విశ్రాంతి లభిస్తుంది. అందుచేతనే ఆలోచనకూ, సంస్కారానికీ మహత్తరమైన అవకాశం ఉంటుంది. మన జనకమహారాజు స్వయంగా భూమిని దున్నిన వాడు. ఆ కాలంలో ఆయన బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు. మన

జాతిలో ఋషులు, మునులూ, యోగులూ మొదటినుంచీ ఆవిర్భవిస్తూనే ఉన్నారు. ఈ జగత్తు మనఃకల్పితమని వాళ్ళకు మొదటినుంచీ తెలుసు. యుద్ధాలు చెయ్యి. దోపిడీలు చెయ్యి. ఏం చేసినా నీకు సౌఖ్యంరాదు, నీ వన్వేషించే సౌఖ్యం శాంతిలోనే లభిస్తుంది. శాంతి భోగపరిత్యాగం వల్లనే వస్తుంది. భౌతికమైన అభివృద్ధిలో సౌఖ్యానుభూతి లేదు. మనో బుద్ధుల సంస్కారంలోనే ఉన్నది. ఇట్టి విజ్ఞానవేత్తలే మళ్ళీ అరణ్యాలలోకి పోయి వ్యవసాయం చేసుకున్నారు.

అదిగో అలా నిర్వృక్షం చేసిన స్థలాల్లో వైదికయజ్ఞ వేదికలు నిర్మించారు. స్వచ్ఛమైన భారతీయాకాశ మంతటా పవిత్ర యజ్ఞధూమాలు వ్యాపించాయి. ఆ శాంతి పూరిత వాతావరణంలో వేద మంత్రాలు పునః పునః ప్రతిధ్వనించాయి. సహజ వైరభావాలు విస్మరించి సాధు క్రూర విభేదం లేకుండా సర్వజంతువులూ సౌమనస్యంతో సంచరించాయి. ధర్మ విజ్ఞానాల పాదపీఠం వద్ద కత్తి మోకరిలి కూర్చోవాలి. దాని కర్తవ్యం ధర్మాన్నీ, సర్వజీవకోటినీ రక్షించడం మాత్రమే. అపాయంలో ఉన్న దుర్బలులను క్షతినుండి కాపాడేవాడే క్షత్రియుడు. అతడే వీరుడు. కత్తినీ, నాగలినీ పరిపాలించేది ధర్మం. అది సర్వులకూ రక్షకమైనది. ఆ ధర్మమే రాజులకు రాజు. సర్వ ప్రపంచమూ నిద్రిస్తూ ఉన్నా అది మాత్రం మేలుకునే ఉంటుంది. దాని రక్షణలో అందరూ స్వతంత్రులై ఉన్నారు.

ఆర్యులు ఏదో దేశంనుండి ఇక్కడికి వచ్చి, ఆదివాసుల భూములను కాజేసి, ఆ జాతులను నిర్మూలించి ఈ భారతదేశంలో స్థిరపడ్డారని మీ ఐరోపీయ పండితులు చెప్పేదంతా అర్థంలేని మూర్ఖప్రసంగం తప్ప మరొకటి కాదు. భారతీయ పండితులు గూడా వాళ్ళకు వత్తాసు పోవడం వింతల్లో వింత! ఈ అభూతకల్పనలూ, అబద్ధాలూ మన పిల్లలకు (ఇప్పటికీ) బోధిస్తున్నారు. ఇది నిజంగా మహా దోషం!

నేనేం పెద్ద తెలిసిన వాణ్ని కాను. నాకేదో పాండిత్యం ఉందని చూపడానికి నటనా చెయ్యను. కాని నేను గ్రహించినంతలో ఇటువంటి అభిప్రాయాలు అభూత కల్పనలని పారిస్ విజ్ఞాన సభలో తీవ్రంగా వ్యతిరేకించాను. ఈ విషయంలో భారతీయ, ఐరోపీయ విజ్ఞులతో వీలయినప్పుడల్లా మాట్లాడుతూనే ఉన్నాను. అవకాశం లభించినప్పుడు ఈ సిద్ధాంతానికి అన్ని వివరాల్లోనూ తీవ్రమైన అభ్యంతరాలు చూపించాలని ఎంతో ఆశగా ఉన్నది నాతోపాటు మన పండితులందరూ ఈ పని చెయ్యాలని నా ఉద్దేశం. మీరందరూ చదువుకున్నవాళ్ళు. మీ ప్రాచీన గ్రంథాలూ, శాస్త్రాలూ పరిశోధించి దయచేసి స్వయంగా నిర్ణయించుకోండి.

అవకాశం లభించినప్పుడల్లా ఆదిమవాసులను నిర్మూలించి వాళ్ళ దేశాల నాక్రమించి అక్కడ సుఖంగా స్థిరపడడం ఐరోపీయుల కలవాటు. అందుచేత ఆర్యులుకూడా అట్లాగేచేసి ఉంటారని వాళ్ళు అనుకుంటారు. స్వదేశంలో లభించే వాటితో తృప్తిపడి జన్మభూమిని వదలకుండాఉంటే ఎందుకూపనికిరాని వ్యర్థులని పశ్చిమ జాతులవాళ్ళు భావిస్తారు. అందుచేత స్వదేశాలు విడిచి ప్రపంచంమీద పడి ఇతరులను కొల్లగొట్టి నానా హింసలూ పెట్టి సర్వనాశనంచేసి వాళ్ళ వాళ్ళ దేశాల నాక్రమించుకుని మేము చాలా గొప్పవాళ్ళమని విఱ్ఱవీగుతూ ఉండడం వాళ్ళ పద్ధతి. అందుకని ఆర్యులుకూడా తమలాగే ప్రవర్తించారని వాళ్ళంటారు. దీనికి ఋజువేమిటి? నీ ఊహ తప్ప మరేమైనా ఆధారముందా? నిరాధారమైన నీ ఊహలు నీ దగ్గరే ఉండనీ.

ఆర్యులు భారతదేశానికి మరో దేశంనుంచి వచ్చారని ఏ వేదంలో ఏ సూక్తంలో ఎక్కడ ఉన్నది? ఈ దేశంలోని ఆదిమవాసులను వాళ్లు నిర్మూలించారన్న దురూహ నీ కెట్లా కలిగింది? ఇటువంటి అసంబద్ధ ప్రలాపాలవల్ల నీకువచ్చే లాభమేమిటి? నీ ఊహ కాధారం రామాయణ

మంటావా? అయితే నీకాపుస్తకం అర్థమేకాలేదు. అర్థంకాకుండా అభూత కల్పన లెందుకు చేస్తావు?

రామాయణంలో ఏమున్నది? ఆర్యులు దక్షిణ భారతంలోని అనాగరక ఆదిమవాసులను జయించారనా? ఏమి తెలివి? రామచంద్రుడు నాగరకమైన ఆర్యజాతి మహారాజు. ఒప్పుకున్నాము. ఆయన పోరాడిన దెవరితో? లంకను పాలిస్తున్న రావణ మహారాజుతో! రామాయణం మళ్ళీ చదివి సరిగా అర్థంచేసుకో! రావణుడు నాగరకతలో రామచంద్రున కెంతమాత్రమూ తీసిపోడు సరిగదా అనేక విధాల అధికుడే అనిపిస్తాడు. అయోధ్యా నాగరకత కంటె లంకా నాగరకత ఎక్కువేగాని తక్కువకాదు. ఇక రాముడు దండకారణ్య వాసులయిన వానరులనూ, మిగిలిన భారతీయులనూ జయించాడన్న మాటల కర్థమేమిటి? ఆ వానరాది జాతుల వాళ్ళందరూ రామునకు స్నేహితులూ, సహాయకులూ. కాగా రాము డాక్రమించాడని మీరు చెప్పే వాలి రాజ్యమూ, గుహుని రాజ్యమూ ఎక్కడయ్యా ఉన్నది?

ఆర్య నాగరకతా వస్త్ర విశేషానికి మూలమైన మగ్గం జీవనదులతో కల కల లాడుతూ సమశీతోష్ణ స్థితిగతులతో ఎల్లప్పుడూ సస్య శ్యామలమై ఉండే సువిశాల సుందర భూభాగం! అత్యున్నత నాగరకతతోపాటు సగం సగం నాగరకతా, ఆటవిక జీవితమూ కల భిన్న వర్గాలున్నా మొత్తంమీద ఆర్యసంఘానికి చెందిన జాతియే దీని ప్రత్తి. వర్ణాశ్రమాచారాలే దీనికి పడుగూ. స్పర్ధా సంఘర్షణలను జయించడమే దీనికి పేకా.

ఐరోపీయులారా! మిమ్మల్ని ఒక మాట అడగాలని ఉన్నది. మీవల్ల అభివృద్ధి పొందిన దేశం ఒక్కటైనా ఉన్నదా? బలహీన జాతులు కనిపించినప్పుడల్లా ఎక్కడవాటి నక్కడే హతమార్చారు. ఆయా దేశాలను మీరాక్రమించుకున్నారు, అసలు వాళ్ళ నామరూపాలు లేకుండా పోయాయి. అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, పసిఫిక్ దీవులూ, దక్షిణ ఆఫ్రికా వీటన్నింటి చరిత్రా ఎలాఉన్నది? ఆయా దేశాల ఆదిమజాతులు ఈ పూట

ఎక్కడఉన్నాయి? అన్నీ నిర్మూలిత మయి పోయాయి. వాళ్లు మనుష్యులు కారు, అడవి జంతువులన్నట్లు అందరినీ మీరు ఘోరాతి ఘోరంగా చంపి పారేశారు. ఆపని చెయ్యడానికి శక్తిలేక మీరూరుకున్న ఒకటి రెండు చోట్లలో మాత్రమే ఇప్పటికీ ఆదిమవాసులు ఎవరైనా బ్రతికి ఉంటే ఉన్నారు.

భారతదేశం ఎన్నడూ ఈ పని చెయ్యలేదు. ఆర్యులు ఉదారులూ, దయావంతులూ. అపార పారావార సదృశమై, విశాలమైన వాళ్ళ హృదయాల్లో, అతి మానవ మహా ప్రతిభతో ఉజ్జ్వలమైన వాళ్ళ మనస్సుల్లో పైకి గొప్పగా కనిపించినా తత్త్వంలో కేవలం పాశవికమైన ఇటువంటి క్రూరకృత్యాలకు తావేలేకపోయింది. యథార్థం ఇదికాగా పాశ్చాత్యులన్న వాటికి స్వతంత్రమైన ఆలోచన లేకుండా ఊకొట్టే స్వదేశీయ మూర్ఖులను అడుగుతానూ, ఆర్యులేగనుక ఆదిమవాసులను నిర్మూలించి వాళ్ళ భూముల నాక్రమించుకున్నట్లయితే ఈ వర్ణాశ్రమ వ్యవస్థ ఉండడానికి వీలున్నదా?

తాము బ్రతకడానికి అందరినీ నిర్మూలించడమే ఐరోపీయ జాతుల లక్ష్యం. తమతోపాటుగా సమాన స్థాయికీ, వీలయితే సమున్నత స్థాయికీ అందరినీ సముద్ధరించడమే ఆర్యజాతి లక్ష్యం. ఐరోపీయుల నాగరకతా సాధనం కత్తి. ఆర్యుల సాధనం వర్ణవిభజనం. వివిధ వర్ణాలుగా విభక్తమయ్యే ఈ పద్ధతి వ్యక్తులు సాధించే విజ్ఞాన సంస్కృతులను పురస్కరించుకుని క్రమక్రమంగా ఉన్నతోన్నత స్థితులను అందుకుంటూ పరమోత్తమ నాగరకతను సాధించడానికి ప్రథమ సోపానం: ఐరోపాలో అన్నిరంగాల్లోనూ బలవంతులు గెలుస్తారు, దుర్బలులు మరణిస్తారు. భారత దేశంలో ప్రతి సాంఘిక నియమమూ బలహీనులను సంరక్షించడానికే ఉద్దిష్టమయింది.



# తృతీయ భాగము

## కొన్ని పరిశీలనలూ,

## హెచ్చరికలూ,

# పరిశీలనలు

## పురాణాల సత్య బోధకత్వం

(సంభాషణ భాగం - హిందూ - ఫిబ్రవరి 1897)

ఏదో ఒక చారిత్రక సత్యాన్ని ఆధారం చేసుకునో, చేసుకోకుండానో ప్రతి పురాణమూ ఒక మహత్తర సత్యాన్ని బోధిస్తుంది.

ప్రతి పురాణానికీ ఒక చారిత్రక సత్యం ఆధారమై ఉంటుంది. మానవజాతికి పరమార్థాన్ని బహుముఖాలుగా బోధించడమే పురాణాల లక్ష్యం. ఒకవేళ చారిత్రక సత్యం లేకపోయినా అవి బోధించే పరమార్థం దృష్ట్యా పురాణాలు మనకు ప్రమాణ గ్రంథా లవుతున్నాయి. ఉదాహరణకు రామాయణం చూడండి. ఉత్తమ శీలానికి దాన్ని ప్రమాణంగా స్వీకరించడానికి రాము డొకప్పుడు జీవించిన వ్యక్తి కావలసిన అవసరంలేదు. రామాయణ భారతాలు మన కాదర్శంగా చూపించే పరమోత్తమ ధర్మాలకు రామకృష్ణాది వ్యక్తుల యాథార్థ్యంతో నిమిత్తమే లేదు. వారు కల్పిత వ్యక్తులే అనుకున్నా మానవజాతి కా గ్రంథాలు చూపిస్తూ ఉన్న మేలు బంతుల దృష్ట్యా వాటిని పరమ ప్రమాణాలుగా స్వీకరించవచ్చు.

మన వేదాంతం అది బోధించే సత్యానికి ఏ వ్యక్తిమీదా ఆధారపడి లేదు. ధర్మశాస్త్రాల్లో లేని ఏ కొత్త విషయాన్నీ మౌలికంగా కృష్ణుడు బోధించలేదు. రామాయణమూ ఆ మాట అనడంలేదు. క్రీస్తు లేకపోతే

క్రైస్తవమూ, మహమ్మదు లేకపోతే మహమ్మదీయమూ, బుద్ధుడు లేక పోతే బౌద్ధమూ ఉండడానికే వీలులేదు. హైందవమతం ఆ విధంగా వ్యక్తుల మీద ఆధారపడింది గాదు. పురాణాలు చెప్పే తాత్త్వికసత్యాల విలువ కట్టడానికి అందలి వ్యక్తులు నిజమైనవాళ్ళా, కల్పితమైనవాళ్ళా అన్న ప్రశ్న పుట్టవలసిన అవసరమేలేదు.

మానవజాతికి జ్ఞానోపదేశం చెయ్యడమే పురాణాల లక్ష్యం. వాటిని ప్రవచించిన మహర్షులు కొందరు చారిత్రక వ్యక్తుల నేరుకుని తను అభీష్టాన్ని అనుసరించి వాళ్ళపై మంచి చెడ్డల నారోపించి మానవజాతికి విధి నిషేధాలను తెలియజేశారు. రామాయణంలో వర్ణితమైన విధంగా పదితలల రావణాసురుడు ఉండవలసిన అవసర మేమున్నది? దశముఖ రావణుడు ఉన్నా లేకపోయినా ఆ పాత్ర నిరూపించే సత్యం మనం తప్పక నేర్చుకోవలసిందే. కావలెనంటే కృష్ణుణ్ని మనమిప్పుడు మరింత ఆకర్షకంగా వర్ణించుకోవచ్చు. మనఆదర్శపు ఔదాత్త్యాన్నిబట్టి ఆవర్ణన ఆధారపడి ఉంటుంది. వర్ణనలు మారినా పురాణాల తాత్త్వికోత్కృష్టత అలాగే నిలబడి ఉంటుంది!

# వ్యతిరేకోద్యమాలు వేటికి వ్యతిరేకంగా బయలుదేరుతాయో వాటితోనే నశిస్తాయి

(భారతీయ చారిత్ర కావిష్కృతి - వి. సం. గ్రంథావళి. 6వ. సం)

దక్షిణ దేశంలో శంకరులూ, రామానుజులూ ఆధ్యాత్మి కౌన్నత్యాన్ని సాధించినప్పుడు భారతదేశానికి సహజమైన పద్ధతిలో జాతీయ సమైక్యమూ, శక్తిమంతమైన సామ్రాజ్యమూ వెంటవెంటనే వచ్చాయి. ఉత్తరభారతం మధ్య ఆసియానుండి వచ్చిన విజేతలకు పాదాక్రాంతమై ఉన్న ఆ రోజుల్లో భారతీయ మతానికీ, నాగరకతకూ దక్షిణదేశమే శరణ్యమై ఉన్నది. దక్షిణ దేశాన్ని లొంగదీయాలని మహమ్మదీయులు కొన్ని శతాబ్దాలు తంటాలు పడ్డారుగాని వాళ్ళ కక్కడ సరియైన స్థావరమే లభించలేదు. మిక్కిలి శక్తివంతమైన సమైక్య మొగల్ సామ్రాజ్యం ఇంచుమించు తన విజయాన్ని పూర్తిచెయ్యబోతున్నప్పుడు రామదాసస్వామీ, భక్త తుకారామూ బోధించిన మతంకోసం ప్రాణా లర్పించడానికి సిద్ధపడి దక్షిణదేశపు కొండల్లోనుండీ పీఠభూములలో నుండీ వేలకొలది అశ్వికదళాలు వెల్లివిరిసి ఎదురు కొన్నాయి. ఆ తర్వాత అల్ప వ్యవధిలోనే అంత మహత్తరమైన మొగల్ మహాసామ్రాజ్యమూ నామమాత్రమై పోయింది.

మహమ్మదీయుల పరిపాలనా కాలంలో ఉత్తర భారతంలోని ఉద్యమాలన్నీ విజేతల మతంలో చేరిపోకుండా జనసామాన్యాన్ని నిరోధించ

డానికే కృషిచేశాయి. తత్ఫలితంగా జాతిలో సాంఘికంగానూ, ఆధ్యాత్మికం గానూ సర్వులూ సమానులన్న భావం ప్రబలింది.

తాత్త్విక దృక్పథాల్లో ఎన్నెన్ని భేదాలున్నా రామానందుడు, కబీరు, దాదూ, చైతన్యులూ, నానక్ మొదలైన వాళ్ళు స్థాపించిన సంఘాల వారందరూ మానవ సమానతను అంగీకరించారు. వాళ్ళ శక్త్యుత్సాహాలన్నీ జనసామాన్యంపై ఇస్లాం ప్రభావం పడకుండా చెయ్యడంలోనే వినియోగమైనందు వల్ల కొత్త భావాలూ, లక్ష్యాలూ అందించడానికి అవకాశం లేకపోయింది. మహమ్మదీయుల మత మౌఢ్యాన్ని నిశ్శక్తికంచేసి జనసామాన్యం స్వమతంలోనే ఉండేటట్లు చెయ్యడమనే ప్రధాన లక్ష్యంలో కృతకృత్యులే అయినా వారు జీవించ డానికి కష్టపడుతూ తమ్ము తాము రక్షించుకున్నవాళ్ళు మాత్రమే అయ్యారు.

అయినప్పటికీ ఉత్తరదేశంలో ఒక మహా ప్రవక్త నిర్మాణాత్మక ప్రతిభతో ఆవిర్భవించారు. సిక్కుల చివరి గురువైన గోవిందసింగే ఆ మహానుభావుడు. ఆయన ఆధ్యాత్మిక కృషి ఫలితంగానే సిక్కులు సుసంఘ టితులై రాజకీయ విజయాలను సాధించారు. ఇది సర్వ జగద్విదితమైన విషయం. భారతదేశ చరిత్రలో ఎక్కడ గమనించినా ఆధ్యాత్మికౌన్నత్యాన్ని అనుసరించి పరిమితంగానో, విస్తృతంగానో దేశంలో రాజకీయ సమైక్యం ఏర్పడుతూ ఉండడమూ, తన జన్మకు హేతువైన ఆధ్యాత్మికాశయాన్ని అది సమర్థిస్తూ ఉండడమూ కనిపిస్తూనే ఉంటుంది.

కాని మహారాష్ట్రులూ, సిక్కులూ స్థాపించిన సామ్రాజ్యాలకు ఉద్బోధకాలయిన ఆధ్యాత్మికాశయాలు కేవలం ప్రతిక్రియా రూపమైనవి.

అందుచేతనే పునహా, లాహోరుల ఆస్థానాల్లో, మొగలుల ఆస్థానాల్లోని ధీ వైభవమే కనిపించదు. ఇక మాళవా, విద్యానగరాల ప్రతిభ ఎలా సాధ్య మవుతుంది? ధీవిషయికంగా చూస్తే భారతదేశ చరిత్రలో అది అతి హీన మైన కాలం. సామూహిక మౌఢ్య ప్రకోపానికీ, హృదయ పూర్వక పర సంస్కృతి విద్వేషానికీ ప్రాతినిధ్యం వహిస్తూ హఠాత్తుగా ఉద్భవించిన ఈ రెండు సామ్రాజ్యాలూ పరమద్వేష్యులయిన మహమ్మదీయుల పరి పాలనను పడగొట్టడంతో ఉద్బోధకశక్తి నశించి తామూ కూలిపోయాయి.



# వ్యక్తినీ, జాతినీ ఉద్ధరిస్తే సదాచారాలు అనుసరిస్తాయి

(సూక్తులూ, ప్రవచనములూ - వి. సం. గ్రంథావళి. 5వ సం)

సాంఘిక సదాచారాలన్నీ లోని ఆధ్యాత్మిక శక్తుల బాహ్య రూపాలే. ఆ శక్తుల దార్ఢ్యాన్ని పురస్కరించుకుని సంఘం వాటి కనుగుణంగా తన్ను తాను అమర్చుకుంటుంది. ప్రతివ్యక్తీ తన మోక్షానికి తానే కృషి చెయ్యాలి. మరొక మార్గంలేదు. అలాగే జాతులున్నూ. జాతికి విశిష్టమైన మహా ధర్మాలు దాని ఉనికికే మూలహేతువులు. అందుచేత వాటిని మరొక జాతి పద్ధతిని బట్టి మార్చి వెయ్యడం సాధ్యంకాదు. ఇంతకంటె ఉత్తమ ధర్మాలూ, ఆచారాలూ వాటంతట అవి ఆవిష్కృత మయ్యేవరకూ పాత

వాటిని భగ్నం చెయ్యడం వినాశానికే దారి తీస్తుంది. పెరుగుదల ఎప్పుడూ సహజంగానూ, క్రమంగానూ జరగవలసిందే.

ఉన్న ధర్మాచారాల దోషాల నెత్తిచూపడం చాలా తేలిక. అన్ని విధాలా సంపూర్ణమైనవి ఎక్కడా ఉండవు. వ్యక్తులు ఏ ఆచారాల ననుసరించి బ్రతుకుతూ ఉన్నా వాళ్ళు తమ లోపాలను దిద్దుకుని పరిపూర్ణులు కావడానికి సహాయపడేవాడే నిజంగా మానవ జాతికి ఉపకారం చేసేవాడు. వ్యక్తు లుద్ధరింపబడితే వాళ్ళనుబట్టే జాతీ, దాని ఆచారాలూ తప్పనిసరిగా ఔన్నత్యాన్ని పొందుతాయి.

చెడ్డ నియమాలనూ, ఆచారాలనూ మహాత్ము లుపేక్షిస్తారు. లిఖితం కాకపోయినప్పటికీ అంతకంటె బలవత్తరములైన ప్రేమ, సానుభూతీ, నిష్ఠా మొదలైనవి వాటి స్థానాన్ని ఆక్రమిస్తాయి. న్యాయశాస్త్రాలతో నిమిత్తం లేకుండా, ఇది మంచిదా అది మంచిదా అన్న చర్చలతో అవసరంలేకుండా, తన్ను తాను నడుపుకోగలిగేటట్లు ఔన్నత్యాన్ని పొందిన జాతి నిజంగా ధన్యమైనది. ఉత్తమ పురుషులు సర్వ ధర్మాలకు అతీతు లౌతారు. ఎవరు ఏ పరిస్థితులలో ఉన్నా తోడివాళ్ళందరినీ ఉద్ధరించడానికి సహాయపడతారు.

అందుచేత వ్యక్తులు సమర్థులై, శక్తిమంతులై ప్రతివాడూ తనలోని దైవత్వాన్ని గుర్తించిననాడే భారతదేశానికి మోక్షం లభిస్తుంది.



# దైవంతో యోగం
## వ్యక్తిగతంగాని సామూహికం కాదు

(భక్తి యోగోపన్యాసములు : వి. సం. గ్రంథావళి. 4వ సం.)

సామూహికమైన మతం ఎక్కడా ఉండడానికి వీల్లేదు. మతం చూపించే నిజమైన ప్రభావం కేవలం వ్యక్తిగతమై ఉంటుంది. నా ధ్యేయం నాకు ఉన్నది. అదే ఇతరులకూ ధ్యేయం. రావలసిన అవసరం లేదని నాకు తెలుసును కాబట్టి నా ధ్యేయాన్ని నేను పవిత్రంగానూ, రహస్యం గానూ అట్టేపెట్టుకోవాలి. నా ధ్యేయ మేమిటో ప్రతివానికీ చెప్పాలనుకుని వాళ్ళ సాధనకు విఘాతం ఎందుకు కల్పించాలి? నే నా పని చేస్తే వాళ్ళు నాతో పోట్లాటకు వస్తారు. నేను చెప్పకుండా ఉంటే నా మీదికి రాలేరు. నేను చెప్పడం జరిగితే వ్యతిరేకించడం జరిగితీరుతుంది. అందుచేత చెప్పి ప్రయోజనమేమిటి? నీ ధ్యేయమైన ఇష్టదేవతను నీవు పరమ రహస్యంగా ఉంచుకోవాలి. అది నీకూ భగవంతునకూ తెలియవలసిందే గాని ఇతరుల కవసరంలేదు.

మతంలో సిద్ధాంత భాగాన్ని బహిరంగంగానూ, సామూహికంగానూ బోధించవచ్చు. అంతకంటె ఉన్నతమైన సాధనాభాగం ఎన్నటికీ బహిరంగం కాదు. ఒకక్షణం వ్యవధిలో అనుకున్నప్పుడల్లా ధ్యానయోగం పొందడం నాకు సాధ్యంకాదు. అటువంటప్పుడు అంతా ఒకచోట చేరి

ఒకే విధంగా గొణిగినందువల్లా, కళ్ళు మూసుకున్నందువల్లా వచ్చే ఫలిత మేమిటి? అది కేవలం మతాన్ని పరిహసించడం, ఘోరంగా దూషించడం : ఈ కాలపు చర్చీలలో జరిగే తతంగమంతా దీనిఫలితమే. ఈ విధమైన మతవేధను మానవు లెలా సహించగలరు ? కలిసి నిలబడు, మోకరిల్లు· పుస్తకం తీసుకో - అన్నీ నిర్ణీతంగా జరగవలసిందే : అయిదు నిమిషాలు ధ్యానం, అయిదు నిమిషాలు తర్కం, అయిదు నిమిషాలు ప్రార్థన- అంతా ముందే ఏర్పాటు అయిపోయింది. ఈ కసరత్తులే మతాన్ని పూర్తిగా తరిమివేశాయి.

సిద్ధాంతాలు. వాదాలు, తత్త్వాలు మొదలైన వన్నీ మనస్తృప్తిగా చెప్పనివ్వండి చర్చీలను. మతంలో ప్రధాన భాగమైన ఆరాధన విషయంలో చర్చీలకు జోక్యం ఉండగూడదు. జీసస్క్రీస్తు చెప్పినట్టు 'ప్రార్థన చేసే టప్పుడు నీ గదిలోకి వెళ్ళు. తలుపులు వేసేసుకున్న తర్వాత రహస్యంలో ఉన్న నీ తండ్రిని ఏకాంతంగా ధ్యానించు.'



# ప్రతిమా ద్వేషులలో ప్రతిమారాధనము

(భక్తియోగోపన్యాసములు - వి. సం. గ్రంథావళి. 4వ. సం)

ఏదో ఒక రూపంలో ప్రతిమలు ప్రపంచమంతటా ఉన్నాయి. అన్ని మతాలవారికీ ఉన్నాయి. ఉత్తమ మయిన మనుష్య రూపంలో కొంద రారాధిస్తున్నారు. ప్రతిమారాధన అవసరమైన పక్షంలో జంతు, భవనాది రూపాల కంటె మనుష్య రూపాన్నే నేను స్వీకరిస్తాను.

ఒకవర్గం ఒక రకమైన ప్రతిమ మంచిదంటే రెండవ వర్గం దాన్నే చెడ్డ దనుకుంటోంది. భగవంతుడు పావురం రూపలో వస్తే క్రైస్తవులకు బాగానే ఉంటుంది. కాని హిందువు లన్నట్లు ఏ మత్స్యరూపంలోనో వస్తే అది తప్పూ, మూఢవిశ్వాసమూ. ఒక పెట్టిమీద ఒక పుస్తకం ఉండి, ఇద్దరు దేవదూతలు అటూ ఇటూ కూర్చున్నట్లున్న రూపం యూదుల కారాధ్యం. మనుష్య పురుషరూపమో. స్త్రీ రూపమో, అయితే వాళ్ళకు దుర్భరమనిపిస్తుంది. మహమ్మదీయులు ప్రార్థన చేసేటప్పుడు మనస్సుల్లో కాబాతో ఆలయాన్నీ, అందులో ఒక నల్లని శిలనూ భావించి పడమటికి తిరగడం మంచి దనుకుంటారు. చర్చి రూపాన్ని భావిస్తే అది విగ్రహా రాధన - పనికి రాదంటారు.

విగ్రహారాధనతో వచ్చిన ఇబ్బంది ఇది. కాని ఇవన్నీ ఉన్నత కక్ష్యలందుకోవడానికి తప్పనిసరి అయిన దశలనిపిస్తాయి.

# హఠాత్తుగా సమాధి తటస్థపడడం అపాయకరం

( రాజ యోగము - వి. సం. గ్రంథావళి. 1వ సం )

మనస్సు అమనస్కమై తర్కాతీతమైన ఉన్నత స్థితిని పొందుతుంది. దాన్నే సమాధి అంటారు. ఆ స్థితిలో అది దేశకాలముల కతీతమైన పరమార్థ విజ్ఞానాన్ని మానవునకు కలిగిస్తుంది. యోగులీ విషయాన్ని నిరూపిస్తున్నారు. అట్టి ఉన్నత మనస్థ్సితి ఒక్కొక్కప్పుడు సాధనా మార్గం తెలియనివారికిగూడా హఠాత్తుగా లభించవచ్చు. మానవుడు సాధారణ మానవ ప్రకృతి నధిగమించి ఆ స్థితిలోకి తూలిపడతాడు.

అలా తూలిపడడం చాలా ప్రమాదకరమని యోగులు చెప్తారు. చాలామంది ఉన్మత్తులై పోతూఉంటారు. ఇతర విధాల ఎంత గొప్పవాడైనా సాధనా మార్గం తెలియకుండా ఆ స్థితిలోకి తూలిపడ్డవాళ్ళకు ఉత్తమ జ్ఞానంతో తీవ్రమౌఢ్యమూ నియమంగా వస్తుంది. వాళ్లు తేలికగా విభ్రాంతులౌతారు. గేబ్రియల్ దేవదూత తానున్న గుహలోకి ఒక రోజున వచ్చి హరాక్ అనే దివ్య హయంమీద తన్ను తీసుకుపోయాడనీ తాను స్వర్గాన్ని చూచాననీ మహమ్మదు ప్రకటించాడు. ఇటువంటి విభ్రాంతుల మాట ఎలాఉన్నా మహమ్మదు కొన్ని మహత్తర సత్యాలు చెప్పాడు.

కొరాన్ చదివి చూస్తే అత్యద్భుత సత్యాలతోపాటు మూఢ విశ్వాసా లనేకం కనిపిస్తాయి. వాటి నెలా సమర్థించడం? ఆ మహానుభావుడు దివ్యావేశం పొందాడు. అందులో సందేహంలేదు. కాని ఆ ఆవేశం

అనుకోకుండా తటస్థించిందే కాని సాధించింది కాదు. ఆయన సక్రమా భ్యాసంతో సుశిక్షితుడైన యోగి కాడు. ఆయ నేంచేశాడో ఆయనకే తెలియదు. మహమ్మదు ప్రపంచానికి చేసిన మేలు చూడండి. దాంతోపాటే ఆయన మత మౌఢ్యంవల్ల దాపురించిన కీడు చూడండి. ఆయన బోధల వల్ల కొన్ని లక్షలమంది దారుణ దుర్మరణం పొందారు; బిడ్డలను కోల్పోయిన తల్లులూ, అనాథలైన పసివాళ్ళూ లెక్కలేరు. దేశాలకు దేశాలే సర్వనాశన మయ్యాయి. కోట్లకొలది జనులు హతులైపోయారు.

గొప్ప ప్రవక్తలైన మహమ్మదు మొదలయినవాళ్ళ జీవిత చరిత్రలు పరిశీలిస్తే ఇటువంటి ప్రమాదం ఉన్నట్లు స్పష్టమవుతుంది. అయినా వాళ్ళందరూ దివ్యావేశం పొందినవాళ్ళే, భావావేశ ప్రకోపంతో సమాధిగతుడైన ప్రతి ప్రవక్తా ఆ స్థితినుండి కొన్ని సత్యాలూ ఆవిష్కరించాడు; వాటితోపాటే మూఢ విశ్వాసాలనూ, మత మౌఢ్యాన్నీ తెచ్చిపెట్టాడు. తాను బోధించిన సత్యాలతో లోకానికెంత సహాయం చేశాడో వీటితో అంత హానీ చేశాడు. ఎన్నో అసంబద్ధాలతో కూడిన మానవ జీవితానికి హేతు వేదో తెలియడానికి హేతువాదం చేసే మనస్సు నధిగమించాలి. కాని ఆ పని శాస్త్రీయంగా, నెమ్మదిగా, సక్రమాభ్యాసంతో చేసి మౌఢ్యాన్ని సర్వాత్మనా తొలగించివెయ్యాలి!

—o:*:o—

# హెచ్చరికలు

## మీరే! ఆంగ్లేయులైన భారతీయులు!

(తూర్పు పడమరలు - వి. సం. గ్రంథావళి 5వ సం)

మీరూ ఈ విషయం బాగా అర్థం చేసుకోండి. మీరంటే నాఉద్దేశం బుద్ధుల్లో చేతల్లో పూర్తిగా ఆంగ్లేయులై పోయిన భారతీయులు. అనన్య గతికులై పోయి 'మేము దిగజారి దిగజారి పరమ మూర్ఖులమయ్యాము. మీరే మాకు దిక్కు. మాయందు దయదలచి మమ్మల్ని ఈ దుస్థితిలో నుండి ఉద్ధరించండి.' అంటూ దివారాత్రాలు ఐరోపీయులను దేవురించే మీరు ఈ విషయం గ్రహించండి. 'ఓ దేవా! నీకు జోహారు' అని పాటలు పాడుతూ, జీసుస్రీస్తు భారత దేశానికి వచ్చాడనీ. కాలం పరిపక్వం కావడంతో దేవుని అనుగ్రహం పరిపూర్ణమవుతోందనీ ఊరూరా గోల పెట్టే మీరుకూడా ఈ విషయం గ్రహించండి. వెఱ్ఱి నాయనలారా! జేసస్సూ రాలేదు. జెహోవా రాలేదు. మీరెంత ప్రాధేయపడినా వాళ్ళు రాలేరు. వాళ్ళిప్పుడు తమ తమ దేశాలు బాగుచేసుకోవడంలోనే నిమగ్నులై ఉన్నారు. మన దేశానికి వచ్చే తీరిక లేదు వాళ్ళకు!

ఇక్కడ మన దేశంలో అనాదిగా ఉన్నట్టే ఆది శివుడు దివ్యపీఠం అధిష్ఠించి ఉన్నాడు. జగజ్జనని రక్తకాళి పూర్వంవలెనే ఆరాధింపబడు తోంది. ప్రేమ మయుడు, యదుకులమౌళి శ్రీకృష్ణుడు వేణుగానం చేస్తూనే

ఉన్నాడు. ఒకప్పుడీ ఆదిశివుడు వృషభారూఢుడై డమరుకాన్ని మ్రోగిస్తూ యావద్భారతమూ పర్యటించడమేకాక సుమాత్రా, బోర్నియో, ఆస్ట్రేలియా లను చుట్టి అమెరికా తీరాలవరకూ వీర విహారం చేశాడు. ఈ శివుడే తన వృషభాన్ని టిబెట్టు, చీనా, జపానులలోనే కాక సైబీరియావరకూ త్రిప్పుకొని వచ్చాడు. ఇప్పటికీ తన ప్రభావం చూపుతూనే ఉన్నాడు కాళీమాత నేటికీ చైనా జపానులలో పూజలందుకుంటూనే ఉన్నది. ఆమెనే క్రైస్తవులు మేరీ కన్యగా మార్చి జేసను క్రీస్తు తల్లిగా ఆరాధిస్తున్నారు'

హిమాలయాలు చూడండి! అక్కడే ఆదిశివుని నివాసం. కైలాసం ఉన్నది. ఆ దివ్యపీఠాన్ని వింశతిభుజుడైన దశకంఠ రావణుడు తన బలమంతా ఉపయోగించి కదిలించలేక పోయాడు. ఇప్పుడు క్రైస్తవమత ప్రచారకులు పూనుకున్నారా ఆ పనికి? ఎంత వెఱ్ఱి? ఈ భారత దేశంలో డమరుకాన్ని మ్రోగిస్తూ ఆదిశివుడు ఎప్పుడూ ఉంటాడు. కాళీమాత జంతు బలులతో అర్చింపబడుతూనే ఉంటుంది. శ్రీ కృష్ణుడు వేణుగానం చేస్తూనే ఉంటాడు. సుస్థిరమైన హిమాలయాలవలె వాళ్ళు సుస్థిరులే! క్రైస్తవులు గాని మరెవరుగాని, ఎన్నెన్ని ప్రయత్నాలు చేసినా వాళ్ళు మాత్రం అణు మాత్రమైనా కదలరు.

వీళ్ళని మీరు సహించలేకపోతే మీరే వెళ్ళిపొండి ! మీ పదిమంది కోసం జాతి యావత్తూ ఓపిక నశించి విసుగుపుట్టి చచ్చిపోవాలా? ఇక్కడి నుంచి మీరే ఎందుకు వెళ్ళిపోరు? ఇంత విశాల ప్రపంచంలో మీరు యథేచ్ఛగా మెయ్యడానికి కావలసిన పొలాలే లేవా? లేకేం ఉన్నాయి. ఉన్నా మీరు వెళ్ళరు. అంత మంచిపనిచేస్తే శక్తి ఎక్కడ ఉన్నది మీకు? ఆదిశివుని అన్నం తింటూ అతన్ని చులకనచేసి అతనికే ద్రోహంచేస్తూ విజాతీయ రక్షకుణ్ని పొగుడుతూ పాటలు పాడుతారు.

విజాతీయులకు మోకరిల్లి 'మేము నీచులము. మే మెందుకూ పనికి రాని వాళ్ళము. మేము దిగజారిపోయాము. మా కున్నదంతా పైశాచికమే.

మమ్మల్ని రక్షించండి' అంటూ ప్రాధేయపడే భారతీయులకు మన మిలా చెప్పాలి. "అవును. మీమాట నిజమే కావచ్చు. నిజమే చెప్తున్నామని మీ రంటున్నారు కాబట్టి మిమ్మల్ని నమ్మక పోవడంలో అర్థంలేదు. కాని మీరు మేము, మేము అంటూ ఆ మేములో జాతినంతటినీ కలుపుతా రెందుకు? ఇదేం మర్యాద బాబూ?"



# రండి, రండి! మనుష్యులు కండి!

(వివేకానంద లేఖావళి)

ఇక మీరు........ ఎవరయ్యా మీరు? అర్థంలేని వాగుడు వాగుతూ జీవితాలు వ్యర్థంచేసే వదరబోతు లెవరయ్యా మీరు? రండి. ఒకసారి వచ్చి ఈ ప్రజలను చూడండి. తర్వాత వెళ్ళి సిగ్గుతో ముఖాలు కప్పు కుందురుగాని. వట్టి సోమరి జాతి! బయటికి వస్తే కులం పోతుందట! అందుకని ఉన్న గూట్లోనే ఉంటారు. ఒకమూల చతికిలబడి తలల మీద మౌఢ్యం కుప్పలు కుప్పలుగా పేరుకొనిపోగా, తరతరాల సాంఘిక దౌర్జన్యంతో మానవత్వం పూర్తిగా నశించి, ఎంతసేపూ ఉన్న కాస్త శక్తినీ, ఇది భోజ్యమా, అది భోజ్యమా; స్పృశ్యమా, అస్పృశ్యమా అంటూ వృథాచర్చలతో వినియోగిస్తూ శతాబ్దాలు శతాబ్దాలు గడిపినవారు ఎవరయ్యా మీరు? ఇప్పుడు మాత్రం మీరు చేస్తున్న దేమిటి?

పుస్తకాలు చేత్తో పుచ్చుకుని బీచి షికార్లు కొట్టుతూ, ఒంటబట్టని విలాయితీ చదువులో వచ్చీ రానివి ఉచ్చరిస్తూ, ముప్పయి రూపాయీల గుమాస్తా పని సాధించడమో మహాఅయితే యువభారత పరమ లక్ష్య

మయిన లాయరు కావడమో జీవితగమ్యమయి, నాన్నా అన్నమంటూ కాళ్ళకు చుట్టుకుని గోలపెట్టే పిల్లలతో ప్రతి విద్యార్థీ సతమత మవు తున్నాడు. మిమ్మల్నీ, మీ పుస్తకాల్నీ. మీ గౌనులనూ, మీ యూనివర్సిటీ డిగ్రీలనూ ముంచేసేటందుకు సముద్రంలో సరిపడ నీళ్ళు లేవా ?

ఇప్పటికైనా బుద్ధితెచ్చుకోండి ! మనుష్యులుకండి !



## భారతదేశపు అగ్రశ్రేణికి చెందిన వారు!

ఆర్యుల సంతతివాళ్ళమని మీ రెంత కదను త్రొక్కినా, ప్రాచీన భారత వైభవాలను గూర్చి దివారాత్రాలు మీ రెంతగానం చేసినా, మీ ఆభిజాత్యాన్ని గూర్చి మీ రెంత గర్విస్తున్నా నిజానికి మీరు బ్రతికి ఉన్నారనా మీ ఉద్దేశ్యం? పదివేల సంవత్సరాలనాటి బుట్టబొమ్మలు మీరు! మీ పూర్వులు జీవచ్ఛవాలని ఎవరిని అధిక్షేపించారో వాళ్ళల్లోనే ఈ పూట భారతదేశంలో ఏ కొంచెమైనా జీవ మున్నది. నిజంగా జీవచ్ఛవాలైంది మీరు !

మీ ఇళ్ళూ, మీ పరికరాలూ, పురాతన వస్తు ప్రదర్శన శాలలోని నమూనాల్లా ఉంటాయి. అవన్నీ జీవం లేనివీ, అంత పాతవీ. మీ ఆచారాలనూ, అలవాట్లనూ, మీ జీవన విధానాలనూ ప్రత్యక్షంగా చూచినవాళ్ళు కూడా అమ్మమ్మల కథలు వింటున్నట్లు భావిస్తారు. మీతో సన్నిహిత పరిచయం ఏర్పడిన తర్వాత గూడా ఇంటికి వచ్చి బొమ్మల్ని చూచి వచ్చా మనుకుంటారు.

ఈ మాయా ప్రపంచంలో మీకంటే మాయ లేదు. భారతదేశపు అగ్రశ్రేణికి చెందిన మీరే ఎడారుల్లో ఎండమావులు ! భూతకాల క్రియా రూపాలన్నీ కలగాపులగమై ఏకమైనట్టుంటారు మీరు. అజీర్తితో వచ్చే స్వప్నదృశ్యాల్లో తప్ప వర్తమానంలో మీ రెవ్వరికీ కనిపించరు. మీరు శూన్యస్వరూపాలు. భవిష్యత్తు దృష్ట్యా మీరు లేనట్టే లెక్క! స్వప్న జగత్తుకు చెందిన మీరు ఇంకా ఇక్కడ ఎందుకయ్యా తిరుగుతారు? గతించిన ప్రాచీన భారతానికి చెందిన ఎండిపోయిన ఎముకల గూళ్ళు గదా మీరు ! త్వరలో దుమ్మయిపోయి గాలిలో కలిసిపోరేం ?

అవునవును. మీ వేళ్ళ ఎముకలమీద మీ పూర్వులు పెట్టిన రాళ్ళ ఉంగరాలున్నాయి. కుళ్ళుతున్న మీ కళేబరాల్లో ప్రాచీన నిధు లనేకం దాగి ఉన్నాయి. ఇంతవరకూ మీకు వాటిని మరొకరి కివ్వడానికి అవకాశం కలగలేదు. ఇప్పు డీ బ్రిటీషు పరిపాలనలో అందరూ చదువుకునే రోజులు వచ్చాయికాబట్టి ఇప్పుడైనా మీ వారసుల కందించండి. ఇంకా చూస్తారేం ? వీలైనంత త్వరగా చెయ్యండి. మీ అంతట మీరు శూన్యంలో కలసిపొండి. మీ స్థానంలో నవభారతాన్ని రానివ్వండి.

నాగలి పుచ్చుకుని పొలాలు దున్నే రైతుల గుడిసెలలోనుండి, చేపలుపట్టే బెస్తవాళ్ళ గూళ్ళల్లోనుండి, చెప్పులు కుట్టే మాదిగలూ, వీధు లూడ్చే పాకీలూ మొదలైన సామాన్య జనుల నివాసాల్లో నుండి నవ భారతాన్ని రానివ్వండి. పచారికొట్లూ, కమ్మరి కొలిమీ, కుమ్మరి ఆవమూ అన్నీ నవభారతానికి జన్మస్థలాలే కానివ్వండి. కొండలూ, గుట్టలూ, వాగులూ, డొంకలూ, కోనలూ, అరణ్యాలూ అన్నిటిలోనుంచీ నవ భారతాన్ని ఆవిర్భవించనివ్వండి !

ఈ జనసామాన్యం కొన్ని వేల సంవత్సరాలుగా దుర్భర పరపీడన కాహుతి యయి నోరూ వాయీ లేకుండా ఎన్నో కష్టాల ననుభవించింది, అందుచేతనే దాని కత్యద్భుతమైన క్షమాశీలం వచ్చింది. తెంపులేని

దుఃఖాన్ని అనుభవించినందువల్ల అకుంఠితమైన జీవశక్తి కలిగింది. పిడికెడు బియ్యంతో కడుపులు నింపుకుని వాళ్లు ప్రపంచాన్ని ఊపివెయ్య గలరు. ఒకటి రెండు ముద్దలే తిన్నా వాళ్ళ శక్త్యుత్సాహాలను భరించడానికి ఈ ప్రపంచం చాలదు. క్రింద పడ్డ ప్రతి రక్తబిందువులోనుండీ తనవంటి రాక్షసుడు మరొక డుద్భవించే శక్తి ఉన్నట్టు దుర్గా సప్తశతిలో వర్ణింప బడిన రక్తబీజ రాక్షసునివలె ఈ జన సామాన్యానికి కూడా తరగని జీవ శక్తి ఉన్నది. దీనికి తోడు ప్రపంచంలో మరెచ్చటా కనిపించని పవిత్ర మైన నైతిక జీవనంవల్ల లభించిన పరమాద్భుతశక్తి కూడా వాళ్ళలో ఉన్నది. ఆ శాంతీ, ఆ తృప్తీ, ఆ ప్రేమా మౌనంగా నిర్విరామంగా కృషి చేసే ఆ శక్తీ, అవసర సమయాల్లో సింహాల్లా దూకే ఆ సాహసమూ – ఇంకెక్కడ కనిపిస్తాయి నీకు ?

ఓ భూతకాల కంకాళాల్లారా ! మీ తర్వాత వచ్చే భవిష్యద్భారత నిర్మాత లదుగో మీ కళ్ళముందున్నారు. మీ దగ్గరున్న నిధి నిక్షేపాలూ, ఆభరణాలూ వాళ్ళ కిచ్చెయ్యండి, త్వరగా ఇవ్వండి. వెంటనే మీరు అదృశ్యమై పోయి ఇక ఎన్నడూ కనిపించకండి. కాని చెవులు మాత్రం తెరుచుకుని ఉండండి. మీ రదృశ్యమైపోయిన మరుక్షణంలో విశ్వా న్నంతటినీ ప్రతిధ్వనింపచేస్తూ కోటి పిడుగుల పాటవంతో నవభారత ప్రథమోత్సాహ కంఠస్వానం 'జై జై గురూ !' అంటూ మీకే వినిపిస్తుంది.

—o—

# చైతన్యుని 'దివ్య ప్రేమ' కెంత వైపరీత్యం ?

(సంభాషణలూ, వాకోవాక్యాలు; వి. సం. గ్రంథావళి 5వ. సం)

శ్రీ చైతన్యస్వామి లోకోత్తర సర్వసంగపరిత్యాగి. స్త్రీతోగాని దైహిక వాంఛలతోగాని ఆయన కేమీ సంబంధంలేదు. కాని చైతన్యుల అనంతరం వారి శిష్యులు తమ సంఘంలో స్త్రీలను చేర్చుకుని విచక్షణ లేకుండా కలిసిమెలిసి తిరిగి ఆయనపేరుమీదుగా అంతా రసాభాస చేశారు. చైతన్యప్రభువు తమ జీవితం ద్వారా బోధించిన ప్రేమాదర్శం స్వచ్ఛాతి స్వచ్ఛమైనది. అందులో మోహానికిగాని స్వార్థానికిగాని అవకాశమే లేదు. స్త్రీ పురుష భావాని కతీతమైన ఆ ప్రేమ సామాన్య జనుల కెన్నటికీ అందదు.

తర్వాత వచ్చిన వైష్ణవ గురువులు చైతన్య ప్రభువు జీవితంలో ప్రధానమైన నిస్సంగత్వానికి ప్రాముఖ్యమివ్వక వారి ప్రేమాదర్శానికే ప్రాముఖ్యమిచ్చి దాన్ని ప్రజలకు బోధించడానికి తమ శక్తి యుక్తులన్నీ వినియోగించారు. కాని సామాన్యులైన ప్రజలు అత్యున్నతమైన ఆ దివ్య ప్రేమాదర్శాన్ని గ్రహించి తదనుగుణంగా నడుచుకోలేక మామూలు స్త్రీ పురుష ప్రేమగా భావించి మిక్కిలి నైచ్యంలో పడిపోయారు.

అందలి ఆదర్శాన్ని అజ్ఞుల కందించడంవల్ల ఈ జాతి ఏమయిందో చూడండి. ఆ ప్రేమ ప్రచారంతో ఈ జాతి యావత్తూ స్త్రీత్వాన్ని పొంది స్త్రీ జాతి అయిపోయింది. ఒరిస్సా అంతా భీరువుల నివాసమయింది.

కడచిన నాలుగు వందల సంవత్సరాలుగా బెంగాలు రాధా ప్రేమ వెంటబడి పౌరుషాన్ని ఇంచు మించు కోల్పోయింది. ప్రజలకు ఏడుస్తూ గోలపెట్టడం తప్ప ఇంకేమీ చేతకాదు. ఇది జాతీయలక్షణమైపోయింది కూడాను. జాతి భావాలకూ, ఆలోచనలకూ సూచకమైన వాళ్ళ సారస్వతాన్ని చూడండి. ఈ నాలుగువందల యేళ్ళల్లో వచ్చిన వంగ సాహిత్యమంతా ఈ ఏడుపు గోలకే అంటిపెట్టుకునిఉంది. నిజమైన వీరావేశాన్ని కలిగించే కవిత్వమే పుట్టలేదు.

హృదయంలో మోహం అణుమాత్రం ఉన్నా ప్రేమకు తావేలేదు. పూర్తిగా నిస్సంగులైన మహానుభావులకు, ధీరాతి ధీరులైన మహాత్ములకు మాత్రమే ఆ దివ్యప్రేమ కధికారం ఉంటుంది. అంత మహోన్నతమైన ఆ ప్రేమాదర్శాన్ని సామాన్య జనులకందిస్తే- తాను స్త్రీ అనీ భగవంతుడు పురుషుడనీ అతని ప్రేమకై పరితపించడమే ధ్యానమార్గమనీ బోధిస్తే - వాళ్ళ హృదయాల్లో గాఢమై ఉండే లౌకిక భావమే ప్రబలమై ఎంతసేపూ తమ తమ భార్యలను స్మరిస్తూ ఉండడమే తటస్థించగా ఫలితం ఏమవుతుందో వేరే చెప్పనక్కరలేదు.



# క్రైస్తవ మత ప్రచారకుల నుద్దేశించి:
# 'క్రీస్తు పేరుతో హిందూమతాన్ని నిందించడం మానండి!'

(మదరాసు సన్మాన పత్రానికి సమాధానం:- వి. సం. గ్రంథావళి 4వ. సం.)

నేను ఏ మతానికైనా వ్యతిరేకి ననడం నిజం కాదు. అలాగే భారత దేశంలోని క్రైస్తవ మత ప్రచారకులంటే నాకుగిట్ట దన్నమాటా నిజం కాదు. కాని వాళ్ళు అమెరికాలో డబ్బు సంపాదించడానికి అవలంబించే పద్ధతులలో కొన్నింటిని తీవ్రంగా వ్యతిరేకిస్తాను. వాళ్ళ బడిపిల్లల పుస్తకాల్లో హిందూమాత తన బిడ్డలను గంగానదిలో మొసళ్ళకు ఆహారంగా పారవేస్తున్నట్లు బొమ్మలు వేస్తారు ఏమిటా బొమ్మల కర్థం? తల్లికి నల్లరంగూ కుఱ్ఱవాడికి తెల్లరంగూ వెయ్యడం ఎక్కువ సానుభూతి కలిగించి ఎక్కువ డబ్బు గుంజడానికే కదూ! చచ్చి దయ్యమై తన శత్రువులను పీడించేటందుకు పురుషుడు తన భార్యనే చితిమీదపెట్టి తన చేతులతో తానే నిప్పంటిస్తాడట! పెద్ద పెద్ద రథాలు మనుష్యులను తొక్కేస్తూ పరుగెత్తుతాయట! భారతదేశాన్ని గూర్చి అమెరికనులకు తెలిపే టందుకు వాళ్ళు వేయించే బొమ్మ లిలాంటివి! వీటన్నింటికీ అర్థ మేమిటి? మొన్న మన దేశంలోనే వాళ్ళ పిల్లలకోసం ప్రచురించిన పుస్తక మొకటి చూచాను. అందులో ఒక పెద్దమనిషి తన కలకత్తా సందర్శన కథ అంటూ

ఒకటి వ్రాశాడు ఆయనట; కలకత్తా వీధుల్లో మనుష్యులను నేలమీద పడవేసి వాళ్ళమీదుగా రథాన్ని తోలడం కళ్ళారా చూశాడట: ఇలాంటి పెద్దమనిషే మరొకడు మెంఫిస్‌లో మతబోధ చేస్తుండగా చెవులారా విన్నాను. భారతదేశంలో ప్రతి పల్లెటూళ్ళోనూ చిన్నపిల్లల బొమికలతో నిండిన చెరువు లుంటాయిట!!

ప్రతి క్రైస్తవ శిశువుకూ హిందువులు తుచ్ఛులనీ, దుర్మార్గులనీ, ఈ భూమండలంలో వాళ్ళకంటె ఘోరమైన దుష్యాలు ఉండరనీ బోధించవలసినంత మహాద్రోహం ఈ క్రీస్తుగారి శిష్యులకు హిందువులేం చేశారో తెలియదు. ఆదివారపు బళ్ళల్లో వాళ్ళ పిల్లలకు చెప్పే పాఠాల్లో అధికభాగం క్రైస్తవులు కానివాళ్ళను, ముఖ్యంగా హిందువులను ద్వేషించడం ఎట్లాగో నేర్పడానికే వినియోగిస్తారు. ఎందుకయ్యా ఇదంతా అంటే ఆ పిల్లలు చిన్నప్పటినుంచీ క్రైస్తవమత సంస్థలకు సమృద్ధిగా పెన్నీ లిస్తారని!!

సత్యం కోసం కాకపోయినా తమ బిడ్డల క్షేమంకోసమే క్రైస్తవ మత ప్రచారకులు ఈ పని జరగనివ్వకూడదు. అటువంటి శిక్షణలో పెరిగిన బిడ్డలు పరమక్రూరు లవుతారంటే ఆశ్చర్యమేమైనా ఉన్నదా? నరక బాధలనూ, అక్కడ మండే అగ్ని జ్వాలలనూ, దాని కింధనమైన గంధకాన్నీ అధికాధికంగా వర్ణించగలిగినకొద్దీ క్రైస్తవమత బోధకుల స్థానం ఉన్నతోన్నత మవుతూ ఉంటుంది. మా స్నేహితుని దాసీ పిల్ల ఒకతె ఇటువంటి మతబోధకువెళ్ళి వచ్చి ఉన్మత్తురాలై పోయింది. పాప మా పిల్ల నారకాగ్ని వర్ణనం మోతాదెక్కువై భరించలేకపోయింది. అక్కడి సంగతలా ఉంచి ఇక్కడ మద్రాసులో హిందూమతానికి వ్యతిరేకంగా వాళ్ళు ప్రచురించే పుస్తకాలు చూడండి. తామంత ఘోరంగా వ్రాయడానికి సాహసిస్తూనే ఏ హిందువైనా క్రైస్తవానికి వ్యతిరేకంగా

ఒక్కమాట అంటే చాలు ఈ మత బోధకులు ఎక్కడలేని కోపతాపాలనూ ప్రదర్శిస్తారు.

సోదర దేశీయులారా! నేను అమెరికాలో సంవత్సరం పైగా ఉండి ఇక్కడి సంఘాన్ని అన్నివైపులా పరిశీలించి చూచాను. మన సంఘాన్నీ వాళ్ళ సంఘాన్నీ పోల్చి చూచాను. నాకు తెలిన సారాంశ మేమిటంటే క్రైస్తవ మత బోధకులు ప్రపంచానికి చాటుతున్నట్లుగా మనం దయ్యాలమూ కాము. వాళ్ళు దేవతలూ కారు. హిందువులకు నీతి లేదనీ, శిశుహత్యలు చేస్తారనీ, వాళ్ళ వివాహ విధానం ఘోరమైన దనీ దుష్ప్రచారం చెయ్యడం క్రైస్తవ మత బోధకులు మానుకుంటే మంచిది. వాళ్ళు హిందువులను గురించి లేనిపోని కల్పనలు చేసి తయారుచేసిన భావనా దృశ్యాలను మరిపించే సన్నివేశాలు యథార్థంగా కొన్ని దేశాల్లో జరుగుతూ ఉండవచ్చు. అయితే జీవితంలో నా లక్ష్యం మాత్రం కూలికి తిట్టిపొయ్యడం ఎన్నడూ కాదు. హైందవ సంఘం దోషరహితమని నే ననను, శతాబ్దాల తరబడి దురదృష్టాలకు పాల్పడినందువల్ల ఆసంఘంలో పెరిగిన దోషాలూ, ఉన్న లోపాలూ నాకంటె ఎక్కువ తెలిసిన వాళ్లుండరు. విజాతీయ స్నేహితులారా! మీ రెవరైనా నిజమైన సానుభూతితో. ఉన్నది నాశనం చెయ్యడానికి కాక, సహాయం చెయ్యడానికి వస్తారా, రండి! మీకు దైవంగూడా సహాయం చేస్తాడు. కాని దురదృష్టవశాత్తూ అసలే సాష్టాంగపడిఉన్న జాతిని అయినప్పుడూ కానప్పుడూ నిర్విరామంగా నిందిస్తూ గెలిచినవాళ్ళంగదా అని నైతికంగా మీ జాతి గొప్పదని నిరూపించదలిస్తే మాత్రం, అటువంటి తారతమ్య పరీక్ష నిష్పక్షపాతంగా జరిగితే, నైతికంగా హిందూజాతి ప్రపంచంలో ఏ జాతికంటే మహోన్నతమై నిలుస్తుందని నేను మీకు స్పష్టంగా చెప్తున్నాను.

# దైవాన్నీ, ధనపిశాచాన్నీ ఏకకాలంలో సేవించలేరు

(డెట్రాయిట్ ఉపన్యాసం - వి. సం. గ్రంథావళి 8వ సం.)

క్రూర విమర్శ చెయ్యడం నా ఉద్దేశంకాదుగాని మీ కొక విషయం చెప్పాలి. చదివించి, శిక్షణ యిచ్చి, సమృద్ధిగా జీతాలిచ్చి ఎందు కయ్యా మీరు జనాన్ని పంపుతున్నది? మాదేశానికి వచ్చి మమ్మల్నీ, మా తాత ముత్తాతల్నీ, మా మతాన్నీ, మా సర్వస్వాన్నీ తిట్టి దుమ్మెత్తి పొయ్య డానికా? దేవాలయం ప్రక్క నడుస్తూ 'ఓ విగ్రహారాధకులారా! మీరు నరకానికి పోతారు' అని చెప్తారా వాళ్ళు? భారత దేశంలోని మహమ్మ దీయుల కిలాంటివి చెప్పడానికి సాహసించరేం? వాళ్ళు కత్తులు దూస్తారు. హిందు వలాకాదు. పరమ సాధువు. మీవాళ్ళ మాటలువిని 'మూర్ఖు లే మంటే మనకేం?' అని నవ్వుకుంటూ వెళ్లిపోతాడు. అతని ధోరణి అది!

మరి ఇలా తిట్టి విమర్శించేందుకు మనుష్యులను తయారుచేసి పంపించే మీరు పరమ సద్భావంతో నేను ఏ కొంచెం విమర్శచేసినా అకస్మాత్తుగా కుంచించుకుపోతారేం? 'మా జోలికి రావద్దు. మేము అమెరికనులం. మేము ప్రపంచంలో అందరినీ విమర్శిస్తాం, నిందిస్తాం, ఏమైనా అంటాము. మా జోలికి మాత్రం మీరు రావద్దు. మేము ముట్టుకుంటే ముడుచుకుపోయే అత్తి పత్తి మొక్కలం' అంటూ అరుస్తారేం?

మీ కిష్టమైంది మీరు చెయ్యవచ్చు. కాని నేను చెప్పేదేమిటంటే మా పద్ధతిలో మేము తృప్తిగా బ్రతకగలం. మీకంటె ఒక విషయంలో మేము మెరుగు. మా పిల్లలకు మీరు మీవాళ్ళకిస్తున్న విషాన్ని మేమివ్వం. మమ్మల్ని విమర్శించే మీ మత బోధకులు ఈ మాట జ్ఞప్తికుంచుకోవడం మంచిది. యావద్భారతమూ లేచి నిలబడి హిందూ మహా సముద్రం అట్టడుగునున్న మట్టి అంతా తీసి మీ పశ్చిమ దేశాల ముఖాన కొట్టినా మీరు చేస్తున్న అవమానానికి అణుమాత్రమైనా ప్రతీకారం కాదు. ఇంతా మీరు చేస్తున్న దెందుకు? ప్రపంచంలో ఎవరినైనా మార్చాలని ఒక్క మతబోధకుణ్ని అయినా మేము పంపించామా? మేము మీకు చెప్పేది ఇంతే! 'మీ మతానికి స్వాగతం. మా మతాన్ని మాకు ఉండనివ్వండి!

మీది మీదికి మాకి వ్యాపించే మత మని మీ రంటూ ఉంటారు. అవును మీ రలాంటివాళ్ళే! అయినా ఇన్నాళ్ళబట్టీ మీ రెంతమందిని చేర్చుకోగలిగారు? ప్రపంచ జనాభాలో ప్రతి ఆరవవాడూ బౌద్ధానికి చెందిన చైనా జాతీయుడు. ఆ జాతి కాక జపాను, టిబెట్టు, రష్యా, సైబీరియా, బర్మా, సయాము మొదలైన వెన్నో ఉన్నాయి. మీకు మింగుడు పడక పోయినా ఈ కాథలిక్ చర్చి, ఈ క్రైస్తవ నీతి ఇవన్నీ వాళ్ళనుండి వచ్చాయి. సరే దానికేం! అదల్లా ఉంచి మీ మతాని కిప్పు డున్న వ్యాప్తి అయినా ఎలా వచ్చింది? ఒక్క నెత్తురుచుక్క పడకుండానే జరిగిందా? ఎన్ని డాబులు చెప్పినా ఎంత పొగుడుతున్నా మీ క్రైస్తవం నిరాయుధంగా వ్యాపించిం దెక్కడ? ఇంత ప్రపంచంలోనూ ఒక్కచోటు చెప్పండి. క్రైస్తవమత చరిత్ర అంతా తిరగవేసి ఒకటంటే ఒకటి, రెండవ దక్కర లేదు. చెప్పండి. మీ తాత ముత్తాతలు క్రైస్తవు లెట్లాగయ్యారో నాకు తెలుసు. బెదిరించారో, చంపారో; జరిగిందంతే!

మీ డాబులతో మీరు మహమ్మదీయ మతంకంపె చెయ్యగలిగిం దేమిటి ? 'మే మొక్కళ్ళమే గొప్పవాళ్ళం' ఎందుకని ? 'ఇతరులను చంపగలం కనుక' ఇదివరకు అరబ్బులూ ఇలాగే అన్నారు. మీకంటే డాబులు పలికారు. ఇప్పుడేమయ్యా రా అరబ్బులు ? ఆ ఎడారిలోనే పడి ఉన్నారు. రోమనులు విఱ్ఱవీగారు. వాళ్ళు మాత్రం ఇప్పుడెక్కడున్నారు ? అందుచేత శాంతికారకులే కలకాలం నిలుస్తారు. భగవదాశీర్వాదం వాళ్ళకే లభిస్తుంది. వాళ్ళే ఈ లోకంలో సుఖిస్తారు. తక్కినవి కూలిపోక తప్పదు. ఇసుక మేడ లాగ్గ్టే కాలం నిలవవు.

స్వార్థమే ప్రాతిపదిక అయి భోగమే లక్ష్యమై స్వార్థయే ప్రధాన సాధనమై పెరిగినవన్నీ ముందో వెనకో నశించి తీరుతాయి. అటువంటివి నాశనంకాక తప్పదు. సోదరులారా ; ఒక్క మాట వినండి. మీరు బ్రదక దలిస్తే, మీ జాతి నాలుగు కాలాలపాటు బ్రతికి ఉండాలని ఉంటే వెనక్కి వెళ్ళి క్రీస్తు నాశ్రయించండి. మీ రిప్పుడు క్రైస్తవులు కారు. కారు, కారు, జాతిగా కారు: వెళ్లండి, క్రీస్తు దగ్గరకు వెళ్ళండి : తలదాచుకునే చోటులేక అల్లాడుతున్న ఆయన దగ్గరకు వెళ్ళండి. "పక్షులకు వాటి గూళ్ళున్నాయి. అడివి జంతువులకు వాటి పొదలున్నాయి. కాని మానవసూనుడుగా అవత రించిన దేవుడికి మాత్రం తలదాచుకునే చోటు లేదు." మీ మత మిప్పుడు భోగం పేరుతో సాగుతోంది.ఎంత విధి వైపరీత్యం.

మీరు బ్రతకదలిస్తే మారిపోండి, పూర్తిగా మారిపోండి. ఇప్పటి పద్ధతి మారి తలక్రిందులయితేనే బ్రతుకుతారు. ఈ దేశంలో నేను విన్న దంతా వట్టి మోసమూ, నటనా ! మీ నడతకూ, మీ మతం చెప్పేదానికి సంబంధమే లేదు. మీరు జాతిగా బ్రతకదలిస్తే తిరిగి మీ దైవాన్ని ఆశ్రయించండి. దైవాన్నీ ధన పిశాచాన్నీ ఏకకాలంలో సేవించలేరు. ఈ ఐశ్వర్యం, ఈ డబ్బు ఇదంతా క్రీస్తువల్లనే? క్రీస్తు ఈ స్వవచోవ్యాఘా

తాన్ని ఎన్నడూ అంగీకరించడు. ధన పిశాచాన్ని ఆరాధించడంవల్ల వచ్చే అభ్యుదయం అంతా క్షణికమూ, అశాశ్వతమూ! నిజమైన శాశ్వతత్వం దైవంలోనే ఉన్నది. అద్భుతమైన ఈ ఐశ్వర్యాన్నీ దైవాన్నీ మీరు కలుపుకోగలిగితే మంచిదే! అది సాధ్యం కానప్పుడు దీన్ని విడిచి దైవాన్ని చేరుకోండి. క్రీస్తు లేకుండా భవనాల్లో ఉండడం కంటె ఆయనతో దరిద్రులై బ్రతకడానికి సిద్ధపడండి!



# 'నిజమైన ప్రవక్త మహమ్మదు ఒక్కడే!' - ఎంత మత విరుద్ధమైన కంఠశోష?

(కాలిఫోర్నియాలోని పసదేనా నగరంలో ఇచ్చిన ఉపన్యాసం—
వి. సం. గ్రంథావళి - 4వ. సం.)

'నా ప్రవక్త ఒక్కడే నిజమైన ప్రవక్త' అంటూ ప్రతివాడూ చెప్పడం మొదలుపెట్టితే వాడు చెప్పేది నిజం కాదు. వాడికి మత విషయికంగా అ ఆ లు గూడా తెలియవన్నమాట. మతమంటే మాటలూ కాదు, సిద్ధాంతాలూ కాదు, వట్టి బుద్ధితో అంగీకరించే విషయమూ కాదు. లో లోపలి హృదయంలో సాక్షాత్కృతి నందడం, దైవత్వాన్ని పొందడం, పరమార్థాన్ని అనుభవించడం విశ్వాత్మతో అభిన్నమైన ఆత్మయే తానని గుర్తించడం - మత మంటే ఇది! నీవు నిజంగా జగత్పిత ఇంటి లోకి వెళ్లినవాడవైతే ఆయన బిడ్డలను చూచి వాళ్ల నెందుకు గుర్తించ లేవు? వాళ్ళను గుర్తించలేకపోతే నీ వాయన ఇంట్లోకే వెళ్ళ లేదన్నమాట.

తల్లి తన బిడ్డను ఏ దుస్తులలో ఉన్నా ఎంత మారువేషంలో ఉన్నా గుర్తిస్తుంది గదా!

ప్రపంచంలో ఏకాలంలో నైనా, ఏదేశంలో నైనా ఆధ్యాత్మి కౌన్నత్యాన్ని సాధించిన మహానుభావులైన స్త్రీ పురుషు లందరూ యథార్థానికి ఒకే విధంగా ఉంటారని గుర్తుంచుకో! నిజమైన మత మున్న చోట, అపరోక్షమైన దివ్యానుభవమున్నచోట ఎక్క డెక్కడి వెలుగునూ చూడగలిగే మనోవైశాల్యం ఉండి తీరుతుంది.

మహమ్మదీయు లీ విషయంలో చాలా అపరిపక్వ మనస్కులు, కేవలం స్వ పక్షీయులు. 'దేవు డొక్కడే - మహమ్మదే అతని ప్రవక్త' అని వాళ్ళ సిద్ధాంతం. దీనికి భిన్నమైన దంతా చెడ్డది. దాన్ని వెంటనే నాశనం చెయ్యాలి. ఒక్క క్షణం వ్యవధిలో దీన్ని నమ్మని వాళ్ళనందరినీ చంపి వెయ్యవలసిందే! ఈ పూజా విధానానికి వ్యతిరేకమైన వాటిని నిర్మూలించాలి. ఇదికాక మరొకదాన్ని చెప్పే పుస్తకాల నన్నింటినీ కాల్చి వెయ్యాలి. ఇటువంటి సిద్ధాంతాలతో పసిఫిక్ మహాసముద్రం నుండి అట్లాంటిక్ మహాసముద్రం వరకు అయిదువందల సంవత్సరాలు ప్రపంచ మంతా నెత్తురు ప్రవహించింది. అదీ మహమ్మదీయ మతం!



# స్వార్థానికే కట్టుపడిన జాతి!

(లండనులో జరిగిన ఒక ఉపన్యాసము:- వి. సం. గ్రంథావళి 2వ. సం.)

మానవుడు స్వార్థపరుడైన కొద్దీ అవినీతిపరు డౌతాడు. జాతీ అంతే: స్వార్థానికే కట్టుపడిన జాతి మిక్కిలి క్రూరమూ, దుష్టమూ అవుతుంది. అరేబియా ప్రవక్త స్థాపించిన మతంకంటె ఈ రెండు లక్షణాలకూ నిలయమైంది మరొకటి లేదు. ఆ మతమే అనంత రక్త పాతానికి హేతువైంది, పరులయెడ పరమ క్రూరంగా ఉన్నది. తన బోధలలో నమ్మకం లేని మనిషిని చంపివెయ్యాలని కొరాన్‌లో ఒక సిద్ధాంతం ఉన్నది. పైగా అలా చంపడం వాడిమీద దయతో నట! అందమైన దేవకన్యలూ, సమస్త భోగాలూ సమృద్ధిగా ఉండే స్వర్గం చేరుకోవడానికి నమ్మకం లేనివాళ్ళను చంపడం నిశ్చయమైన మార్గ మట! ఇటువంటి నమ్మకాల ఫలితంగా జరిగిన రక్తపాత మెంతో ఊహించండి!



# మానవతా ప్రతిష్ఠాపనం లేదా కార్యకర్తల శిక్షణ

ధీమంతులై, ధైర్యవంతులై సముద్రాలు ఈదడానికి సిద్ధపడుతూ, మృత్యుగహ్వరంలోకి దూకేసాహసంగల ఉత్సాహవంతులైన యువకులు కావాలి మనకు. అట్టి వాళ్ళు స్త్రీలూ, పురుషులూ వందలకొలది కావాలి. ఆ లక్ష్య సిద్ధికి మీ శక్తి అంతా ఉపయోగించండి. అసంఖ్యాకంగా యువకుల నాకర్షించి ఉత్తేజపరచి మన పవిత్రీకరణ యంత్రంలో పెట్టండి. వేరు వేరు చోట్ల కేంద్రాలు స్థాపించి కార్య సాధకులను సమకూర్చండి.

పవిత్ర హృదయాలతో పట్టుదల వహించి, అచంచల భగవద్విశ్వాస కవచధారులై, దీనజన సానుభూతితో సముత్తేజితులై ఒకలక్షమంది యువతీ యువకులు ఆసేతు శీతాచలం పర్యటిస్తూ ముక్తి మార్గాన్ని, అన్యోన్య సహాయ విధానాన్ని, సాంఘికాభ్యుదయ పద్ధతులనూ, సర్వ సమానత్వాన్ని ఒక్కొక్కరికీ బోధించి మేల్కొల్పాలి!



## సంఘ నిర్మాణం

'అమెరికాలో నా జీవిత సమ్మోహిని ఉన్న'దని ఒకప్పుడు స్వామీజీ మా నాయనమ్మతో అన్నారు. సరదాగా ఆయన్ను కొంచెం ఉడికిద్దామని 'ఆమె ఎవరు స్వామీ?' అన్న దావిడ. ఆయన పక పకా నవ్వి 'యువతి కాదు తల్లీ! మీ దేశంలో ఉన్న సంఘటనాశక్తి.' అన్నారు. శ్రీరామ కృష్ణుల వారి అనుయాయు లంతా కలిసి బయిలుదేరి ఒక గ్రామాన్ని చేరుకుని ఒక చెట్టు క్రింద కూర్చుని కష్టాల్లో ఉన్నవాళ్ళు తమ్ము సంప్ర దించడానికి తమ దగ్గరికి వస్తారని అమాయికంగా ఎలా ఎదురు చూశారో అదంతా వివరించి చెప్పారు. అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో సంఘ నిర్మాణంతో ఎంతెంత సాధించకలుగుతున్నదీ తాము చూచామని అన్నారు. భారతీయ స్వభావాలకి అనుగుణంగా సంఘ నిర్మాణం ఎలా చెయ్యాలో ఆయన కింకా నిశ్చయం కాలేదు. స్వదేశీయుల కుపయోగపడే టట్లు పశ్చిమదేశాల నుంచి మంచిని స్వీకరించే మార్గ మేమిటా అని ఎంతో ఆలోచించి మధనపడ్డారు. (కార్నెరు కుమారి)

(అమెరికాలో వివేకానందస్వామి – నూతనావిష్కారాలు)

### ప్రజాస్వామిక వ్యవస్థకు అవసరమైన పూర్వరంగం

వివిధ దేశాల్లో సంచరించిన అనుభవాన్నిబట్టి మహత్తరమూ, శాశ్వతమూ అయిన ప్రయోజనాలు సాధించాలంటే సంఘ నిర్మాణం జరిగి తీరాలన్న నిర్ణయానికి వచ్చాను. కాని భారతంవంటి దేశంలో – మన మిప్పు

డున్న పరిస్థితిలో-అందరికీ అభిప్రాయం చెప్పే సమానావకాశం ఉండి అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని బట్టి నిర్ణయాలు జరిగే ప్రజాస్వామిక పద్ధతులలో సంఘాన్ని నిర్మించడం శ్రేయస్కరం కాదని నా కనిపిస్తుంది. పశ్చిమదేశాల పరిస్థితులు మనకు పూర్తిగా భిన్నమైనవి. మనలో కూడా విద్యావ్యాప్తి జరిగి జనులందరూ త్యాగశీలురై, స్వార్థానికీ వ్యక్తిగత ప్రయోజనాలకు అతీతులై సంఘ క్షేమానికే కృషిచెయ్యగలిగే రోజుల్లో ప్రజాస్వామిక వ్యవస్థ ఏర్పాటు చేసుకోవచ్చు. దీన్ని మనసులో పెట్టుకుని ప్రస్తుతం మన దేశంలో అందరూ విధేయతతో ఆజ్ఞా నిర్వహణం చెయ్యవలసిన నియంతృపాలిత సంఘమే ఏర్పడాలి. కాలక్రమేణా అదే సభ్యుల అభిప్రాయాన్ని తెలుసుకుని వాళ్ళ ఆమోదంతో వ్యవహరించే సంస్థగా పరిణమిస్తుంది.

## హిందూ సంఘటనం

హిందువులందరినీ చేర్చి అన్యోన్య సహకారమూ, పరస్పర సహనమూ నేర్పే సంస్థ ఒకటి ఏర్పడితీరాలి. నేనమెరికాలో చేసిన పని మంచిదని మెచ్చుకుంటూ తమ సంతోషాన్ని ప్రకటించడానికి కలకత్తాలో అయిదు వేలమంది సమావేశమయ్యారు. అలాగే తక్కిన చోట్లా జరిగింది. ఇదంతా బాగానే ఉన్నదిగాని ఇలా సమావేశమయిన జనాన్ని తలకొక అణాఇమ్మని అడిగితే ఇస్తారా? ఇప్పుడు మన జాతీయ మనస్తత్వం కేవలం పసివాళ్ళవలె పూర్తిగా పరాధీనమై ఉన్నది. అన్నం నోటి దగ్గరకువస్తే అంతా ఆరగిస్తారు. కొందరికి మింగడానికిగూడా సహాయపడాలి. మీ కాళ్ళ మీద మీరు నిలబడలేకపోతే బ్రతకడానికి మీరు అనర్హులు.

ఇప్పుడు భారత దేశంలో ముగ్గురు మనుష్యులు పరస్పర సహకారంతో అయిదు నిమిషాలసేపు పనిచెయ్యలేరు. ప్రతివాడూ అధికారం

కోసం ప్రాకులాడుతాడు. త్వరలోనే సంస్థ విచ్ఛిన్నమై పోతుంది. హే ప్రభూ! సహనం మే మెప్పుడు నేర్చుకుంటామో తెలియదు.గదా!

ఇటువంటి జాతిలో - ఎన్ని భేదాలున్నా అమరప్రేమతో పరస్పరం కట్టుపడిఉండే మానవ సంఘాన్ని నిర్మించడం అద్భుతమైన విషయం కదూ! ఈ సంఘం విస్తృతమై వ్యాపిస్తుంది. నిత్యాభ్యుదయ మహోత్సాహాలతోకూడిన మనో వైశాల్యం భారత దేశం నలుమూలలా క్రమ్మకోవాలి. దాసబుద్ధి బలిసిన ఈ జాతిలో అజ్ఞానం, విద్వేషం, కులకక్షలూ, అసూయా, మౌర్ఖ్యం మొదలైనవన్నీ ఉన్నప్పటికీ ఈ సంఘకృషి జాతిను త్తేజపరచి అణువణువునూ పరిశుద్ధం చెయ్యాలి.

## కార్యసిద్ధికి మూడు దశలు

ఏ పని కావాలన్నా మూడు దశలు గడవాలి. అవి అపహాస్యం. వ్యతిరేకత. అంగీకారం! దూరదర్శియైన ప్రతి బుద్ధిమంతుణ్నీ ముందు దురర్థం చేసుకుంటారు. అందుచేత వ్యతిరేకించి శత్రుత్వం వహించి నానా ఇబ్బందీ పెడతారు. దానికి తట్టుకుని పవిత్ర హృదయంతో భగవంతునిపై సంపూర్ణ విశ్వాసం ఉంచి నిర్విరామంగా కృషి చెయ్యగలిగితే అన్ని ఆటంకాలూ అదృశ్యమయిపోతాయి.

## పలుకుబడి వేటా, యథార్థ సేవా రెండూ ఒకమాటు సాధ్యంకావు

సమాజాని కిష్టమైన పద్ధతిలో నడుస్తూ మహాకార్యాలు సాధించినవాళ్ళెవరూ లేరు. ఆంతరమైన ప్రేరణ ననుసరించి ఇతరుల కిష్టమైనా కాకపోయినా కృషి చెయ్యాలి. నీవు చేసేది సత్కార్యమూ, శ్రేయస్కరమూ అయితే సమాజం దానంతటదే నిన్ను అనుసరిస్తుంది. నీవు బ్రతికి ఉండగా కాకపోవచ్చు. చనిపోయిన తర్వాత కొన్ని శతాబ్దాలకయినా అనుసరించి

తీరుతుంది. హృదయం, ఆత్మ, శరీరం అన్నీ నిమగ్నంచేసి పనిలోకి దూకాలి. ఒక ఆదర్శానికి, ఒకే ఒకదానికి సమస్తమూ త్యాగం చెయ్యడానికి సిద్ధపడకపోతే మన కంధకారమే ఎదురవుతుంది. వెలు గెన్నటికీ కనిపించదు.

మానవ జాతికి సహాయపడదలచినవారు తమ సుఖ దుఃఖాలూ, పేరు ప్రతిష్ఠలూ, లాభాలూ, ప్రయోజనాలూ అన్నీ కట్టి కట్టి సముద్రంలో పారేసి నిర్మల చిత్తులై భగవంతుని సాన్నిధ్యానికి రావాలి. మహానుభావు లందరూ చెప్పిందీ, చేసిందీ ఇదే :

## సంపూర్ణ విధేయత

శిరసావహించడం తెలిసినవానికి ఆజ్ఞాపించడమూ తెలుస్తుంది. ముందు విధేయత నేర్చుకోండి. అత్యున్నత స్వతంత్రభావంకల పశ్చిమ జాతులలో విధేయతాభావమూ అంత దృఢంగానే ఉన్నది. మనమందరమూ స్వార్థానికే ప్రాముఖ్య మిస్తాము. దీంతో ఏ పనీ కాదు. మహోన్నతోత్సాహమూ, అపరిమిత సాహసమూ, అత్యద్భుత శక్తీ — అన్నిటినీ మించి సంపూర్ణ విధేయతా — ఈ ముఖ్య లక్షణాలే వ్యక్తినిగాని, జాతినిగాని పునరుజ్జీవితం చేస్తాయి. మనలో ఈ లక్షణాలే బొత్తిగా లేవు.

ఇక్కడ ప్రతివాడికీ నాయకత్వం కావాలి. ఎవ్వడూ చెప్పినమాట వినడు, మహా కార్య సాధనలో నాయకుని ఆదేశాలను సర్వాత్మనా పాలించాలి. నా జీవిత శేషాన్నంతటినీ మఠంలో మురికి కాలువలు తుడవడంతో గడపవలసిందని మా గురువులు నన్నాజ్ఞాపిస్తే మరుమాట అనకుండా నేను శిరసావహిస్తాను. ఊరికే చెప్పడంకాదు, నా తత్త్వమిది. ఈ సంగతి మీరు గ్రహించండి. సమష్టి శ్రేయస్సుకై ఏ విధమైన సంకోచమూ లేకుండా ఆజ్ఞాపాలనం చెయ్యగల వాడొక్కడే ఆజ్ఞాపించే మహానుభావుడౌతాడు.

ఈ విధేయతా గుణాన్ని అలవరచుకోండి. కాని మీ విశ్వాసాన్ని త్యజించగూడదు. అధికులకు విధేయులు కాకపోతే సంఘమే అసంభవం! వ్యక్తి శక్తులు సుసంఘటితం కానప్పుడు ఏ మహా కార్యమూ సాధ్యంకాదు.

### సహచరులను మెచ్చుకుంటూ దోషాలు మృదువుగా చెప్పండి :

ఎవరి ఉత్సాహాన్నైనా చల్లార్చకూడదు. విమర్శ పూర్తిగా మాని వెయ్యండి. అవతలి వాళ్ళు చేస్తున్నది మంచిదిగా తోచినప్పుడు మీకు వీలైన సహాయం చెయ్యండి. వాళ్ళు చెడుత్రోవన పోతున్నట్టనిపిస్తే మృదువుగా వాళ్ళ దోషాలు వాళ్ళకు తెలియజెప్పండి. పరస్పర విమర్శయే సర్వానర్థాలకూ హేతువవుతోంది. సంస్థలు విచ్ఛిన్నం కావడానికి అదే మూలకారణం!

### పరస్పర ప్రేమ

మీరు పూనిన పనులు విజయవంతం కావడం మీలో మీకున్న పరస్పర ప్రేమ మీద ఆధారపడి ఉంటుంది. దుర్బుద్ధి, అసూయ, అహంకారమూ ఉన్నంతకాలం శుభ మెన్నడూ జరగదు.

తోడి సోదరుల అభిప్రాయాలను మన్నించి వాళ్ళతో ఏకీభవించడానికి సిద్ధంగా ఉండండి. విజయానికి కీలక మిదే!

### వ్యవహారం వ్యవహారమే

భారత దేశంలో సమష్టి ప్రయత్నాలన్నీ ఒకే ఒక దుర్లక్షణం బరువుతో క్రుంగి పోతున్నాయి. మన మిప్పటికీ వ్యవహార నియమాలను ఖచ్చితంగా పాలించలేము. వ్యవహారం వ్యవహారమే. అక్కడ స్నేహాలూ,

పరిచయాలూ పనిచెయ్యగూడదు. ఎక్కడైనా పావగాని వంగతోట దగ్గర కావ కాదన్న సామెత ఎల్లప్పుడూ ఆచరణలో ఉండాలి. తన ఆధీనంలో ఉన్న సర్వానికీ తాను స్పష్టంగా లెక్కచెప్పగలగాలి. ఒకందుకు ఉద్దేశించిన ధనాన్ని దానికి తప్ప మరొకదానికి – ఎంత మంచి పనికైనా – మరు క్షణంలో ఒకడు చచ్చిపోతున్నా – ఉపయోగించ కూడదు. వ్యవహారపు నిజాయితీ ఇలా ఉంటుంది.

### శాశ్వత సంస్థ రహస్యం

ఒకరున్నా లేకపోయినా దానంత టది పనిచేసే యంత్రాన్ని ఏర్పాటు చెయ్యాలి. మన భారతీయుల్లో ఉన్న లోపమే ఇది. వ్యక్తులతో నిమిత్తం లేని శాశ్వత సంస్థను మనం నిర్మించుకోలేము. ఎందుచేత నంటే ఇతరులతో అధికారం పంచుకోడానికి మనకిష్టం ఉండదు. మన తరువాత ఏం జరుగుతుందో మన మాలోచించం.

---

## నాయకత్వం

### శీల పావిత్ర్యం

నాయకుడు శీలవంతుడు కాకపోతే అనుచరులు విధేయులుకావడం సాధ్యం కాదు. నాయకుని శీలం పవిత్రమైన కొద్దీ అనుచరుల విశ్వాసమూ, విధేయతా అధికాధిక మవుతాయి.

### జనవశీకరణ శక్తి పుట్టుకతో రావాలి

ఒక్క జన్మలో ఎవ్వరూ నాయకుడు కాలేడు. పూర్వ జన్మార్జిత లక్షణాలతో నాయకుడై పుట్టాలి. సంఘాలు ఏర్పాటుచెయ్యడంకోసం,

ప్రణాళికలు వెయ్యడంలోనూ కష్టమేమీ లేదు. వివిధ మనస్తత్వాలు గల మనుష్యులను సమానాంశాలను పురస్కరించుకుని అందరినీ కలిపి ఒక త్రాటిమీద నడిపించడంలోనే నాయకుని శక్తి పరీక్షింపబడుతుంది ఈ శక్తి కావాలని కృషి చేస్తే వచ్చేదికాదు.

## సేవా ప్రేమలు నాయకుని నియత లక్షణాలు

నాయక పాత్ర వహించడం చాలా కష్టమైన పని. దాసులకు దాసుడై వెయ్యి రకాల మనస్సులకు ఒదిగి ఉండగలగాలి. అందరికీ సేవకుడైనవాడే వాళ్ళకు నిజమైన యజమాని. అసూయకాని స్వార్థంగాని లీలగానైనా పొడ చూపకూడదు. అలా అయితే నువ్వు నాయకుడవు. మొదట పుట్టుకతో. తరువాత స్వార్థరహితత్వంతో నాయకుడ వవుతావు.

## ఆత్మ ప్రాబల్యం కాదు, ఆత్మత్యాగమే ధర్మవీరానికి మూలం!

సేవా విధేయతలనూ, ఆత్మనిగ్రహాన్నీ పెంపొందించే ధర్మవీర మేదీ కనిపించదేం ? ఎలా కనిపిస్తుంది? ఆత్మప్రాబల్యం కాదు, ఆత్మ త్యాగమే ధర్మవీరానికి మూలం! ఇతరుల హృదయాలనూ, జీవితాలను పాలించడానికి పూనుకునేముందు ధర్మాన్ని నిర్వహించడంలో ప్రాణార్పణ చెయ్యగలగాలి. ఆత్మత్యాగం చెయ్యగలవాడే ధర్మవీరుడు!

## ఒత్తిడి భరించవలసింది నాయకుడే

యుద్ధరంగంలో భారతీయ యోధుడు పిరికితనం చూపుతాడా ఎన్నడైనా? చూపడు. కాని యోధు లెంత ధైర్యవంతులైనా వాళ్ళకు నాయకులుండాలి, భారతదేశంలో సిపాయీ కలహం జరుగుతున్నప్పుడు జెనరల్ స్ట్రాంగు అనే ఆంగ్లేయ మిత్రుడొక డుండేవాడు.

ఆ కలహాన్ని గూర్చి ఆయన అనేక కథలు చెప్పేవాడు. ఒక రోజున సంభాషణలో 'సిపాయీలకు సమృద్ధిగా తుపాకులూ, మందుగుండు సామగ్రీ ఆహారపదార్థాలూ అన్నీ అందుబాటులో ఉన్నాయికదా. పైగా అందరూ శిక్షణ పొంది ఉన్నారాయె వాళ్ళు ఓడిపోవడం ఎలా తటస్థించింది?' అని అడిగాను. "సిపాయీల నాయకులు ముందుండి నడవడం బదులు వెన కెక్కడో సురక్షిత స్థానాల్లో ఉండి 'దూకండి, పొడవండి, ధైర్యంతో పోరాడండి' అంటూ అరుస్తూ కూర్చున్నారు. ఆజ్ఞాపించే నాయకుడు ముందుండి మృత్యువు నెదుర్కొనకపోతే అనుచరులు హృదయ పూర్వకంగా ఎప్పుడూ యుద్ధం చెయ్యరు" అని సమాధానం చెప్పాడాయన. యుద్ధంలోనే కాదు, ఏ రంగంలోనైనా మనుష్య స్వభావం ఇలాగే ఉంటుంది. నాయకుడు తన తల తరిగి ఇచ్చేవాడు కావాలి. ఒక లక్ష్యం కోసం నీ జీవితాన్ని నీవు అర్పించగలిగితేనే నీవు నాయకుడవు కాగలవు కాని అవసరమైన త్యాగం చెయ్యకుండా నాయకులం కావాలని మన కందరికీ ఉంది. ఫలితం శూన్యం. ఎవ్వరూ మన మాట వినరు.

అభిమానమూ, పక్షపాతమూ
నాయకునకు పనికిరావు

అనర్థానికి ముఖ్యహేతువు పక్షపాతమే. ఏ ఒక్కణ్ణైనా మరొకడి కంటె ఎక్కువ ప్రేమించావో భవిష్య దనర్థానికి బీజాలు చల్లుకున్నా వన్న మాటే!

తన అనుచరులను తరతమ భావంతో ప్రేమించేవాడు ఎన్నడూ నాయకుడు కాలేడు. హెచ్చు తగ్గులతేడా లేకుండా అనంతమైన ప్రేమ చూపగల వానికే ప్రపంచమంతా పాదాక్రాంత మవుతుంది.

నే నంటే తమ ప్రేమ అంతా కురిపించేవాళ్ళ నెందరినో చూస్తాను. అయినా నేను వాళ్ళల్లో ఎవరిమీదా పూర్తి ప్రేమ చూపగూడదు. చూపితే

పని నాశనమై పోతుంది. అయితే కొందరు హృదయ వైశాల్యం లేక తాము చూపే ప్రేమకు ప్రతిఫలం కోరే వాళ్లుంటారు. పూనిన పని నెరవేరడానికి వీరైనంత మంది ప్రేమను పొందవలసిందేగాని నేను మాత్రం ఎవరినీ అధికంగా అభిమానించగూడదు. అలా నిష్పక్షపాతంగా ఉండకపోతే అసూయా ద్వేషాలకు అవకాశం కలిగి కలహాలు ప్రారంభమయి సర్వమూ భగ్నమై పోతుంది. నాయకుడు అభిమానమూ, పక్షపాతమూ లేకుండానే ఉండాలి.

## ప్రజలను చేర్చి ఓర్పుతో, సానుభూతితో తీర్చి దిద్దాలి

నీ దగ్గరి కెవరైనా వచ్చి తోడి వాళ్ళను గూర్చి చెడు చెప్పడానికి పూనుకుంటే ఎన్నడూ వినిపించుకోకు. పూర్తిగా నిరాకరించి పంపించి వెయ్యి. ఊరికే వినడంకూడా మహా పాపం. అందులోనే భవిష్యదనర్థ బీజాలన్నీ ఉంటాయి.

అందరి లోపాలనూ సహించడం నేర్చుకో. కోట్లకొలది దోషాలను క్షమించు. నిస్వార్థంగా నీ వందరినీ ప్రేమిస్తుంటే క్రమ క్రమంగా వాళ్ళందరూ ఒకరినొకరు ప్రేమించుకుంటారు. అందరూ పరస్పరం ఒకరి మీద ఒకరు ఆధారపడి ఉన్నారని గ్రహించగలిగినప్పుడు ఒక్కొక్కరూ అసూయా విరహితులవుతారు. పదిమందీ కలిసి సమష్టి కార్యాన్ని నిర్వహించడం మన జాతీయ తత్త్వంలో లేనట్టున్నది. అందుచేత ఆ భావాన్ని ఎంతో జాగ్రత్తగా, ఓపికతో అంకురింప చెయ్యాలి.

## శిశువు వలె నడపగలవాడే ఉత్తమ నాయకుడు

దారి చూపినప్పుడే కొందరు మంచిపని చెయ్యగలుగుతారు. దారి చూపడం అందరికీ చేతకాదు. ఏమైనా శిశువువలె నడపగలవాడే ఉత్తమ

నాయకుడు. పైకి అందరిమీదా ఆధారపడి ఉన్నట్లు కనిపించినా శిశువే గృహరాజ్యాన్ని పాలించే ప్రభువు! నా బుద్ధికి తోచినంతవరకు నాయకత్వం విజయవంతం కావడానికి ఇదే మర్మ మనిపిస్తుంది.

నడుపుతున్నామన్న భావం ఏ కొంచెం పొడచూపినా తీవ్రమైన అసూయ ప్రబలి అంతటినీ నాశనం చేస్తుంది.



# యథార్థ గురుత్వం

## మత బోధకుడు జ్ఞానాన్ని అందించే పరికరమే

దైవమే యథార్థ గురువు. లోకంలో గురువులు ఆ దైవం ఉపదేశాలను మన కందించే పరికరాలు. పరికరం ఎంత స్వచ్ఛమయితే ఉపదేశం అంత స్వచ్ఛంగా అందుతుంది. అందుచేతనే తమ్ము తాము భగవదర్పణ చేసుకున్న మహానుభావులు కార్యకర్తలనబడే వాళ్ళకంటె ప్రపంచాని కెక్కువ మేలు చేస్తారు. సంపూర్ణంగా పవిత్రుడైన ఒకవ్యక్తి పెద్ద బోధక పటాలంకంటె ఎక్కువ సాధిస్తాడు. పావిత్ర్య మౌనాల్లో నుండే శక్తి ఆవిర్భవిస్తుంది.

## బోధకుని వ్యక్తిత్వం

ఇంగ్లాండులో ఒక స్నేహితుడు 'బోధకుని వ్యక్తిగత చరిత్రను మన మెందుకు చూడాలి? ఆయన చెప్పేదాన్ని పరిశీలించి స్వీకరిస్తే చాలు గదా?' అని నన్ను అడిగాడు. అది ఎంత మాత్రమూ చాలదు. నాకు

గణితమో, రసాయన శాస్త్రమో, మరి ఏదైనా భౌతిక శాస్త్రమో చెప్పవలసి వస్తే బోధకుడు ఎటువంటివాడైనా ఫరవాలేదు. ఆయన ఆయా శాస్త్రాలు నాకు చెప్పగలడు. ఈ భౌతికశాస్త్ర విజ్ఞానానికి కావలసింది మేధాశక్తి, ఆత్మాభివృద్ధి ఏ కొంచెమూ లేకపోయినా మేధాబలం సమృద్ధిగా ఉంటే చాలు. ఆ శాస్త్రాలు చెప్పగలుగుతాడు. కాని కలుషితమైన ఆత్మలో ఆధ్యాత్మిక జ్యోతి లేశమాత్రంగా నైనా తోచదుకాబట్టి అట్టివాడు ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ఇవ్వగలగడం అసంభవం. ఆ జీవుడు మనకేం చెప్పగలడు ? ఆతనికే ఏమీ తెలియదు. ఆధ్యాత్మిక సత్యం పావిత్ర్యమే !

మతబోధకుని విషయంలో ఆయన ఎట్టివాడన్నదే ముందు మనం గమనించాలి. ఆయన పరికర మాత్రుడే అవుతున్నందువల్ల తర్వాతే ఆయన మాటల విలువ సంగతి వస్తుంది. ఆయనలోనే ఆధ్యాత్మిక శక్తి లేనప్పుడు మనకేం అందించగలుగుతాడు? ఉదాహరణకు ఉష్ణప్రసారక యంత్రం ఉష్ణతరంగాలతో నిర్భరమై ఉంటే వేడి నివ్వగలుగుతుంది. లేక పోతే ఇవ్వలేదుగదా ! మతబోధకుని విషయంలో కూడా ఈవిధంగానే ఆయన మనస్సు ఆధ్యాత్మిక శక్తితో నిర్భరమై ఉండాలి. అప్పుడే శిష్యుని మనస్సుకు ఆ శక్తి నివ్వగలుగుతాడు. మనలోని మేధాశక్తిని ఉద్బోధించడం మాత్రమేకాక మన కాధ్యాత్మిక శక్తిని ప్రసారం చెయ్యవలసిన అవసరమున్నది. గురువులో నుండి ఒకానొక శక్తి నిజంగా వెలువడి శిష్యునిలో చేరి అభివృద్ధి పొందుతుంది. అందుచేత మత బోధకుడు పరిశుద్ధుడై ఉండి తీరాలి.

అద్భుతమైన ప్రసంగాలు. ఎంతో తార్కికంగా నచ్చచెప్పే పరమాద్భుత చర్చలు మన మెన్నో వింటాము ఇంటికి వెళ్లి అన్నిటినీ మరిచిపోతాము. ఒక్కొక్కప్పుడు సరళాతి సరళమైన భాషలో ఒకటి రెండు మాటలు వినడం తటస్థిస్తుంది. అవి మన జీవితాల్లో ప్రవేశించి మనతో ఏకమైపోయి శాశ్వతమైన ఫలితాలు సాధిస్తాయి. ఆడిన మాటల్లో

తన ఆత్మీయత నంతటినీ నిక్షేపించగల వ్యక్తి మాటలకు శక్తి ఉంటుంది. కాని ఆ ఆత్మీయత మహత్తరమైంది కావాలి, బోధనలో ఇచ్చి పుచ్చుకోవడాలు రెండూ ఉన్నాయి. బోధకుడు ఇస్తాడు. శిష్యుడు స్వీకరిస్తాడు. బోధకుని దగ్గర ఇచ్చేందుకు ఉంటే శిష్యుడు స్వీకరించడానికి సిద్ధంగా ఉంటేనే బోధన జరుగుతుంది.

## బోధకుని కర్తవ్యం

1. విద్య— మానవునిలో పూర్వమే ఉన్న సమగ్రతకు ఆవిష్కృతి.
2. మతము— మానవునిలో పూర్వమే ఉన్న దైవత్వానికి ఆవిష్కృతి.

అందుచేత రెంటి విషయంలోనూ బోధకుడు చెయ్యవలసింది అవరోధాలను తొలగించడమే. నే నెల్లప్పుడూ అంటూ ఉండేటట్లు 'అడ్డు తీసివెయ్యి!' అంతా సరిపోతుంది. అంటే మనం చెయ్యవలసింది దారి బాగుచెయ్యడం భగవంతుడే మిగిలినది చేస్తాడు.

## వ్యతిరేక భావాలు మానవుణ్ని బలహీన పరుస్తాయి

వ్యతిరేక భావాలు మానవుణ్ని బలహీన పరుస్తాయి. కొందరు తల్లిదండ్రులు తమ బిడ్డల్ని చదవమనీ, వ్రాయమనీ ఎప్పుడూ వేధిస్తూ 'ఇలా అయితే నీకు చదువు రాదు. వట్టి వెధవ్వయి పోతున్నావు, చవటా' అంటూ తిడ్తూ ఉంటారు. చివరి కాబిడ్డలు అలాగే తయారవుతూ ఉంటారు. అలాంటి వాళ్ళను మీరు చూడలేదా? ప్రేమతో పలకరించి మంచి మాటలు చెప్పి ప్రోత్సహిస్తే పిల్లలు తప్పక అభివృద్ధి పొందుతారు. లోకంలో పిల్లల విషయంలో నిజమైనదే మతం దృష్ట్యా పసిపిల్లలైన జనుల

విషయంలోనూ అదే నిజమవుతుంది. ప్రజలకు సద్భావాలు అందిస్తే వాళ్ళంతట వాళ్ళే పెరిగి తమ కాళ్ళమీద తాము నిలబడ గలుగుతారు. భాషా సారస్వతాల్లో, కవిత్వంలో, కళలలో అన్నింట్లోనూ ప్రజల ఊహలలో చేతలలో కనిపించే దోషాలు చూపించడం కాదు మనం చెయ్యా వలసింది. వాటిని క్రమక్రమంగా వాళ్ళు మరింత బాగా చెయ్యకల మార్గం చూపించాలి. దోషోద్ఘాటనం మానవుని హృదయాన్ని గాయ పరుస్తుంది. మన మెందుకూ పనికిరాని వాళ్ళని భావించిన వ్యక్తుల విషయంలో గూడా శ్రీరామకృష్ణు లెంతగానో ప్రోత్సహించి వాళ్ళ జీవితాలనే మార్చివేసిన సంగతి మన కందరికీ తెలుసు. ఆయన బోధనా పద్ధతి ఆయనకే చెల్లింది! ఆ మార్గం నాన్యతో లభ్యం!



## జీవితం నిజంగా విజయవంతం కావాలంటే . . .

మనస్సునూ, హృదయాన్నీ
ఉన్నతాదర్శ పూరితం చెయ్యి!

కండరాల ద్వారా అభివ్యక్తమైన శక్తిని కర్మ అంటారు. కాని ఆలోచన లేందే ఏ కర్మా జరగదు. అందుచేత మనస్సును ఉన్నత భావాలతో, మహోన్నతాదర్శాలతో నింపు. వాటినే సర్వకాల సర్వావస్థలలో నీ సమక్షంలో ఉంచుకో. అప్పుడు నీవు మహా కార్యాలు చేస్తావు.

అందరూ ఆకాశాన్ని చూడగలరు. నేలమీదప్రాకే పురుగుకూడా చూస్తుంది. కాని ఆ ఆకాశం ఎంత దూరంలో ఉన్నది! అలాగే మన ఆదర్శం కూడానూ. చాలా దూరంలో ఉన్నమాట నిజమే అయినా అది

మనకు ఉండితీరాలి. మన ఆదర్శం అత్యున్నతం కావాలి. దురదృష్ట వశాత్తూ ఈ జీవితంలో చాలామంది ఏ ఆదర్శమూ లేకుండా అంధకారంలో అల్లాడుతున్నారు. ఆదర్శం ఉన్న మానవుడు వెయ్యి తప్పులుచేస్తే. లేని వాడు లక్ష తప్పులు చేస్తాడని నా గట్టి నమ్మకం. అందుచేత ఆదర్శం ఉండడం మంచిది. ఆ ఆదర్శాన్ని గూర్చి పదే పదే వినగలిగినంత వినాలి. అది మన హృదయాల్లో, మనస్సుల్లో, నరనరంలోనూ ప్రవేశించి రక్తంలో ప్రతి కణానికీ పట్టి శరీరంలో ప్రత్యణువునా వ్యాపించేటంతగా వినాలి. దాన్నే ధ్యానం చెయ్యాలి. 'హృదయం నిండుగా ఉంటే ముఖం మాట్లాడుతుంది : అప్పుడే చెయ్యీ పనిచేస్తుంది.

## ముత్యపు పురుగులా ఉండు

ముత్యపు పురుగులా ఉండాలి. స్వాతికార్తెలో వాన కురిసినప్పుడు ఒక వానచుక్క ముత్యపు పురుగు చిప్పలలో పడితే అది ముత్యమవు తుందని మన భారతీయులు చెప్పుతూ వుంటారు. ముత్యపు పురుగులకు ఈ విషయం తెలుసు. అందుకని అవి స్వాతికార్తె రాగానే సముద్రంలో పై భాగానికి వచ్చి వానకోసం ఎదురుచూస్తూ ఉంటాయి. చుక్కపడగానే చిప్పలు మూసుకుని అట్టడుగుకు వెళ్ళిపోతాయి. అక్కడ ఆ నీటి చుక్క క్రమంగా ముత్యమవుతుంది.

మనం వాటిలా ఉండాలి. మొదట వినడం తర్వాత అర్థం చేసుకోవడం, చివరకు అన్ని వ్యావర్తకాలనూ విడిచిపెట్టి బాహ్య విషయాలతో సంబంధం లేకుండా అంతర్ముఖులమై లోని సత్యం ప్రస్ఫుట మయ్యే వరకూ నిష్ఠలో ఉండడం. ఒక భావంతో కొన్నాళ్ళుండి నవ్యతా మోహంతో ఒకదాన్ని విడిచి మరొకదాన్ని స్వీకరిస్తూ ఉంటే ఉన్న శక్తి వృథా అయిపోయే ప్రమాదం ఉన్నది. నచ్చిన భావాన్ని స్వీక రించి దాన్ని గురించి కృషిచేసి దాని అంతు తేల్చుకునేవరకూ విడిచిపెట్ట

కూడదు. ఏదో ఒక భావంతో ఉన్మత్తుడై పోగలిగినవాడే వెలుగును చూస్తాడు. అది కొంచెం ఇది కొంచెం కక్కుర్తిపడేవాళ్ళు ఎన్నడూ దేన్నీ సాధించలేరు. కొంచెం సేపు నరాలు కదిలి ఉద్విగ్నులయితే కావచ్చు, అంతటితో ఆఖరయిపోతుంది,

ఒక భావాన్ని తీసుకో. అదే నీ జీవితంగా చేసుకో. దాన్నే ఆలోచించు, దాన్నే కలలు గను, దానిమీదనే బ్రతుకు. మనస్సు, కండరాలు, నరాలు, శరీరంలో సర్వభాగాలు ఆ భావంతోనే నిండిపోవాలి. మరొక భావానికి చోటుండగూడదు. స్వీకరించిన భావాన్ని తప్ప సమస్తమూ విడిచి పెట్టెయ్యాలి. జీవిత విజయాని కిదే మార్గం. ఆధ్యాత్మికౌన్నత్యం సాధించిన మహానుభావు లందరూ ఇలాగే తయారయ్యారు. తక్కిన వాళ్ళు కబుర్లు చెప్పే యంత్రాలు.

విజయం పొందవలెనంటే దృఢమైన సంకల్పమూ, అత్యద్భుతమైన దీక్ష ఉండాలి. దీక్షాశీలి అయిన వ్యక్తి 'నేను సముద్రాన్ని ఆపోశనం పట్టాను. నా ఇచ్ఛతో పర్వతాలు కూలిపోతాయి.' అని చెప్పగలడు, చెయ్యగలడు. అటువంటి ఉత్సాహంతో అంత దృఢమైన సంకల్పంతో కష్టపడి పనిచేస్తే లక్ష్యం సిద్ధిస్తుంది.

## వీరాంజనేయు డాదర్శం కావాలి

వీరాంజనేయుని శీలం నీ కాదర్శం కావాలి. రామచంద్రు డాజ్ఞాపిస్తే అతడు సముద్రాన్ని ఎలా లంఘించాడో గమనించు. జీవితాన్నీ, మృత్యువునూ అతడు లెక్క చెయ్యలేదు. సర్వేంద్రియాలనూ స్వాధీనం చేసుకుని అద్భుతమైన ప్రతిభతో వ్యవహరించాడు. నీ జీవితాన్ని నీవు ఇటువంటి వ్యక్తిగత సేవారూపమైన పరమాదర్శంపై నిర్మించుకోవాలి. ఆ సేవ ద్వారానే జీవితంలో తక్కిన ఆదర్శాలన్నీ క్రమంగా ఆవిష్కృతమవుతాయి. గురువునకు సర్వాత్మనా విధేయుడు కావడం, బ్రహ్మచర్యాన్ని

దీక్షతో పాలించడం - ఇదే విజయానికి కీలకం! హనుమంతు లోకవంక సేవాధర్మ దీక్ష వహిస్తూనే మరొకవంక సర్వ ప్రపంచాన్నీ భయాశ్చర్య చకితం చేసే మహా ధైర్యసాహాలు చూపించాడు. శ్రీరామచంద్ర సేవను తప్పవిడిచి - విశ్వాని కంతకూ ధ్యేయమైన బ్రహ్మత్వ శివత్వ సిద్ధితో పాటు - దేన్నీ లెక్క చెయ్యలేదు. రామాజ్ఞా నిర్వహణమే అతని జీవిత ప్రతిజ్ఞ! అంతటి హృదయ పూర్వకమైన భక్తి మనకు కావాలి.

## ప్రయత్నించు! ప్రయత్నిస్తే లభిస్తుంది

ఒక సోమరి వీధి మీద తప్పాడుతూ, ఒక ఇంటి గుమ్మంలో కూర్చుని ఉన్న ముసలాయనను చూచి ఫలానా గ్రామానికి దారి యేదని అడిగాడు. ఆ ముసలాయన సమాధానం చెప్పలేదు. ఈ సోమరి మళ్ళీ మళ్ళీ అడిగాడు. అప్పటికీ ఆయన మాట్లాడలేదు. చివరికి విసుగుపుట్టి వెళ్ళిపోవాలని కదలబోతూ ఉండగా ముసలాయన లేచి 'నువ్వడిగిన గ్రామం ఇటు ఒక మైలులోనే ఉన్నది' అన్నాడు. 'ఏమయ్యా? ఇందాకటినుంచీ అన్నిసార్లడిగినా చెప్పనేలేదేం?' అన్నాడు సోమరి. 'అప్పుడు నీవు కదిలే టట్లే కనిపించలేదు. వెళ్ళాలన్న ఆదుర్దా ఉన్నట్లే లేదు. ఇప్పుడు నీవు కదిలావు. నీలో ఆదుర్దా కనిపిస్తోంది. సమాధానం పొందే యోగ్యత కలిగింది. అందుచేత చెప్పాను' అన్నాడు ముసలాయన.

ఈ కథ జ్ఞాపక ముంచుకోగలవా? ఆచరణ కుపక్రమించు. మిగిలిన వన్నీ అనుసరిస్తాయి.

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

(గీత - 9-22)

'అనన్య విశ్వాసంతో నన్నే నమ్ముకుని నా ఉపాసనే చేసేవానికి కావలసినవన్నీ నేనే ఇస్తాను.'

క్రీస్తు మాటలు జ్ఞప్తికి తెచ్చుకో: 'అడుగు - అడిగితే ఇవ్వబడుతుంది. ప్రయత్నించు, ప్రయత్నిస్తే లభిస్తుంది. తలుపు తట్టు - తట్టితే తలుపులు తెరువబడతాయి' ఈ మాటలు ఊరికే అన్నవి కావు. ఎత్తుకెత్తు పరమ సత్యం!

నీవు నిజంగా కోరితే నీకు లభించనిదేమైనా ఉన్నదా? ఉండడం సాధ్యం కాదు: తీవ్ర వాంఛయే నీ శరీరాన్ని సృష్టించింది. లో నున్న వెలుగే ఆ శరీరానికి కళ్ళనే కన్నాలు పొడిచింది. ఆ వెలుగు లేకపోతే నీకు కళ్ళుండేవికావు. శబ్దమే శ్రవణేంద్రియాన్ని నిర్మించింది. విషయం ముందున్నది. దాన్ని గ్రహించే విషయిని అంటే ఇంద్రియాన్ని తర్వాత నిర్మించుకున్నావు.

## అడుగు! అడిగితే ఇవ్వబడుతుంది

నిజమేకాని వాంఛకూ, వాంఛకూ ఉన్న భేదం నీవు గ్రహించాలి.

ఒక శిష్యుడు గురువును సమీపించి 'స్వామీ: నాకు తత్త్వోపదేశం చేయండి' అని అడిగాడు. గురు వా యువకుణ్ని చూచిగూడా ఏమీ మాట్లాడలేదు, చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. ఆ యువకుడు రోజూవచ్చి అలాగే అడుగుతూ ఉండేవాడు. కాని ఆ యువకునికి కావలసిందేమిటో అతనికంటే గురువుకే ఎక్కువ తెలుసు. ఒక రోజున మంచి ఎండవేళ ఆయువకుణ్ని తనతో రమ్మని ఒక నదికి తీసుకువెళ్ళి అందులో మునగ మన్నాడు గురువు. యువకుడు మునిగాడు. గురు వతని వెంబడే నదిలోకి వెళ్ళి అతన్నలా నీళ్ళల్లోనే ముంచి ఉంచాడు. ఒక క్షణం గిజగిజలాడాక వదలిపెట్టాడు. 'నీళ్ళల్లో మునిగి ఉన్నప్పుడు నీకేం కావాలనిపించింది?' అని అడిగాడు గురువు. 'కొంచెం ఊపిరి' అని జవాబు చెప్పాడు శిష్యుడు. 'అది అవసరమైనంత తీవ్రంగా తత్త్వం కావాలా నీకు? అంత తీవ్రత ఉంటే క్షణంలో లభిస్తాడు దైవం' అన్నాడు గురువు, ఆ తృష్ణ ఆ తీవ్ర

వాంఛ, సిద్ధించకపోతే బ్రతకలేమన్న తహతహ - అది కలిగేవరకూ నీకు మతమూ లేదు, తత్త్వమూ లేదు. ధ్యేయరూపాలూ, పుస్తకాలూ, తెలివి తేటలూ ఎన్నింటితో ఎంత తంటాలు పడ్డా నీకు తత్త్వానుభూతి కలగనే కలగదు!

## బుద్ధుని వలె వేదనపడు బుద్ధుడ వవుతావు

నీ ఇతరులకొరకు వేదన పొందుతావా ? అయితే నీవు సర్వాత్మక త్వానికి (ఏకత్వానికి) యోగ్యుడ వవుతున్నావన్నమాట. ఇతరులకై వేదన నీలో లేకపోతే నీ వెంత ధీమంతుడ వైనా ప్రయోజనం లేదు. ఎండు మోడువలె అలాగే ఉంటావు.

మహాప్రవక్తల శక్తి ఎక్కడ ఉన్నదో చరిత్ర చదివి తెలుసు కున్నావా నీవు? ఎక్కడఉన్న దా శక్తి? బుద్ధిలోనా ? వాళ్ళల్లో ఎవరైనా పరతత్త్వాన్ని గూర్చిగాని, తర్కనైశిత్యంతో అవచ్ఛేదకాలు వేసి క్లిష్ట విషయాలను గూర్చిగాని ఉద్గ్రంథాలేమైనా వ్రాశారా ? ఒక్కరూ వ్రాయ లేదు. మహా చెప్పితే రెండు మూడు మాటలు చెప్పారు. క్రీస్తువలె వేదన పడు, నీవు క్రీస్తు వవుతావు. బుద్ధునివలె ఆవేదనపడు, నీవు బుద్ధుడ వవుతావు. అసలు జీవితం, బలం, జీవశక్తి సమస్తమూ వేదనే! అది లేనప్పుడు ఎంత ధీశక్తి ఉన్నా దైవాన్ని సమీపించలేవు. బుద్ధి కదిలించే శక్తి లేని అవయవాలవంటిది. వేదన ఉన్నప్పుడే అవి కదిలి ఏమైనా పని చెయ్యడానికి ఉపయోగిస్తాయి. సర్వ ప్రపంచమూ ఇలాగే ఉన్నది. ఈ విషయం నీవు మరిచిపోగూడదు. దీన్నెల్లప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి.

## జాలి వలని తీవ్ర వేదనతోనే
## వాల్మీకి నోట కవిత్వం వచ్చింది

ఒక రోజున వాల్మీకి మహర్షి గంగాస్నానానికి వెళ్తున్నాడు. దారిలో ఆయన క్రౌంచ దంపతులు అన్యోన్య ప్రేమతో, పరస్పర చుంబనాలతో ఒకదానిచుట్టూ ఒకటి తిరుగుతూ కేళీ పరవశులై ఉండడం చూచాడు. ఆయన కా దృశ్య మెంతో సంతోషాన్ని కలిగించింది. అంతలో ఒక బాణ మెక్కడినుండో దూసుకువచ్చి మగ పక్షిని చంపింది. అది పడిపోతూ ఉంటే సహచర వియోగాన్ని భరించలేక దాని ప్రేయసి అలమటించిపోయి ప్రియుని కళేబరం చుట్టూ తిరుగుతూ శోకావిలమై ఆక్రందించింది. ఆ దుఃఖాన్ని చూచి భరించలేకపోయాడు కవి. ఇటుతిరిగి చూడగానే వేటగాడు కనిపించాడు. 'ఓరి దౌర్భాగ్యుడా ! నీ కీ మాత్రం జాలి ఎందుకు లేకపోయింది? నీ మారక హస్తం ప్రేమనుచూచి అయినా ఊరుకోలేక పోయిందే?'

> మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీః సమాః
> యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామ మోహితమ్॥
>
> (రామా. - బాల.)

అన్నాడు వాల్మీకి. ఆ మాటలు అంటూనే 'ఏమి టిది? నే నేమంటున్నాను? ఇదివర కెన్నడూ నే నిలా మాట్లాడలేదే?' అని ఆశ్చర్యపోయాడు. అప్పు డెక్కడనుంచో 'భయపడకు. కవిత్వమంటే ఇదే ! నీ ముఖంలో నుంచి వెలువడుతోంది. విశ్వశ్రేయస్సుకై రామజీవితాన్ని కావ్యంగా వ్రాయి.' అంటూ ఒక గొంతు వినిపించింది. కవితావిర్భావం ఈ విధంగా జరిగింది. ప్రథమ శ్లోకం ఆదికవి వాల్మీకి జాలిగుండెలోనుండి వెలువడింది. ఆ తర్వాతే ఆయన రామ జీవిత కథను రామాయణం పేరుతో అత్యుత్తమ కావ్యంగా వ్రాశాడు.

## సక్రమ దృక్పథం

నీవుచేసే పనులన్నీ నిన్నుబట్టే జరుగుతాయి. నీప్రయోజనంకొఱకే జరుగుతాయి. భగవంతుడు నీ కోసం, నా కోసం గోతిలోపడి మనం చేసే దాన ధర్మాలవల్లా; ఆస్పత్రులు పెట్టడం, పాఠశాలలు కట్టించడం మొదలైన పనులవల్లా తన్ను ఉద్ధరించమని ప్రార్థేయపడడం లేదు. నీవు పనిచెయ్యడానికి అవకాశం కలిగిస్తున్నా వంతే! ఈ ప్రపంచ మనే వ్యాయామశాలలో, ఆయనకోసం కాక నీ క్షేమం కోసమే, నీ కండరాలకు పరిశ్రమ కలిగేందుకు అవకాశ మిస్తున్నాడు! నీ సహాయం లేకపోయినంత మాత్రాన ఒక చీమయినా చావదు. చస్తుందని భావించడం మహాపచారం!

ఆయన కోసం కాక ఆయన కింకరులమై పనిచేసే అవకాశం లభించినందువల్ల మనం ధన్యులం! సహాయమన్న పదాన్నే మనసులో నుండి తుడిచి వెయ్యాలి. నీవు సర్వ జగన్నేత అయిన భగవంతునకు సహాయం చేస్తావా? అర్థంలేనిమాట. కేవలం దురహంకారం!

భగవదారాధనకు మన కవకాశం లభించింది. ఈ ఉదాత్త దృక్పథంతో భగవద్రూపమైన విశ్వాన్ని సేవించడానికి పూనుకోవాలి. అప్పుడు నీకు నిస్సంగత్వం సిద్ధిస్తుంది. ఇది నీ విధి. ఇదే సక్రమమైన దృక్పథం! కర్మయోగ సిద్ధాంతరహస్య మిది.

## నిస్స్వార్థ సేవకుడే పరమ సుఖాన్ని పొందుతాడు

బిచ్చగాడికి సుఖముండదు. జాలిపడి అసహ్యించుకుంటూ, మరీ ఉదారులైతే కనీసం తమకంటె తక్కువ వాడనుకుంటూ, వాళ్లూ వీళ్లూ పెట్టేది ఏ కొంచెమో లభిస్తుంది బిచ్చగాడికి. దొరికిన బిచ్చంవల్ల వాడికి నిజమైన సుఖముండదు.

మన మందరమూ బిచ్చగాళ్ళమే! ఏం చేసినా మనకు ప్రతిఫలం కావాలి. లేదా మన మందరమూ వర్తకులం. జీవితంలో వర్తకులం, గుణగణాల్లో వర్తకులం, మతంలోనూ వర్తకులమే. అయ్యయ్యో! చివరికి ప్రేమలోనూ వర్తకులమే.

వర్తకం చెయ్యడానికి పూనుకుంటే అందులో ఇవ్వడం, పుచ్చుకోవడం; అమ్మడం, కొనడం ఉంటాయి. ఈ క్రయ విక్రయాలు కొన్ని నియమాల ప్రకారం జరుగుతాయి. చెడ్డరోజులూ, మంచిరోజులూ ఉంటూ ఉంటాయి. ధరలు పెరుగుతాయి, పడిపోతాయి. ఎప్పుడో దెబ్బ తగులుతుందని హెచ్చరికగా ఉండక తప్పదు. ఇది ఒక విధంగా అద్దంలో చూచుకోవడం వంటిది. అందులో నీ ముఖమే కనిపిస్తుంది. నీవు ముఖం బిగించు. అక్కడా బిగింపు ఉంటుంది. నవ్వు. అద్దమూ నవ్వుతుంది. క్రయ విక్రయాలూ, దానా దానాలూ ఇలాగే ఉంటాయి.

ఇందులో చటుక్కున పట్టువడిపోతాము. ఎలాగ? మన మిచ్చిన దాని వల్లకాదు, వస్తుందని ఆశించినదానివల్ల! మన ప్రేమకు ప్రతిఫలంగా దుఃఖం రావడం ప్రేమించినందువల్ల కాదు, తిరిగి ప్రేమను ఆశించినందువల్ల. ఆ ఆశ లేకపోతే దుఃఖమే లేదు. కామమే సర్వ దుఃఖాలకూ మూలం. నీవు కోరింది రావచ్చు, రాకపోవచ్చు. వచ్చినా రాకపోయినా కోరికలు దుఃఖాన్నే తెస్తాయి.

నూటికి తొంభై మంది సాధువులు భోగ భాగ్యాలన్నీ విడిచి సన్న్యాసులైనప్పటికీ చిట్ట చివరకు కీర్తి కామంతో బద్ధులౌతారు. 'మహా మనీషుల తుది దౌర్బల్యం! అహో యశస్సున ఎంతటి మోహం?' చదవ లేదా మహా కవి వాక్యాన్ని!

'పని పనికోసమే చేస్తా' నని చెప్పడం చాలా తేలిక. కాని అంత నిష్కామంగా కర్మాచరణ చెయ్యడం చాలా కష్టం. అటువంటి నిష్కామ కర్మపరుడే ఉంటే ఆ మహానుభావుణ్ని చూచి రావడానికి నేలమీద

చేతులూ మోకాళ్ళూ ఆన్చి జంతువులా నడిచి ఇరవై మైళ్ళయినా వెళ్ళి వస్తాను. ఎంతటివారి కయినా ఏదో ఒక ప్రయోజనం ఉంటుంది. ద్రవ్యం కాకపోతే అధికారం. అధికారం కాకపోతే లాభం. అదీ కాకపోతే మరొకటి. ఎలాగో ఎక్కడో ఏదో ఒక ప్రయోజనం ఉండి తీరుతుంది.

ఇదిగో ఈ విధంగా ఒక ప్రయోజనం కొరకు పని చేసినందు వల్లనే దుఃఖం వస్తుంది. స్వాత్మ ప్రభువులమై ఏపనిలో మనం నిమగ్నుల మవుతామో ఆ పనివల్లనే నిస్సంగత్వమూ, నిరతిశయ సుఖమూ లభిస్తాయి.

## నిస్వార్థ సేవకుడే ఉత్తమసేవ చేస్తాడు

'ప్రయోజన మనుద్దిశ్య న మందోపి ప్రవర్తతే' ప్రేరకమైన ప్రయోజనం లేకుండా మూర్ఖుడు కూడా ఏ పనీ చెయ్యడు. ఎవ్వరూ ఏ పనీ నిష్ప్రయోజనంగా చెయ్యలేరని చాలామంది చెప్పారు. ఇలా చెప్పే వాళ్ళు మత మౌఢ్య ప్రభావంతో జరిగిన పనులు తప్పవిడిచి నిస్స్వార్థ కర్మాచరణను చూచి ఉండరు.

ధనమూ, కీర్తీ మొదలైన ప్రయోజనాలు వేటినీ కోరకుండా కర్మాచరణ చేసేవాడే ఉత్తమంగా చేస్తాడు. అలా చెయ్యగలిగిననాడు అతడు బుద్ధుడే అవుతాడు. అతనిలోనుండి ప్రపంచాన్ని మార్చివేసే క్రియాశక్తి ఉద్భవిస్తుంది. కర్మయోగ పరమాశయానికి అతడే ప్రతినిధి.

ప్రవక్తలలో బుద్ధు డొక్కడే ఇలా అన్నాడు, "భగవంతుణ్ని గూర్చి ఎవరెవ రేమి చెప్తారో నా కక్కరలేదు ఆత్మనుగూర్చి వివిధ సిద్ధాంతాలూ చర్చించి ప్రయోజన మేమిటి? మంచి చెయ్యి, మంచిగా ఉండు. ఇదే నీకు స్వాతంత్ర్యా న్నిస్తుంది. ఉన్న పరమార్థాన్ని చేరుస్తుంది." ఆ మహానుభావుడు తన జీవిత యాత్రలో ఏ వ్యక్తిగత

ప్రయోజనాన్నీ అపేక్షించకుండా సంచరించాడు. ఆయన కంటె ఎక్కువ పని చేసినవా శ్వెవరు? అంతటి ఔన్నత్యాన్ని అందుకున్న వ్యక్తి చరిత్రలో మరెవరైనా కనిపిస్తారేమో చూపించండి.

ప్రేరక ప్రయోజనం ఏ కొంచెమూ లేని ఆదర్శ కర్మయోగి ఆయన. అంతటి మహాత్ముడు మరెన్నడూ పుట్టలేదని మానవ జాతి చరిత్ర నిరూపిస్తోంది. ఆయనలో ఉన్న నిశిత మేధా విశాల హృదయాల సమ్మేళనాన్ని గమనించి అంతటి ఆత్మశక్తి మరెవరిలోనైనా ఆవిష్కృతమైందేమో పోల్చి చూడండి.

ఆకాశంలోని సూర్యుడు సముద్రంలోని జలాన్ని వర్షం కురిపించడానికి తీసుకుంటున్నాడు. తీసుకోవడానికీ, ఇవ్వడానికీ ఉద్దిష్టమైన యంత్రనివి నీవు. ఇవ్వడంకోసం తీసుకో. అందుచేత ఏ ప్రతి ఫలాన్నీ కోరకు కాని నువ్వు ఇచ్చినకొద్దీ నీకు వస్తూ ఉంటుంది. గదిలో గాలిని ఎంత వేగంగా వినియోగిస్తే అంత వేగంగా బయటి గాలి లోపలికి వస్తుంది తలుపులన్నీ వేసేస్తే లోప లున్నదే ఉంటుందిగాని బయటిది లోపలికి రాదు: ఆ ఉన్నది కూడా కలుషితమై విషతుల్య మవుతుంది. నదుల తమ్మ తాము ఒడ్చుకుని సముద్రానికి జలాన్ని నిరంతరమూ ఇస్తున్నాయి వెంట వెంటనే నిండుతున్నాయి. సముద్ర నిర్గమనాన్ని నిరోధిస్తే వాటిని మృత్యువు వెంటనే గ్రహిస్తుంది.

## నిస్వార్థ సేవకుడే విజయాన్ని పొందుతాడు

మానవులకూ జీవకోటికీ స్వేచ్ఛగా చేసే సేవవల్లనే నిస్సంగత్వ సిద్ధిస్తుంది.

స్వేచ్ఛతోనూ, ప్రేమతోనూ పనిచేసేవాడు ఫలితాలకు లెక్క చెయ్యడు. ఇవి రెండూలేని బానిసకు కొరడాదెబ్బలు తగలాలి సేవకుడికి

జీతం ఉండాలి. జీవితంలో ఎక్కడ చూచినా ఇంతే! ఉదాహరణకు సామాజిక జీవితరంగం చూడండి. బహిరంగ సభల్లో వక్తలకు అప్పు డప్పుడు చప్పట్లూ, గుసగుసలూ, కేకలూ ఉంటూ ఉండాలి. అవేవీ లేకుండా వాళ్ళను ఏకాంతంలో ఉంచితే వాళ్ళు చచ్చిపోతారు. అవి వాళ్ళ కవసరం. దాసులై పని చెయ్యడంలో ఉన్న ఇబ్బంది ఇది. అటువంటి పరిస్థితులలో ఏదో ఒక ప్రతిఫలాన్ని కోరడం స్వభావమైపోతుంది.

ప్రతిష్ఠ నార్జించిన ప్రతి మానవుడూ అద్భుతమైన పట్టుదలా, నిజా యితీ కలిగి ఉంటాడు. అవే అతని జీవితం విజయవంతం కావడానికి హేతువులు. అతడు పూర్తిగా నిస్స్వార్థపరుడు కాకపోవచ్చు, కాని తదభి ముఖుడై ఉన్నాడు. అతడే నిస్స్వార్థపరుడైతే బుద్ధుని వలె, క్రీస్తు వలె మహావిజయాన్నే పొందేవాడు. నిస్స్వార్థపరత్వంలోని తారతమ్యాన్నిబట్టి విజయంలో తారతమ్యం ఉంటుంది.

అసలైన విజయానికి, నిజమైన సుఖానికి కీలకమిది. ప్రతిఫలాపేక్ష లేకుండా, పూర్తిగా నిస్స్వార్థపరుడై కృషి చేసేవాడే సంపూర్ణ విజయాన్ని పొందుతాడు. ఇది పైకి విరుద్ధంగా కనిపించవచ్చు. జీవితంలో స్వార్థంలేని మనిషిని అందరూ మోసగించడం, అన్యాయం చెయ్యడం మనం చూడడం లేదా? నిజమే. అలాగే కనిపిస్తోంది. 'క్రీస్తు నిస్స్వార్థపరుడు, అయినా ఆయనను సిలువవేశారు!' ఇదీ నిజమే, కాని ఆయన నిస్స్వార్థపరత్వమే ఆయన మహా విజయానికి మూల మన్న సంగతి కూడా మనకు తెలుసు. యథార్థ విజయాన్ని పొంది ఈ పూటకూ ఆ మహానుభావుడు కోట్లకొలది జనులకు మకుటమై వాళ్ళ జీవితాల నాశీర్వదిస్తూనే ఉన్నాడు.

## అహంభావాన్ని పరిత్యజించు

యోగివై కృషి చేసేటప్పుడు 'నే నిది చేస్తున్నాను, అది చేస్తున్నాను' అన్న స్మృతియే ఉండదు. పాశ్చాత్యులు దీన్ని అర్థంచేసు

కోరు. 'నే నన్న స్మృతి లేకపోతే, అహంభావం లుప్తమైతే మానవుడెలా పని చెయ్యగల'డని వాళ్ళు అడుగుతారు. కాని ఒకరు ఏకాగ్రతతో పని చేసేటప్పుడు తన్ను తాను మరిచి పూర్తిగా పనిలో నిమగ్నమయితే అప్పుడు జరిగే పని ఎంతో ఉత్తమంగా ఉంటుంది. ఈ విషయం అందరి జీవితంలోనూ అనుభవానికి వచ్చే ఉంటుంది.

మన మెన్నో పనులు - ఆహారం జీర్ణం చేసుకోవడం మొదలైనవి - మనకు తెలియకుండానే చేస్తాము. తెలిసి మరెన్నో చేస్తూ ఉంటాము. కొన్ని కొన్ని పనులు అహం ప్రత్యయం ఏ కొంచెమూ లేని సమాధిలో నిమగ్నమై చేస్తాము.

అహంభావం బొత్తిగాలేక చిత్రలేఖనంలో సంపూర్ణంగా నిమగ్నుడైన చిత్రకారుడు అత్యుత్తమ చిత్రాలను నిర్మిస్తాడు. యోగమార్గంలో దైవంతో ఏకమైన వ్యక్తి తానేం చేసినా ఏకాగ్రతలో నిమగ్నమై చేస్తాడు. ఏ వ్యక్తిగత ప్రయోజనాన్నీ అత డాశించడు. అట్టి కార్యాచరణం ప్రపంచానికి మేలే చేస్తుంది, కీ డెన్నడూ జరగదు. సర్వకర్మలనూ ఇలాగే ఆచరించాలని గీత బోధిస్తోంది.

దుర్భేద్యమైన గోడలు కట్టి అహంభావం మన్ని బంధించి వేస్తోంది, దానికి లొంగిపోయినందువల్ల ఇది చేస్తున్నాను, అదిచేస్తున్నాను అనుకుంటూ ఎంతసేపూ ప్రతిపనీ మన ప్రతాపంగానే భావిస్తూ ఉంటాము. ఈ నీచమైన అహాన్ని నిర్మూలించివెయ్యాలి. మనలో ఉన్న ఈ పైశాచికత్వాన్ని చంపివెయ్యాలి. 'నేను కాదు నీవు' అని చెప్పి ప్రకటిస్తూ దైవమే సర్వంగా భావించి జీవించాలి. అహంకార నిర్మితమైన జగత్తును పరిత్యజిస్తేనే గాని భగవత్సామ్రాజ్యంలో అడుగు పెట్టలేము.

పరమ శాంతంగా జీవిస్తూ, సమస్తాన్నీ ప్రేమిస్తూ వ్యక్తిత్వాన్ని ఉపసంహరించుకునే మహాత్ములలోనే శక్తి ఉంటుంది. వాళ్ళ కహంకార

మమకారా లుండవు. భగవత్కార్య నిర్వహణకు సాధన భూతులైనందుకు వారు ధన్యులు. అట్టివారే క్రీస్తులూ, బుద్ధులూ అవుతారు.

మూర్తీభవించిన ధర్మమే వాళ్ళు. వాళ్ళకు వేరే వ్యక్తిత్వం లేదు.

భగవంతుడు గుహ్యాతిగుహ్యంగా ఉన్నాడు. ఆయన చేసిన పని ఈ సృష్టి సర్వోత్తమమై ఉన్నది. అందుచేత తన్ను తాను మరుగు పరుచుకున్నవాడు ఎక్కువగానూ చేస్తాడు, ఉత్తమంగానూ చేస్తాడు. నిన్ను నీవు జయిస్తే సమస్త విశ్వమూ నీ దవుతుంది.

## అదృష్ట మర్మం

దేన్నిగూర్చీ ఆతురత లేనివానికి అన్నీ వాటంతటవే వస్తాయి. అదృష్టదేవత చపలాతి చపల. తన్ను కోరిన వాళ్ళ నామె లెక్కచెయ్యదు. ధనాతురుడు కానివాడి నెత్తిన అది ముమ్మరంగా కురుస్తుంది. కీర్తీ అంతే. వద్దన్న వాడికి సమృద్ధిగా వస్తుంది. చివరి కది భారమై ఎందుకు వచ్చిందిరా అనిపించే టంతగా వస్తుంది! ధనాదులు వాటిని లక్ష్యం చెయ్యని ప్రభువులకు వస్తాయి. బానిస కెన్నడూ ఏదీ రాదు. ఎవని జీవితం అల్పములూ, తుచ్ఛములూ అయిన ప్రాపంచిక విషయాలమీద ఆధారపడదో, ఎవడు వాటితో నిమిత్తం లేకుండా బ్రతుకుతాడో వాడే ప్రభువు. ఒకే ఒక ఆదర్శం కోసం జీవించు. ఆ ఆదర్శం దృఢమై శక్తిమంతమై అదే సమస్తమూ కావాలి. తదన్యానికి జీవితంలో తావుగాని వ్యవధిగాని ఉండనే కూడదు. అప్పుడు నీ కది సిద్ధించి తీరుతుంది.

## సాధ్య సాధనాలు రెంటి ఎడలా ఒకే రకమైన శ్రద్ధ చూపాలి

జీవితంలో నేను నేర్చుకున్న మహావిషయాల్లో ఇదొకటి. లక్ష్యానికి ఏ శ్రద్ధ చూపుతామో, దాన్ని పొందే మార్గానికీ అదే శ్రద్ధ చూపాలి.

విజయానికి మర్మ మిదే. సాధ్య సాధనాలు రెంటి యెడలా ఒకే శ్రద్ధ కలిగి ఉండాలి.

మన జీవితాల్లో ఉన్న పెద్ద లోప మిది. మన ఆదర్శం, మన జీవిత లక్ష్యం మన మనస్సుల్లో ఎంతో గొప్పదిగా తోచి, మిరుమిట్లు గొలుపుతూ సమ్మోహపరిచి దాన్ని అందుకునే మార్గంలో ఎట్లా నడుస్తున్నామో, ఎక్కడ అడుగు వేస్తున్నామో ఏమీ తెలియని పరిస్థితిలో పడేస్తుంది.

లక్ష్యాన్ని అందుకోలేక వైఫల్యం పొందడం ఎక్కడ తటస్థించినా సవిమర్శంగా ఆలోచించి చూస్తే నూటికి తొంభై చోట్ల సాధనాన్ని గూర్చిన శ్రద్ధ లేకపోవడమే హేతువని తెలుతుంది. తగినంత శ్రద్ధ చూపి సాధనం సమర్థమూ, శక్తిమంతమూ, నిర్దుష్టమూ అయేటట్లు చూచు కోవాలి. సాధనం మంచి దయితే సిద్ధి కాక తప్పదు. కారణమే కార్యాన్ని నిర్మిస్తుందన్నమాట మరిచిపోతాము. కార్యం దానంత టది రాలేదు. కార ణాలు సరి అయినవీ, సమగ్రమైనవీ, సమర్థమైనవీ అయినప్పుడే కార్య మేర్పడుతుంది. ఒకసారి ఆదర్శాన్ని ఎన్నుకుని మార్గాన్ని నిర్ణయించు కుంటే, ఆదర్శం ఉన్నచోటే ఉంటుందని మనకు నిశ్చయంగా తెలుసును కాబట్టి, మార్గం సక్రమమైనప్పుడు ఆదర్శాన్ని ఇంచుమించు మరిచి పోవచ్చు. కారణం ఉన్నప్పుడు కార్యాన్ని గూర్చిన ఇబ్బంది ఏముంటుంది? అది వచ్చి తీరుతుంది. కారణాన్ని గూర్చి మనం శ్రద్ధవహిస్తే కార్యం దాని సంగ తదే చూచుకుంటుంది. లక్ష్యసిద్ధి కార్యం. మన మనుసరించే మార్గం కారణం. అందుచేత మార్గాన్ని గూర్చిన శ్రద్ధ వహించడమే శ్రేష్ఠమైన జీవిత మర్మం.

## పూజామందిరమే సమస్తమూ కాదు

కాని ఒక విషయం తెలుసుకోవాలి. గొప్ప గొప్ప మహర్షులు పుట్టి ప్రపంచాని కనేక సందేశా లిచ్చారు. వా శ్శెన్నడూ కీర్తి ప్రతిష్ఠల

నాశించలేదు. కాని వాళ్ళ అనుయాయులు వాళ్ళ బోధలనే త్రోసిపేసి వారెక్కువ వీరెక్కువ అని పేరుకు ప్రాముఖ్య మిచ్చి కలహిస్తూ వచ్చారు. ప్రపంచ చరిత్రలో ఎక్కడచూచినా ఇదే కనిపిస్తుంది. శ్రీరామకృష్ణుని పేరును ప్రజ అంగీకరించినా, అంగీకరించకపోయినా నేనేమీ పట్టించుకోను. కాని ఆయన బోధలనూ, ఆయన సందేశాన్నీ, ఆయన జీవిత చరిత్రనూ ప్రపంచ మంతటా వ్యాపింపజెయ్యడానికి నా ప్రాణాలు ధారపోస్తాను. మనం నిర్మించే సంస్థ విషయంలో పూజా మందిరాన్ని గూర్చే నేను భయపడుతూఉంటాను. అందులో సహజంగా దోషంలేదు. కాని మనలోనే కొందరు దాన్నే సమస్తమూ అనుకుని వెనుకటి అజ్ఞానంలోనే పడి దానికై పట్టుపట్టి సర్వనాశనం చేస్తారేమో అని జంకుతూ ఉంటాను. వాళ్ళు ఈ పురాతన శుష్క విషయాల కెందుకు ప్రాముఖ్యమిస్తారో నాకు తెలుసు. ఆ జీవుల కేదో ఒక పని కావాలి. వేరేపని తోచక ఈ గంటలు కొట్టడం మొదలైన వాటితో తమ శక్తిని వృథా చేస్తూ ఉంటారు.

## మూర్ఖుడవు కాబోకు

ఒక భారతీయ సన్న్యాసి ఇలా అన్నాడు: 'ఇసుక పిండి తైలం తీస్తానంటే నమ్ముతాను. మొసలినోట్లో చెయ్యిపెట్టి గాయపడకుండా దాని దంతం లాగుతానంటే నమ్ముతాను. కాని మూర్ఖుణ్ని మారుస్తానంటే మాత్రం నమ్మను':

## సుప్రసిద్ధ మూర్ఖుడు

భారతదేశంలో ద్వైతు లయిన వైష్ణవులు బొత్తిగా సహనంలేని వర్గంవారు. మరొక ద్వైత వర్గమైన శైవుల్లో ఘంటాకర్ణు డనే భక్తుని కథ ప్రసిద్ధమై ఉన్నది. ఆ భక్తుడు శివారాధన విషయంలో పరమ తీవ్రు డయినందువల్ల ఇతర దేవతల పేరు వినిపించి పోతుందేమోనని రెండు

చెవులకూ రెండు గంటలు కట్టుకుని తిరిగేవాడట. ఆ గంటల మ్రోతలో ఎవరైనా ఇతర దేవతలపేరు లుచ్చరించినా అతనికి వినిపించేవి కావు. అత డంత తీవ్రుడై శివభక్తి చూపుతూ ఉంటే శివ కేశవులకు భేదంలేదని అతనికి బోధించాలని అతని ఇష్ట దైవమే సగం శివుడుగా సగం విష్ణువుగా కనిపించాడట. ఆ సమయంలో ఘంటాకర్ణుడు ధూపం వేస్తున్నాడు. ఆ పొగ విష్ణువు ముక్కువైపుకుగూడా వెళ్తోంది. వెళ్తే విష్ణువు ఆ సుగంధం అనుభవించేస్తాడుగదా! అదే జరిగితే ఇంకేమైనా ఉన్నదా? తన శివారాధన అంతా వ్యర్థమై పోదూ? అందుకని అత డూరుకో లేక ఆ గంధం తగలకుండా ఉండేందుకు ఆ వైపు ముక్కులో వేలు పెట్టాడట! అత డంత మూర్ఖాగ్రేసరుడు.

## మూఢావేశం పనికిరాదు

మూఢావేశం రకరకాలుగా ఉంటుంది. ఈ ఆవేశంవల్ల కొందరు మద్యం మంచిదంటే మరికొందరు చుట్టలు మంచి వంటారు. జనం చుట్టలు కాల్చడం మానివేస్తే ప్రళయం వచ్చేస్తుందని భావించే మూఢు లున్నారు. ఈ భారతదేశంలో విగత భర్తృకలు మళ్ళీ పెళ్ళాడితే అన్ని అనర్థాలూ పోతాయని అనుకునే వాళ్ళు ఇప్పు డెంతమందో ఉన్నారు. మూఢావేశ మంటే ఇదే!

నా చిన్నతనంలో నేనుకూడా కార్య సాధన కిటువంటి ఆవేశం అవసరమని అనుకునే వాణ్ణి. పెద్దయిన తరువాత అది సరి కాదని గ్రహించాను.

జనాన్ని మోసగిస్తూ తిరిగే మనిషి ఒక డున్నా డనుకోండి. అతన్ని నమ్మడమంటూ ఉండదు. ఏ స్త్రీ అతని దగ్గర సురక్షితకాదు. ఇంత దుర్మార్గు డయినా అతడు మద్యాన్ని సేవించ డనుకోండి. అతనికి మద్య సేవకులలో మంచి బొత్తిగా కనిపించదు. మద్యసేవకుల దోషాలు

చెప్తాడు కాని తాను చేసే దుర్మార్గాలను ఏ కొంచెమూ గమనించడు. ఇది మానవ సహజమైన స్వార్థపరత్వం, ఏకపక్ష దృష్టి. మూఢావేశ లక్షణ మిలా ఉంటుంది.

నూటికి తొంభై మంది మూఢావేశపరులు దుష్టజీవితం గడిపేవారు గానే ఉంటారు. లేదా ఏదో ఒక జబ్బుతో బాధపడుతూ ఉంటారు. కొంచెం పరిశీలించి చూస్తే ఈ మూఢావేశం కూడా ఒకవిధమైన రోగమే అని వైద్యులు అంగీకరిస్తారు. దీని ఫలితాలు నేను చాలా చూచాను. స్వామీ! నా కీ జబ్బు రానివ్వకు!

మూఢావేశంతో సంస్కారాలకు పూనుకోవడం మానివెయ్యాలని నా అనుభవం నాకు చెప్తోంది. ప్రపంచం నెమ్మదిగా సాగుతోంది. దాన్ని అలాగే సాగనివ్వాలి. మన మెందుకు తొందరపడాలి? బాగా నిద్రపో. నిబ్బరంగా ఉండు. సరి అయిన తిండి తిను. లోకాన్ని సానుభూతితో చూడు. ఆవేశపరులు విద్వేషమే తెచ్చుకుంటారు.

ఆవేశపరుల సాహచర్యం వదిలి ఇవతలికి వస్తే నిజంగా ప్రేమించడమూ, సానుభూతిచూపడమూ నీకు తెలుస్తాయి. ప్రేమా, సానుభూతీ నీలో పెరిగినకొద్దీ ఈ దీనులను నిందించే దృష్టి తగ్గిపోతుంది. వాళ్ళ దోషాలను గూడా నీవు సానుభూతితో చూడగలవు.

ఒకానొకప్పు డొక రాజు, పొరుగుదేశపు రాజు తన రాజధాని మీదికి దండెత్తి వస్తున్నా డని విని శత్రువునుండి దేశాన్ని రక్షించుకునే ఉపాయం కోసం మంత్రుల్నీ ప్రజల్నీ సమావేశపరిచాడు. రాజధాని చుట్టూ పెద్ద మట్టి కట్ట వేసి దాని వెంబడే లోతైన అగడ్త త్రవ్వాలని ఖనకులూ, సౌధనిర్మాణ నిపుణులూ సలహా ఇచ్చారు. వడ్రంగులు కొయ్యలతో గోడ కట్టాలన్నారు. సృష్టిలో తోలువంటి దినుసు మరొకటిలేదు కాబట్టి దానితో గోడకట్టితే మంచిదని చర్మకారులన్నారు. కమ్మరులు మిగిలినవాళ్ళు చెప్పింది తప్పని

గట్టిగా చెప్పి అన్నింటి కంటె దృఢమైనది ఇనుము కాబట్టి దానితోనే గోడకట్టాలన్నారు. ఆ తర్వాత న్యాయవాదులు లేచి దేశాన్ని సంరక్షించడానికి శత్రువుతో వాదించడమే ఉత్తమ మార్గమనీ, ఇతరుల ఆస్తిని స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించడం తప్పు కాబట్టి న్యాయస్థానమంగీకరించదని శత్రువుకు న్యాయశాస్త్రం తెలియజెప్పాలనీ అన్నారు. చిట్టచివరకు మతగురువులు లేచి అందరినీ పరిహసించి 'మీఅందరికీ మతులు పోయినట్టున్నాయి. అన్నిటికంటే ముందు దేవతలను తృప్తి పరచాలి. హోమాలు చెయ్యాలి. బలులివ్వాలి. అప్పుడే మన మజేయులమవుతాము' అని చెప్పారు. ఈ విధంగా ఆ దేశంలోని ప్రజలందరూ దేశాన్ని సంరక్షించడానికి పూనుకోక తమ తమ అభిప్రాయ భేదాలతో మూఢావేశంతో పరస్పరం కలహిస్తూ కూర్చున్నారు. ఈ లోగా శత్రువు దండెత్తివచ్చి రాజధానిని సర్వనాశనం చేశాడు. మనుష్యుల విషయమూ ఇంతే. బాగుపడడానికి ఉపక్రమించాలిగాని ఉపాయాన్ని గూర్చి పట్టుదలలు వహిస్తే నాశనమై పోతారు.

## దౌర్బల్య మూఢ విశ్వాసాలను విడిచిపెట్టాలి

నే నెప్పుడు చెప్పినా ఈ విషయాని కెక్కువ ప్రాముఖ్యమిస్తు ఉంటాను. ఆధ్యాత్మికంగా, మానసికంగా, దైహికంగా దౌర్బల్యాన్ని కల్పించేది ఏమైనా సరే దాన్ని కాలివ్రేళ్ళతోగూడా తాకగూడదు మానవునిలో సహజంగాఉన్న సాత్త్విక శక్తి కావిష్కారమే మతము ఈ చిన్న శరీరంలో అనంతమైన శక్తి చుటలు చుట్టుకుని అణిగిఉన్న తీగచుట్టలా ఉన్నది. అది దానంతటదే విచ్చుకుని వ్యాపిస్తోంది. వ్యాపన మధికమైనకొద్దీ ఒకదాని తర్వాత ఒకటిగా ఎన్నో దేహాలు సరిపో పోవడంవల్ల విడిచిపెట్టేసి ఉత్తమోత్తమ దేహాలు ధరిస్తోంది. మానవుని మతం. నాగరకత, అభ్యుదయం – వీటి చరిత్ర ఇదీ !

భవిష్యత్తు తెలుసుకోవాలన్న ఆతురతా, మర్మ విద్యా ప్రీతి మొదలైనవి మనో దౌర్బల్య చిహ్నాలు. ఆ లక్షణాలు పొటమరించి మనస్సులో బలపడుతున్నట్లు తోస్తే వెంటనే వైద్యుణ్ణి సంప్రతించి మంచి ఆహారం పుచ్చుకుంటూ విశ్రాంతి తీసుకోవాలి.

ఒక జ్యోతిష్కుణ్ణి గూర్చిన పాత కథ ఒకటి ఉన్నది. ఒక రాజు వద్దకు ఒక జ్యోతిష్కుడు వచ్చి నీ వారునెలలలో చచ్చిపోతావని చెప్పాడట! ఆ రాజు దిగులుపడి ఆ భయంతోనే చచ్చిపోయే స్థితికి వచ్చాడు. కాని ఆయన మంత్రి మంచి తెలివిగలవాడు. అతడు రాజుతో ఈ జ్యోతిష్కులు వట్టి మూర్ఖులని చెప్పాడు. రాజు కా మాటలమీద నమ్మకం కలగలేదు. జ్యోతిష్కులు మూర్ఖులని రాజుకు నమ్మకం కలిగించే మార్గం మరొకటి తోచక ఆ మంత్రి రాజుగారికి మృత్యుభయం కలిగించిన జ్యోతిష్కుణ్ణి రాజభవనానికి పిలిపించాడు. 'ఏమయ్యా, నీవు రాజుగారికి జ్యోతిష్యం చెప్పావుగదా! లెక్కలన్నీ సరిగానే వేశావా?' అని అడిగాడు. జ్యోతిష్కుడు తన లెక్కలో తప్పుండడానికి వీల్లేదని అంటూనే మంత్రిగారి తృప్తికోసం మళ్లీ మళ్లీ లెక్కలు సరిచూచి తప్పేమీ లేదని చెప్పాడు. దాంతో రాజుగారి ముఖం వివర్ణమై పోయింది. మంత్రి నిబ్బరంగా జ్యోతిష్కుణ్ణి చూచి 'మరి నీ వెప్పుడు చచ్చిపోతావో నీకు తెలుసునా?' అన్నాడు. తడుముకోకుండా జ్యోతిష్కుడు 'పన్నెండేళ్లల్లో' అని సమాధానం చెప్పాడు. ఆ మాట వింటూనే మంత్రి కత్తి దూసి జ్యోతిష్కుని తల మొండెంనుండి వేరుచేసి 'చూశారా ఈ అబద్ధాలకోరును? వెంటనే చచ్చి ఊరుకున్నాడు' అన్నాడు రాజుతో.

## కష్టాలను ధైర్యంతో ఎదుర్కో

ఒకప్పుడు నేను కాశీలో ఉండగా ఒక ఎత్తైన గోడకూ, ఒక లోతైన తటాకానికి మధ్య నున్న సందులో నడిచి వెళ్తున్నాను. ఆ

ప్రాంతం నిండా కోతులు సమృద్ధిగా ఉన్నాయి. కాశీ కోతులు పరమ మూర్ఖంగానూ, అప్పుడప్పుడు క్రూరంగానూ ప్రవర్తిస్తూ ఉంటాయి. నన్ను దారివెంట పోనివ్వగూడదని వాటికి దుర్బుద్ధి పుట్టి నా వెంటబడి అరిచి గోల చేస్తూ కాళ్ళ కడ్డం పడసాగాయి. అవి మీదికి రాగానే నేను పరుగెత్తాను. అవీ పరుగెత్తి నన్ను కరవడం మొదలుపెట్టాయి. తప్పించుకోవడం అసాధ్యమనిపించింది. అంతలో అవతలనుండి ఎవరో 'ఎదురు తిరిగి తరిమివెయ్యి మూర్ఖుల్ని!' అన్నాడు. నేను వెనక్కి తిరిగి ఎదుర్కొన్నాను. అవి జంకి చివరికి పారిపోయాయి. ఈ అనుభవం జీవితానికంతకూ ఉపదేశమైంది. కష్టాన్ని ఎదుర్కోవాలి. ధైర్యంతో ఎదుర్కోవాలి. ఆ కోతుల్లాగానే జీవిత కష్టాలు కూడా. వాటిని చూచి మనం పారిపోవడం మానివేస్తే అవే జంకి వెనక్కి పోతాయి

## రెండు విధాల ధైర్యం

ధైర్యం రెండు విధాలుగా ఉంటుంది. ఫిరంగి కెదురుగా రొమ్ము విప్పి వెళ్ళగలగడం ఒక విధం. మరొక విధం ఆధ్యాత్మిక విశ్వాసానికి చెందింది. భారతదేశం మీదికి దండెత్తివచ్చిన ఒక చక్రవర్తి ఆయన గురువు సలహా ననుసరించి అరణ్యాల్లో మహర్షులను చూడడానికి వెళ్లాడు. ఎంతో కాలం అన్వేషించాక ఒక చోట ఒక పెద్ద రాతిపలకమీద కూర్చుని ఉన్న వృద్ధ తపస్వి నొకణ్ని చూచాడు. చక్రవర్తి ఆయనతో కొంతసేపు మాట్లాడి ఆయన విజ్ఞానానికి ముగ్ధుడయ్యాడు తనతోపాటు తన దేశానికి రావలసిందని ఎంతో వినయంతో ఆహ్వానించాడు. 'నేను రాను. నాకీ అరణ్యంలో తృప్తిగా ఉన్నది' అన్నాడు తపస్వి. 'మీకు ధనమిస్తాను. మంచి ఉన్నతమైన పదవి ఇస్తాను. కావలసినంత ఐశ్వర్య మిస్తాను. నేను ప్రపంచానికే ప్రభువును' అన్నాడు చక్రవర్తి. 'నా కవేవీ అక్కర లేదు. నేను రాను' అన్నాడు వృద్ధుడు. 'అయితే నిన్ను చంపివేస్తాను'

అన్నాడు చక్రవర్తి కోపంతో. వృద్ధుడు చిరునవ్వు నవ్వి గంభీరంగా 'ఓయీ చక్రవర్తీ! నీ వన్న వాటిలో ఇది చాలా మూర్ఖమైన మాట. నువ్వు నన్ను చంపలేవు. సూర్యుడు ఎండించలేడు. అగ్ని మండించలేదు. కత్తి ఖండించలేదు. నేను జనన మరణ శూన్యమైన సర్వవ్యాప్తమైన నిత్యమైన ఆత్మను' అన్నాడు. ఆధ్యాత్మిక ధైర్య మిలా ఉంటుంది. వేరే రకం సింహంవలె పెద్దపులివలె మీదికి దూకించేది.

## ధీరోదాత్తుడవు కా !

నేనొకప్పుడు దక్షిణ సముద్ర ద్వీపాలలో తుపానులో చిక్కుకొన్న నౌకలను గూర్చి ఒక కథ చదివాను. ఆ నౌకల చిత్రాలను సచిత్ర లండన్ వార్తా పత్రికలో ప్రచురించారు. ఒక్క ఆంగ్ల నౌక తప్ప తక్కినవన్నీ శిథిలమై పోయాయి. ఆ బొమ్మలలో- మునిగిపోతున్న నౌకలలో ఉన్న వ్యక్తులు మంచి నౌకలో ఉండి తుపానునుండి తప్పించుకుని వెళ్తున్న వాళ్ళను సంతోషంతో సాగనంపుతున్నారు. అటువంటి ధైర్యమూ, ఔదార్యమూ ఉండాలి. మన దుస్థితిలోకి ఇతరులను గుంజివెయ్య గూడదు.

## ఐచ్ఛికంగా సహించాలి

ప్రపంచ భారాన్ని వహించడానికి నిజంగా నీవు సిద్ధపడితే, రా ముందుకువచ్చి బరువంతా నెత్తిన పెట్టుకో. ముందు ఉబలాటంతో నెత్తి కెత్తుకుని తర్వాత గొణగడమూ, విసుక్కోవడమూ, శాపనార్థాలు పెట్టడమూ పనికిరాదు. మా బరువులతో మేము నీ కంటె బాగా ఉన్నా మనిపించేటట్లు నీ బాధలతో మమ్మల్ని భయపెట్టబోకు. ఐచ్ఛికంగా భారాన్ని వహించేవాడు ప్రపంచాన్ని ఆశీర్వదించి తన దారిని తానువెళ్తాడు. నిందగాని విమర్శగాని ఎన్నడూ చెయ్యడు. దోషంలేదనికాదు. ఉన్నదాన్ని గుర్తించి తనంతట తాను ఇష్టపూర్వకంగా బరువెత్తుకున్నప్పుడు ఒకరి

ననవలసిన పనేముంది ? రక్షకుడే ఉల్లాసంగా తన దారిని తాను వెళ్ళాలి, రక్షితుడు కాదు.

కోరనూవద్దు, తప్పించుకోనూవద్దు దేని మూలంగానూ చలించక పోవడమే స్వాతంత్ర్యం: ఊరికే సహించడంకాదు, నిస్సంగివి కావాలి. సుఖం వస్తుంది - మంచిదే ! ఎవరు కాదంటారు ? దుఃఖం వస్తుంది. దాన్ని గూడా ఆహ్వానించు. ఎద్దు కథ జ్ఞాపకం పెట్టుకో. ఒక ఎద్దు కొమ్ము మీద ఒక దోమ చాలాసేపు కూర్చుంది. పాప మీ ఎద్దును బాధ పెడ్తు న్నామే అని దానికే తోచి 'ఏమండీ ఎద్దుగారూ ! మీ కొమ్ము మీద ఎంతసేపటినుంచో కూర్చుంటున్నాను. మీ కిబ్బంది కలిగిస్తున్నానేమో. నాకే బాధగా ఉంది. వెళ్ళిపోతానులెండి' అని చెప్పింది. అప్పుడా యెద్దు 'అబ్బెబ్బే ! నాకు ఇబ్బంది ఏమిటి ? అదేమీలేదు. మీ వంశాన్నంతటినీ తెచ్చి నా కొమ్ముమీద కాపురం పెట్టండి. మీరు చెయ్యగలిగే దేముంటుంది? నాకు వచ్చే నష్టమేమీ ఉండదు' అని నిశ్చలంగా జవాబు చెప్పింది.

మనకు వచ్చే కష్టాలతో ఈ మాట ఎందుకు చెప్పలేం ?

## దోష వైఫల్యాలు ప్రచ్ఛన్న దేవతలు

మన భావాలే మన్ని నడిపిస్తాయి. మనస్సును ఉదాత్త భావాలతో నింపి వాటిని గూర్చి దినదినమూ వింటూ నెలల తరబడి మననం చెయ్యాలి. వైఫల్యాలను లెక్కచెయ్యగూడదు. అవి రావడం సహజం. నిజానికి వైఫల్యాలే జీవితానికందాన్ని తెస్తాయి. అవి లేకపోతే జీవిత మేమిటి ? కష్టాలు లేని జీవితం వహించడమే అనవసరం. జీవన కవిత ఎక్కడుంటుంది అవి లేకపోతే ? అందుచేత దోషాలనూ, కష్టాలనూ లెక్క చెయ్యగూడదు. ఏ ఆవూ అబద్ధం చెప్పదు. అది ఆవే - మనిషి కాదు. మనుష్యులమైనందువల్లనే మనం కొన్ని తప్పులు చేస్తూ ఉంటాము, వైఫల్యం పొందుతూ ఉంటాము. అందుచేత వాటిని లెక్కచెయ్యగూడదు.

ఆదర్శాన్ని పదే పదే లక్ష్యంలో ఉంచుకుని వెయ్యిసార్లు విఫలమైనా మరొకసారి ప్రయత్నించాలి,

పూర్తిగా దుష్టమైంది ఏదీ లేదు. దైవంతో దయ్యానికే ఈ లోకంలో చోటున్నది. లేకపోతే అది ఇక్కడ ఉండేదేకాదు.

అలాగే మన దోషాలకు గూడా స్థానాలున్నాయి. ముందుకు నడు. ఏమైనా తప్పుచేసినట్లు తోచినా వెనక్కి చూడకు. వెనుకటి తప్పులే చేసి ఉండకపోతే నీ వీ పూట ఇప్పుడున్న స్థితిలో ఉండేవాడివా? వాటిని చేసే పైకి వచ్చావు. అందుచేత వాటి నాశీర్వదించు. అవి నీకు ప్రచ్ఛన్న దేవతలై ఉపకారం చేశాయి. కష్టానికి జై! సుఖానికి జై! నా అదృష్ట మింతే అని బాధపడకు. ఆదర్శాని కంటిపట్టుకుని ఉండు స్థైర్యంతో ముందుకు పో! అల్పాల్ప విషయాలనూ, దోషాలనూ, పట్టించుకుని వెనక్కి చూస్తూ ఆగిపోకు. ఈ మన జీవిత సంగ్రామ రంగంలో దోషధూళి లేవక తప్పదు. దుమ్మంటుతుందని జంకే సుకుమారులు వెనక్కి తగ్గి పోవలసిందే!

## నీ దైవత్వాన్ని తెలుసుకో!

నే నొకప్పుడు హిమాలయాల్లో ప్రయాణం చేస్తున్నాను. ముందు పోవలసిన దారి ఎంతో ఉన్నది. మా బీద సన్యాసులకు వాహనా లెక్కడ లభిస్తాయి? అందుచేత నడిచే వెళ్తున్నాము. మాలో ఒక వృద్ధు డున్నాడు. వెళ్ళవలసిన దారి ఎత్తుపల్లాలతో కొన్ని వందలమైళ్ళున్నది. ముందున్న దారి చూచి ఆ వృద్ధుడు 'అయ్యో! ఇవన్నీ దాటడ మెల్లాగ? నే నింక నడవలేను. నా గుండె పగిలి పోతుంది' అంటూ చతికిలబడ్డాడు. మే మప్పుడు మంచి ఎత్తుమీద ఉన్నాము. నేనా వృద్ధుడితో 'బాబా! క్రిందికి చూడు' అన్నాను. ఆయన చూచాడు. 'చూచారా! అదంతా మీరు నడిచివచ్చిన దారే! అటువంటిదే ముందూ ఉన్నది. అదీ త్వరలోనే

మీ పాదాక్రాంత మవుతుంది.' అని ధైర్యం చెప్పాను. మనం దివ్య నక్షత్రాలం కాబట్టి అత్యున్నత విషయాలు కూడా మన పాదాలకు దిగువనే ఉంటాయి. నీవు కోరితే గుప్పిళ్ళతో నక్షత్రాలను పట్టుకుని బిళ్ళలవలె మింగి వెయ్యగలవు. నీ సహజ ప్రకృతి అటువంటిది. శక్తిమంతుడవై మౌఢ్యం విడిచి స్వతంత్రుడవై ఉండు.

## ప్రశాంత నిర్విరామ కృషి

గొప్ప పదవిలో ఉన్నప్పుడు ఎవడైనా గొప్పగానే కనిపిస్తాడు. విద్యుద్దీప సముద్దీప్తమైన రంగస్థలంలో పిరికివాడు కూడా ధైర్యం నటిస్తాడు. లోకం చూస్తుంది. అదిచూచి ఎవడి గుండె గుబగుబలాడదు? ఎవడు ఉద్రిక్తుడు కాడు? చూడగా చూడగా నిజమైన గొప్పతనం నెమ్మదిగా శాంతంగా ఎడతెరిపి లేకుండా క్షణక్షణమూ తన పని తాను చేసుకు పోయే క్రిమిలో ఉన్న దనిపిస్తుంది.

ఒక చిన్న ఉడత నీళ్ళల్లో ఒళ్ళు తడుపుకుని ఇసుకలో దొర్లాడి సేతువు కడ్తున్నచోట ఆ ఇసుక దులిపి మళ్ళీ మళ్ళీ అలాగే చేస్తున్నదట. రామ కార్య నిర్వహణానికి పాప మా ఉడత తనకు చేతనైంది తాను చేస్తోంది. పెద్ద పెద్ద వృక్షాలూ, పర్వతాలూ పెకలించి తెస్తున్న వానర పుంగవులు ఒంటి కంటించుకువచ్చిన ఇసుక దులుపుతున్న ఉడతనుచూచి నవ్వుకున్నారట. రాముడా ఉభయులనూ చూచి 'ఎందుకలా నవ్వుకుంటారు? ఆ ఉడత కలకాలం వర్ధిల్లాలి. దానికి చేతనైనది శక్తివంచన లేకుండా అది చేస్తోంది. అందుచేత మీరెంత గొప్పవాళ్ళో అదీ అంత గొప్పదే!' అని చెప్పి ఆ ఉడత వెన్నుమీద తన వ్రేళ్ళతో రాసి దాన్ని ప్రేమతో బుజ్జగించాడట! అప్పటినుంచీ ఉడతలకు వెన్నుమీద చార లేర్పడ్డాయని చెప్పుకుంటారు. ఈనాటికీ ఉడతలు వెన్నుపై చారలతో కనిపిస్తూనే ఉంటాయి.

## అన్ని విధులూ పవిత్రాలే!

ప్రతివిధీ పవిత్రమైనదే. శ్రద్ధాభక్తులతో విధిని నిర్వహించడమే భగవదర్చనా మార్గాలలో ప్రశస్తమైనది.

సన్నిహితమై ఉన్నవిధిని, తత్కాలంలో నిర్వహించ వలసినవానిని సమర్థంగా చేసినందువల్ల మనలను మనం వృద్ధి పరుచుకుంటాము. అలా క్రమక్రమంగా మనసామర్థ్యం పెరిగినకొద్దీ జీవితంలోనూ, సంఘంలోనూ ఉన్నతోన్నత విధులను నిర్వహించే అవకాశం మనకు లభిస్తుంది

అదీకాక మనకు తగిన పదవులే మనకు లభిస్తాయి నియతమైన ఈ సృష్టిలో ప్రతిదీ యోగ్యత ననుసరించి జరుగుతోంది. ప్రతివస్తువుకూ తగిన ప్రయోజన మున్నది; ప్రతివ్యక్తికీ తగిన విధి ఉన్నది. ఒకనికి ఒకని కంటె ఎక్కువ శక్తి ఉంటే దానికి తగిన ఆధిక్యాన్ని విశ్వం చూపిస్తుంది. అందుచేత అసంతృప్తి చెందడం ప్రయోజనకారి కాదు. ఒకానొక ధనవంతుడు క్రూరుడు కావచ్చు, కాని వాడు ధనవంతుడు కావలసిన యోగ్యత వాడిలోఉంది. ఆ యోగ్యత మరెవరిలోనైనా ఉంటే వాళ్లూ ధనవంతు లౌతారు. అదిలేదు, ఇదిలేదు అని ఆందోళనచేసినందువల్లా, పోరాడినందువల్లా ప్రయోజన మేముంటుంది? అలా చేస్తే మన ముత్త ములం కాము.

## నీ అదృష్టాన్ని నిందించకు :
## ప్రతి విధినీ ప్రేమించు!

తన వంతుకు వచ్చిన చిన్న పని చెయ్యడానికి ధుమధుమ లాడే వాడు అన్నిటికీ అలాగే ఉంటాడు. ఎప్పుడూ ధుమధుమ లాడుతూ, చిరాకు పడుతూ ఉండడంవల్ల బ్రతుకే భారమై పోయి అన్నింటిలోనూ వైఫల్యమే పొందుతాడు. తన వంతుకు వచ్చిన విధిని సక్రమంగా

నిర్వహిస్తూ ఉత్సాహంతో జీవితాన్ని గడిపేవాడు ఉన్నతోన్నత విధుల నందుకుంటూ సాఫల్యాన్ని పొందుతాడు.

ఫలాభిషంగంతో కర్మాచరణ చేసేవాడే తనకు ప్రాప్తించిన విధిని గూర్చి బాధపతాడు. నిస్సంగియై చేసేవానికి అన్ని విధులూ మంచివే అనిపిస్తాయి. పైగా వాటిని స్వార్థపరత్వాన్ని ఇంద్రియ లౌల్యాన్ని జయించే టందుకూ, ఆత్మ స్వాతంత్ర్యాన్ని సాధించేటందుకూ ఉపయోగించే సమర్థ మైన సాధనాలుగా స్వీకరిస్తాడు.

ధుమధుమలాడేవాడికి అన్ని విధులూ అసహ్యామే అవుతాయి. ఏదీ అతనికి తృప్తి కలిగించలేదు. వాని జీవితం విఫలంకాక తప్పదు. జీవ యాత్రలో మనకు ప్రాప్తమయ్యే విధిని సంతోషంతో నిర్వర్తిస్తూ ఉత్సా హంతో సాగిపోదాము. మన కంధకారం తొలిగి వెలుగు కనిపించి తీరుతుంది.

ఏ పనీ అల్పంకాదు. ఇష్టమైన పని లభిస్తే పరమ మూర్ఖుడు గూడా చెయ్యగలడు. అన్ని పనులూ తన కిష్టమయేటట్లు చేసుకోగలడాడే నిజంగా తెలివితేటలు కలవాడు.

ఈ జగత్తులో ప్రతి వస్తువూ మఱ్ఱి విత్తనంవంటిది. అది ఆవగింజ వలె మిక్కిలి చిన్నదైనా అందులోనే అవ్యక్తమైన మహావృక్ష ముంటుంది. దీన్ని గ్రహించి సమస్త కర్మనూ పరమ శ్రేష్ఠం చేసుకోగలవాడే నిజమైన ధీశాలి !

ఇతరులను నిందించకు !
ఆత్మవిమర్శ చేసుకో !

మనంతట మనం అవకాశమిస్తేనేగాని మన కేమీ కాదన్న సంగతి గ్రహించాలి. దేహం అనుకూలమైతేనేగాని రోగం రా నేరదు. కేవల

రోగ క్రిములవల్ల కాక అనుకూల పరిస్థితులు దేహంలో ఉన్నప్పుడే రోగం వస్తుంది. అదీకాక మనకు యోగ్యమైందే మనకు లభిస్తుంది. వ్యర్థమైన దురభిమానం విడిచిపెట్టి చూస్తే మన కష్టాలు మనకు తగినవే అని తెలుస్తుంది. తగని దెబ్బ ఎన్నడూ తగలదు. ఏ అపకారానికైనా మన చేతులతో మనమే అవకాశం కల్పిస్తాము. ఇది గ్రహించి తీరాలి

ఆత్మవిమర్శన చేసుకో, నీకు వచ్చిన కష్టా లన్నిటికీ నీవే కారకుడవని స్పష్టమవుతుంది. నువ్వు సగం చేశావు, తక్కిన సగం బాహ్యజగత్తు చేసింది. ఈ నిర్ణయం మనకు శాంతిని కలిగిస్తుంది. ఇందులోనుంచే దుఃఖ నివారణకు ఉపాయమూ తెలుస్తుంది. 'బాహ్య జగత్తు నా అధీనంలో లేదు. నాలో ఉన్న సమస్తమూ నాకు పరమ సన్నిహితమై నా అధీనంలోనే ఉన్నది. ఏ కష్టానికైనా ఈ రెండూ కలవవలసి ఉన్నప్పుడు నా అధీనంలో ఉన్నచోట నే నవకాశం ఇవ్వని పక్షంలో నాకు కష్టం ఎలా కలుగుతుంది? నామీద నాకు సంపూర్ణమైన అధికారం ఉంటే నాకే కష్టమూ రాదు.' దుఃఖ నివారణానికి ఇదే పరమోపాయం

అందుచేత నీ దోషాలకు ఇతరులను నిందించకు. నీ కాళ్ళమీద నీవు నిలబడి బాధ్యత నంతటినీ స్వీకరించు. 'నే ననుభవిస్తున్న ఈ కష్టం నేను తెచ్చుకున్నదే. అందుచేత దీన్ని నేనే పోగొట్టుకోవాలి.' అని చెప్పుకో. నేను కట్టింది నేను పడగొట్టగలను. ఇతరులు చేసినదానిని నిర్మూలించడం నా తరంకాదు. ఈ నిశ్చయంతో లేచి నిలబడి ధైర్యం వహించి శక్తిమంతుడవు కా. సంపూర్ణ బాధ్యతను స్వీకరించి నీభవితవ్యానికి నీవే కారకుడవని తెలుసుకో! కావలసిన శక్తి సామర్థ్యాలన్నీ నీలోనే ఉన్నాయి. అందుచేత నీ భవిష్యత్తు నీవు పండించుకో! గతం గతం చచ్చినదాంతో జమ. దాన్ని గూర్చి బాధపడకు. ముందెంతో భవిష్యత్తు ఉన్నది. అది నీ అధీనంలో ఉన్నది. నీ మాట, నీ ఊహ, నీ చేత అన్నీ నీ భవిష్యత్తును నిర్మిస్తూనే ఉంటాయి. చెడ్డ ఊహలూ, చెడ్డ పనులూ

పెద్దపులులలా మీదికి దూకడానికి ఎలా సిద్ధంగా ఉంటాయో మంచి ఊహలూ మంచి పనులూ వెయ్యిమంది దేవతల శక్తితో నిన్ను సంరక్షించ డానికి అలాగే సిద్ధంగా ఉంటాయి. ఇది విస్మరించక హెచ్చరికతో ప్రవర్తించు.

## మన భవితవ్యానికి మనమే కారకులం

తగిన యోగ్యత సంపాదిస్తేనేగాని ఎవరికీ ఏదీరాదు. ఇది ఒక నిత్య సత్యం. ఒక్కొక్కప్పుడు ఇది కాదేమో అనిపించవచ్చు. కాని చివరకు దీన్ని మనం నమ్మక తప్పదు. ఒక డైశ్వర్యం కోసం జీవితమంతా కష్టపడతాడు. ఎన్నో మోసాలు చేస్తాడు. కాని చివరకు ఆ ఐశ్వర్యానికి వాడు తగడన్న సంగతి తేలిపోయి జీవితం చిక్కుల్లో పడి దుర్భరమే అవుతుంది. మన భోగం కోసం ఎన్నెన్నో పదార్థాలు సంగ్రహించి పెట్టుకోవచ్చును గాని వాటిల్లో మనకు యోగ్యత ఉన్నంతవరకే అనుభవానికి వస్తాయి. ఒక మూర్ఖుడు ఆబకొద్దీ లోకంలోని పుస్తకాలన్నీ కొనవచ్చు. కాని చదవ గలగడం వాని యోగ్యతను బట్టే ఉంటుంది. ఆ యోగ్యతను నిర్ణయించేది వాడు చేసుకున్న కర్మే.

మన కర్మే మన యోగ్యతనూ మన సామర్థ్యాన్నీ నిర్ణయిస్తుంది. మన మిప్పుడీ స్థితిలో ఉండడానికి మనమే బాధ్యులం. మనమేం కాదలచుకుంటే అది కాగలం, ఆ శక్తి మనలో ఉన్నది. ఇప్పుడు మనమున్న ఈ స్థితి మన పూర్వ కర్మ ఫలితమే అయినప్పుడు భవిష్యత్తులో మనం ఏ స్థితిని పొందదలిచినా ఇప్పటి కర్మలతో సాధించ వచ్చునని స్పష్టమవుతూ ఉంది అందుచేత మన లక్ష్యానికి అనుగుణంగా సంచరించడం మనం తెలుసుకోవాలి.

## సహాయం లోనుండే లభిస్తుంది

మనం పట్టుపురుగుల వంటివాళ్ళం. లోని పదార్థాల నుండి మనకు మనమే దారంతీసి దాంతో గూడుకట్టుకుని అందులో మన్ని మనమే బంధించు కుంటాము. కాని ఇది ఇలాగే ఎల్లకాలమూ ఉండదు. ఆ గూడులోనే ఆధ్యాత్మిక సాక్షాత్కారాన్ని పొంది సీతాకోక చిలుకలా ఎగిరిపోతాము ఈ కర్మవాగురను మనమే అల్లుకుని మన చుట్టూ పరచు కున్నాము. ఆ సంగతి తెలియక అజ్ఞానంతో బంధితుల మయ్యామని బాధ పడుతూ సహాయానికి గోలపెట్తాము. కాని సహాయం వెలుపలినుంచి ఎన్నడూ రాదు. మనలో నుండే వస్తుంది. ఉన్న దేవత లందరితోటీ మొర పెట్టుకో! నే నలా ఏళ్ళ తరబడి మొరపెట్టుకున్నాను. చివరికి సహాయం లభించింది. కాని అది లోనుండే వచ్చింది. పొరపాటున నా అంతట నేను చేసుకున్న దానిని నేనే దిద్దుకోవలసి వచ్చింది. ఇది ఒక్కటే మార్గం. నా చుట్టూ నేను వేసుకున్న వలను నేనే తెంపుకోవాలి. అలా తెంపుకునే శక్తి నాలోనే ఉన్నది.

మంచివి గాని చెడ్డవి గాని అన్ని ఆశయాలూ నా జీవితంలో ఫలించాయనీ, అయినా నేను పూర్వకృత సుకృత దుష్కృత సమాహార ఫలితాన్నే అనీ నా నిశ్చయం. నా జీవితంలో నే ననేక దోషాలు చేశాను. కాని ఆ దోషాలే నేను చేసిఉండకపోతే నే నిప్పుడున్న పరిస్థితిలో ఉండేవాణ్ణే కాను. ఈ నమ్మకం నాకున్నది కాబట్టి ఆ దోషాలు చేసి నందుకు నాకేమీ బాధలేదు. దీన్ని బట్టి మీరంతా ఇళ్ళకు వెళ్ళి ఇష్టపూర్వ కంగా దోషాలు చెయ్యాలని నా ఉద్దేశం కాదు. అలా నన్ను దురర్థం చేసుకోకండి. కాని దోషాలు జరిగినందుకు మిమ్మల్ని మీ రసహ్యించు కోకండి. చివరికి అంతా సక్రమ మవుతుందని తెలుసుకోండి మన సహజ స్వభావం మంచితనమూ, పవిత్రతా అయినందువల్ల మరొక విధంగా

కావడానికి వీలులేదు. స్వభావం వినాశం పొందేదికాదు. మన మూల స్వభావం ఎప్పుడూ ఒకరకంగానే ఉంటుంది.

## సౌశీల్యం ఎట్లా సాధ్యం ?

తనవైపుకు విశ్వంలోని సర్వ శక్తులనూ ఆకర్షించి వాటి నన్నిటినీ తనలో కరిగించివేసి మళ్ళీ వాటిని మహా ప్రవాహంగా బైటికి పంపే కేంద్రంవంటివాడు మానవుడు.

మంచి చెడ్డలూ, సుఖ దుఃఖాలూ అన్నీ అతని కభిముఖంగా వెళ్ళి అతన్ని ఆవరిస్తున్నాయి. వాటిల్లో నుండే అతను శీలం పేరిట మహా ప్రవాహతుల్యమైన దృక్పథాన్ని సృష్టించి వెలిజిమ్ముతున్నాడు. అన్నిటినీ ఆకర్షించే శక్తి ఉన్నట్టే వెలిజిమ్మే శక్తి అతనిలో ఉన్నది

ఎప్పుడూ చెడ్డమాటలే వింటూ, చెడ్డ భావాలే ఆలోచిస్తూ చెడ్డపనులే చేస్తూ ఉండే మానవుని మనస్సు దుష్ట సంస్కారపూరితమై ఉంటుంది. అతనికి తెలిసినా తెలియకపోయినా అతని ఊహలూ పనులు ఆ సంస్కార ప్రభావంతోనే కూడి ఉంటాయి ఈ దుష్ట సంస్కారం ఎప్పుడూ పని చేస్తూనే ఉంటుంది, దాని ఫలితం చెడుకాక తప్పదు. అందుచేత వాడు చెడ్డ వాడే అవుతాడు. తప్పించుకుందామన్నా వీలులేదు. వెనుక సంపాదించు కున్న దుష్ట సంస్కారం ప్రబలమై అతన్ని చెడ్డపనులకే ప్రేరేపిస్తుంది. ఆ సంస్కారం చేతిలో అతను పట్టి పనిముట్టై చెడ్డపనులే చేస్తూ వుంటాడు.

ఇదేవిధంగా ఎప్పుడూ మంచి మాటలే వింటూ. మంచి భావాలే ఆలోచిస్తూ. మంచి పనులే చేసేవాడికి ఏర్పడే సంస్కారం మంచి దవు తుంది అందుచేత అది అతనికి తెలియకుండానే అతన్ని మంచి పనులు చెయ్యడానికే ప్రేరేపిస్తూ ఉంటుంది. ఎన్నో మంచి పనులు చేసి, ఎన్నో

మంచి భావాలు ఆలోచించి ఎంతో మంచి సంస్కారం పొందినవాడు తానొకవేళ చెడ్డపని చెయ్యాలని సంకల్పించినా అతని సంస్కారం దాన్ని చెయ్యనివ్వదు, అతన్ని వెనక్కి మరలిస్తుంది, అతడు దానికి అశేనుడై ఉంటాడు అటువంటి స్థితిలో వున్న మానవుణ్ణి సిద్ధులు దంటాము. అతనిలో, సౌశీల్యం స్థిరపడినదన్నమాట.

వీణ మొదట్లో నేర్చుకునేటప్పుడు ఏ వేలు ఏ మెట్టుమీద ఉంచి ప్రయోగిస్తే ఏ స్వరం పలుకుతుందో ఎంతో జాగ్రత్తగా అభ్యాసం చెయ్యవలసి ఉంటుంది తిరిగి తిరిగి అభ్యాసం చెయ్యగా చెయ్యగా వేళ్ళకు అవసరమైన కదలిక అలవాటయిపోతుంది. చివరికి ఏ మెట్టుమీది కే వేలు పోతోందోనన్న ఊహే లేకుండా అవి వాటంతటవే కదులుతూ ఉండగా సాధకుడు వీణాగానం చెయ్యగలుగుతాడు. అలాగే మన విషయంలో కూడా మనం పూర్వం తెలిసిచేసిన పనుల మూలంగానే మన స్వభావాలు ఏర్పడుతూ ఉంటాయి.

## ఆత్మ నిగ్రహం

భావోద్వేగాన్ని యథేచ్ఛగా పోనిస్తే ఎంతో శక్తి వృథా అవుతుంది. నరాల పటుత్వం సడలి మనస్సు చెదరి ఏపనీకాదు. క్రియగా పరిణమించవలసిన శక్తి అంతా ఎందుకూ పనికిరాని ఉద్వేగంలోనే వ్యయమవుతుంది. మనస్సు నిబ్బరమై ఏకాగ్రంగా ఉన్నప్పుడే ఉన్న శక్తినంతటినీ మంచి పని చెయ్యడానికి ఉపయోగించగలుగుతాము. మహాకార్యాలు సాధించిన మహానుభావుల జీవిత చరిత్రలు చూస్తే వాళ్ళందరూ పరమశాంత మనస్కులని స్పష్టమవుతుంది. వాళ్ళ నిబ్బరాన్ని ఏ శక్తీ చెడగొట్టలేకపోయింది. నిబ్బరానికి ఈ ప్రాముఖ్యం ఉన్నందువల్లనే కోపంవచ్చినవాడు ఏమీ చెయ్యలేకపోవడమూ, దేనివల్లా కోపం పొందనివాడు ఎంతోపని చెయ్యగలగడమూ చూస్తూ ఉంటాము. కోపం, విద్వేషం మొదలైన ఉద్రేకాలకు

లొంగేవాళ్ళు ఏమీ చెయ్యలేరు. అవి వాటి కాశ్రయమిచ్చినవాళ్ళనే నాశనం చేస్తాయి. శాంతుడై క్షమాశీలియై, మనస్స్వాస్థ్యం చెడకుండా ఉండేవాడు ఎంతో గొప్పపని చెయ్యగలుగుతాడు.

నిగ్రహింపబడిన ప్రతి ఉద్వేగమూ నీ నిబ్బరాన్ని పెంచుతుంది. అందుచేత కోపంతో ఎదుర్కోకుండా ఉండడమే మంచి పద్ధతి. అందులో నీతీ ఉన్నది. దౌష్ట్యాన్ని నిరోధించవద్దని క్రీస్తు బోధించాడు. ఈ హిత బోధ తాత్పర్యం మనకు మొదట్లో అర్థంకాదు. కోపోద్రేకం పొందడం ఉన్న శక్తిని పాడుచేసుకోవడమే అవుతుంది. కాబట్టి నైతికంగా కాని తాత్త్వికంగా కాని ఎదుర్కోక పోవడమే మంచి పద్ధతి అని తెలిసిన తర్వాత అర్థమవుతుంది. క్రోధ విద్వేషాలకు మన మనస్సులను లొంగి పోనీయగూడదు.

నాలుగు గుఱ్ఱాలబండి పర్వతంపైనుండి క్రిందికి నిర్నిరోధంగా పరుగెత్తవచ్చు లేదా సారథి గుఱ్ఱాలను అదుపులో పెట్టవచ్చు. ఎందులో నిజమైన శక్తి ఉందంటారు? వాటిని పోనీయడంలోనా, అదుపులో పెట్టడం లోనా? గాలిలోకి పేల్చిన తుపాకిగుండు చాలాదూరం పోయి పడిపోతుంది. గోడను గురిచూచి పేలిస్తే గుండువెళ్ళి గోడనుతాకి ఘర్షణవల్ల తీవ్రమైనవేడి పుట్టుతుంది. స్వార్థ పరత్వంలో బహిర్గతమయ్యే శక్తి యావత్తూ చెల్లా చెదరై పోతుంది. అది మళ్ళీ మనకు చేరదు. నిగృహీత మయితే మనలోని శక్తి పెరుగుతుంది. ఈ ఆత్మ నిగ్రహం వల్ల దృఢ సంకల్పమూ, ఉత్తమ శీలమూ కలిగి క్రీస్తులూ, బుద్ధులూ ఆవిర్భవిస్తారు.

తీవ్రమైన క్రోధావేశం వస్తే దాన్ని మనం ఎలా నిగ్రహించడం? దానికి వ్యతిరేకమైన మరొక ఆవేశం తెచ్చుకోవాలి. క్రోధం కలిగినప్పుడు ప్రేమను భావనచేస్తే సరిపోతుంది. తల్లికి భర్తమీద కోపం వచ్చిన సమయంలో పసివాడు సమీపించాడనుకోండి. ఆ కోపాన్ని అలాఉంచి ఆమె పసివాణ్ని లాలించి ముద్దు పెట్టుకుంటుంది. ఆమె మనస్సులో ఒక

ఉద్రేకం అణగి మరొక ఉద్రేకం వచ్చిందన్నమాట. ఈ ప్రేమ పొంగుతో ఆ కోపపు పొంగు అణిగిపోయింది. క్రోధానికి ప్రతిస్పర్ధి ప్రేమ. ఇలాగే దొంగిలించాలన్న 'దుర్బుద్ధి' పుట్టినప్పుడు ఇవ్వాలన్న సద్భావాన్ని స్మరించాలి. కానుకలు స్వీకరించే తలపును దానికి వ్యతిరేకమైన తలపుతో జయించాలి.

నిస్తబ్ధ నైశ్చల్యంలో తీవ్ర చైతన్యాన్నీ, తీవ్ర చైతన్య మధ్యంలో నిర్చల నిస్తబ్ధతనూ అనుభవించ గలిగినవాడే ఆదర్శ మానవుడు. వానికి నిగ్రహ రహస్యం తెలిసిందన్నమాట. అతడు తన్ను తాను నిగ్రహించు కున్నవాడు. అట్టివాడు అనేక కార్య కలాపాలతో నిర్విరామంగా తిరుగుతూ ఉండే రకరకాల శకటాలతో నిత్య సంకులమై ఉండే మహాపట్టణాల్లో సంచరిస్తున్నా ఏకాంతమైన కొండగుహలో ఉన్నట్టే. అతని మనస్సు నిశ్చలంగానే ఉంటుంది. చుట్టూ జరుగుతున్న వాటితో సంబంధం లేకుండానే అతడెప్పుడూ తనపని తాను చేస్తూనే ఉంటాడు. ఇదే ఆదర్శ కర్మయోగం. అది నీకు లభిస్తే నీకు కర్మ రహస్యం తెలిసిందన్నమాట.

## యథార్థ భావాల శక్తి

గౌతమ బుద్ధుడు తాను ఇరవై ఐదవ బుద్ధుడనని పదే పదే చెప్పి నట్టు అతని జీవిత చరిత్రలో కనిపిస్తుంది. చరిత్రకు తెలిసిన బుద్ధుడు తన పూర్వులు వేసిన పునాదుల మీదనే పెరిగినవాడైనా అతనికి వెనుక, నున్న ఇరవై నలుగురు బుద్ధుల సంగతి లోకానికి తెలియరాలేదు.

మనుష్యులలో అత్యున్నతు లెప్పుడూ శాంతులుగా, మౌనులుగా అవిదితులుగా అయిఉంటారు. భావనా బలాన్ని నిజంగా తెలుసుకున్న మహానుభావులు వాళ్ళే. తాము గుహలో కూర్చుని ఎవరికీ తెలియ కుండా ఉండి తమలో తాము ఏ ఉత్తమ భావాలను భావించి చనిపోయినా ఆ భావాలు శాశ్వతంగా నిలుస్తాయని వాళ్ళకు తెలుసు. నిజంగా అటువంటి

భావాలు పర్వతాలను దూసుకుపోయి. సముద్రాలు దాటి, సర్వ ప్రపంచం లోనూ వ్యాపిస్తాయి. అవి మానవుల హృదయాల్లోనూ, మనస్సుల్లోనూ అంతరాంతరాల్లో ప్రవేశించి వాళ్ళ నుద్ధరిస్తాయి. వాళ్ళ మూలంగానే ఆ భావాలు మానవ జీవితంలో ఆచరణలోకి వస్తాయి.

## మీరు స్వయంగా ఋషులు కావాలి

ఋషులు బోధించే దేమిటో తెలుసుకుని ఊరుకుంటే చాలదు. ఆ ఋషులు వెళ్ళిపోయారు. వాళ్ళతోపాటే వాళ్ళ అభిప్రాయాలూ వెళ్ళిపోయాయి. మీ అంతట మీరు ఋషులు కావాలి. మీరుకూడా ఈ జగత్తులో ఉద్భవించిన ఉత్తమ మానవు లెంత గొప్పవాళ్లో అవతారపురుషు లెంత గొప్పవాళ్లో అంత గొప్పవాళ్ళు. వట్టి పుస్తక జ్ఞానంవల్ల ప్రయోజన మేమిటి ? ధ్యానం మాత్రం ఏం చేస్తుంది ? మంత్ర తంత్రాలు ఏం చేస్తాయి ? మీ కాళ్ళ మీద మీరు నిలబడాలి.

## నిజమైన మానవుడు

మానవతా ప్రతిష్ఠాపన మనే ఈ నవ్య మార్గాన్ని మీ రవలంబించాలి. నిజమైన మానవుడంటే మూర్తీభవించిన బలమై ఉండీ కూడా స్త్రీ హృదయం కలవాడు కావాలి. నీ చుట్టూ ఉన్న జీవకోటికొరకు పరితపించే వాడవు కావాలి. అయినా సడలని శక్తి సామర్థ్యాలతో మెత్తబడకుండా ఉండాలి. వీటికి తోడు విధేయతా ఉండాలి. ఇవన్నీ పరస్పర విరుద్ధంగా తోస్తాయిగాని పైకి అలా అనిపించే ఈ లక్షణాలన్నీ నీలో ఉండాలి. నీకంటె ఉన్నతుడు నిన్ను సముద్రంలోకి దూకి మొసలిని పట్టుకోమంటే ముందా పని విధేయతతో చేసి తర్వాత అవసరమయితే అతనితో వాదించాలి. ఆజ్ఞలో దోషమున్నాసరే, ముందు విధేయుడవు కావాలి, తర్వాత వ్యతిరేకించాలి.

మనలో ఎవరికైనా అభిప్రాయంలో ఏ కొంచెం తేడా వచ్చినా వాడుపోయి కొత్త వర్గాన్ని ప్రారంభిస్తాడు. కొంచెం ఆగుదామన్న ఓపిక బొత్తిగా ఉండదు. ఇది మన వర్గాల్లో ఉన్న పెద్ద జబ్బు. అందుచేత నీవు ఉన్న సంఘంపట్ల ఆత్మ దఘ్నమైన గౌరవం కలిగిఉండాలి. సంఘంలో అవిధేయతకు స్థానంలేదు. శిబిరంలో ద్రోహులుండడానికి వీలులేదు. గాలి అంత స్వేచ్ఛగా ఉంటూ కుక్కవలె మొక్కవలె విధేయుడవై ఉండాలి. సన్న్యాసులే ఇప్పుడు కావలసినది

కొందరైనా గార్హస్థ్యంలో పడిపోక బైట నిలబడి తమ జీవితాలను భగవదర్పితంచేసి ప్రపంచ క్షేమానికై మతాన్ని రక్షించాలి. నీవు వస్తే రా, ధైర్యంగా నిలబడు. ఒక వందమంది ప్రాణాలు కోలుపోయినా పతాకాన్ని పట్టుకుని ముందుకు నడు ఎవరు పడినా, ఎంతమందిపడినా లెక్కలేదు. భగవంతుడున్నాడు. నీవూ పడిపోయే పరిస్థితివస్తే ముందుకు తీసుకు పోయే మరొకడికి పతాకాన్ని అందించు! మనుష్యులు పడవచ్చునుగాని అది పడనేపడదు!

అల్ప జీవితాలతో కాలక్షేపంచేసే గృహస్థులు ఏం చేయగలరు? శివుని ప్రమథగణాలవంటి సన్న్యాసులే హరహర మహాదేవ శంభో అంటూ జయ జయ నినాదాలతో ఆకాశాన్ని చీల్చివెయ్యాలి.

భవిష్యత్తును గూర్చిన నా ఆశలన్నీ శీలవంతులై, ప్రతిభావంతులై, ఇతరుల సేవకై అన్నీ త్యజించి, విధేయతతో నా భావాలను ఆచరణలో పెట్టి తమకు తాము మేలుచేసుకుంటూ దేశానికుపకారం చేసేటందుకు జీవితాలు అర్పించగల యువకులమీద ఆధారపడిఉన్నాయి. కాకపోతే సామాన్య యువకులు గుంపులు గుంపులుగా వస్తూనే ఉన్నారు, ఇంకా వస్తారు. వాళ్ళ ముఖాల్లో తెలివితేటలు కనిపించవు, హృదయాల్లో ఉత్సాహం శూన్యం, మనస్సుల్లో ధైర్యం లేదు. దుర్బల శరీరాలతో ఏ పని చెయ్యడానికీ పనికిరారు. ఇటువంటి వాళ్ళతో పనేమవుతుంది? నచికేతుని

వలె గాఢ విశ్వాసం కలవాళ్ళు పది పన్నెండుమంది దొరికితే ఈ దేశాన
తటినీ కదిలించివేసి భావంలోనూ నడతలోనూ కొత్త మార్గానికి త
గలను.

నాకు తటస్థపడిన యువకులలో సమర్థులనిపించిన కొందరు అప్ప
గార్హస్థ్య బంధాలలో చిక్కుకుని ఉన్నారు. కొందరు లౌకిక ప్రయోజన
కమ్ముడుపోయారు. కొందరు దుర్బలులు అధిక సంఖ్యాకులయిన మిగి
వాళ్ళు ఉన్నత భావాలు స్వీకరించే యోగ్యత లేనివాళ్లు.

ఏమైనా భగవదిచ్ఛ ఉన్నట్లయితే ఈ చేరిన యువకులలోను
కర్మశూరులూ, ఆధ్యాత్మిక వీరులూ బయలుదేరి భవిష్యత్తులో నా భావా
కార్యరూపం తేగలిగేవాళ్ళు కావచ్చు.

## విద్యావంతులైన యువకులను సంఘటితం చెయ్యాలి

విద్యావంతులైన యువకుల నాకర్షించి, వాళ్ళందరినీ ఒకచోట చే
సుశిక్షితమైన సంఘాన్ని నిర్మించాలి. మహాకార్యాలు మహత్తర త్యాగ
తోనే అవుతాయి. ధీరోదాత్త సుజనులారా, రండి, పని చెయ్యండి. జాతీయ
దర్శనభావాన్ని, ప్రణాళికను ఆచరణలో పెట్టండి నడుములు కట్టి ఉద్యమి
చండి. పేరూ ప్రతిష్ఠా మొదలైన వ్యర్థ విషయాలకోసం ఆగిపోం
వెనక్కి చూడకండి. స్వార్థాన్ని దూరంచేసి కార్యరంగంలోకి దూకండి
గడ్డిపరకలైనా అన్నీ ఏకమైతే ఉన్మత్తగజాన్ని కూడా బంధించగలవన
మాట జ్ఞప్తికుంచుకోండి.

## హే భగవాన్! శ్రీరామకృష్ణా!

విశ్వ సమన్వయ సిద్ధాంత ప్రవక్తలు, జగద్గురువులు నయి
శ్రీరామకృష్ణ పరమహంసలను మీ అందరి హృదయాల్లోనూ ఆ

ష్కృతం కావలసిందని నే నిప్పుడు ప్రార్థిస్తున్నాను. ఆయన అనుగ్ర హంతో మీరు మీమీ ఆశయాలను సఫలం చేసుకుంటూ భయంకరమైన అజ్ఞాన సాగరంలో నిమగ్నులై ఉన్న ఇతరులను ఉద్ధరించడానికి ధీర నిర్భయ హృదయాలతో శక్తివంచన లేకుండా కృషి చెయ్యగలుగుతారు.

మీ రెప్పుడూ ధైర్యసాహసవంతులై ఉందురుగాక : దాస్యవిమో చనం వీరునకే సమీపంలో ఉంటుంది, భీరునకు కాదు. వీరులారా ! నడు ములు కట్టి ఉద్యమించండి, మీరు ఎదుర్కోవలసినది అవివేక మహా ప్రభువు బలవత్తర సైన్యాలను : ఎన్నో అవరోధాలను అతిక్రమించందే ఏ మహా కార్యమూ సాధ్యంకాదన్నమాట నిజమే ! అయినా మీరు వాటికి జంకక మీ శక్తి సామర్థ్యాలు వినియోగించి సర్వాత్మనా కృషిచెయ్యండి.

పురశ్చల : ప్రస్థితోభవ : ధీర యువకులారా : బంధనాలలో క్రమగ్గుతున్న దీనులను విడుదలచెయ్యడానికి, దుస్థితిలో వున్నవారి దుఃఖ భారాన్ని తొలగించటానికి అజ్ఞానాంధ తమస్సులో పడిఉన్నవారి హృద యాలలో జ్ఞానజ్యోతి వెలిగించడానికి, ధైర్యంతో పురోగమించండి, డిండిమాన్ని మ్రోగిస్తూ వేదాంతం ఏమిచెపుతోందో గమనించండి. 'నిర్భయుడవై యుండు :' ఈ డిండిమధ్వానం భూలోకవాసుల హృదయ గ్రంథులను విచ్ఛిన్నం చేయునుగాక :

## ఓ హిందువులారా ! మూర్ఛనుండి తేరుకోండి

మన మీ ఉపనిషత్ప్రబోధాన్ని ప్రతి జీవునకూ అందిద్దాము. ఉత్తి ష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత : లెండి, మేలుకోండి, లక్ష్యం సిద్ధించే వరకూ ఆగబోకండి ! - లెండి, మేల్కోండి : అదీ మాట ! మిమ్మల్ని క్రమ్ముకొన్న దౌర్బల్యమూర్ఛనుండీ మేలుకోండి. ఎవ్వరూ నిజానికి దుర్బలులు కారు. ఆత్మ అనంతమూ, సర్వవ్యాపీ, సర్వగతమూ : లేచి నిలబడండి. సర్వాత్మనా కృషిచెయ్యండి. మీలోని దైవాన్ని ప్రకటిం

చండి. ఆయన్ని కాదనకండి. విడిపోని జడత్వం, దుర్భర దౌర్బల్యం తెగని మూర్ఛా మనజాతిని క్రమ్ముకున్నాయి.

ఆధునిక హిందువులారా ! మీ మోహాన్ని మీరే పోగొట్టుకోవ మోహ నిరసన మార్గాలు మీ పవిత్ర గ్రంథాల్లోనే ఉన్నాయి. మీకు మీ బోధించుకోండి ! అందరికీ చెప్పండి ! స్వస్వభావ మేమిటో తెలిస్తే ని స్తున్న జీవు లందరూ ఎలా మేల్కొంటారో చూడండి సుప్తమైన జీవా ప్రబుద్ధమై సహజ చైతన్యాన్ని పొందినప్పుడు శక్తి వస్తుంది, ఔజ్జ్వ వస్తుంది, మంచితనం వస్తుంది. అన్ని మంచి లక్షణాలూ వస్తాయి

## ప్రబుద్ధ సముజ్జ్వల భారతం

నేను భవిష్యత్తు నూహించడంలేదు. అలా ఊహించాలన్న ద లేదు. నా కళ్ళముందు ఈ జీవితంతో తుల్యంగా ఒకే ఒక దృ స్పష్టంగా కనిపిస్తోంది. అనాదియైన మన దేశమాత మళ్ళీ నిద్ర లేచి సింహాసనస్థయై ఎప్పటికంటే ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. శాంతి సందే తోనూ, శుభాకాంక్షలతోనూ ప్రపంచాని కామెను ప్రకటించండి !